# మాలపల్లి - గోదాన్
## నవలల తులనాత్మక పరిశీలనం

ఎం.ఫిల్ పరిశోధనా వ్యాసం

ననుమాస స్వామి
ఎం.ఏ, ఎం.ఫిల్ (తెలుగు)
ఎం.ఏ (చరిత్ర)

ఉదయశ్రీ ప్రచురణలు
సికింద్రాబాద్

MAALAPALLI - GOODAAN A COMPARITIVE STUDY

By Nanumasa Swamy,
Lecturer in Telugu,
Andhra Vidyalaya College,
Gaganmahal, Hyderabad - 500 029.

ప్రచురణ : 1

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్, 1986

వెల : రూ. 20-00

ముఖపత్రం : కె. నాగేశ్వరరావు

ప్రతులకు :

ఉదయశ్రీ ప్రచురణలు
12-10-682, సీతాఫల్‌మండి,
సికింద్రాబాద్-500 361

సుధ బుక్‌హౌస్
సీతాఫల్‌మండి, సికిందరాబాద్-500 361

ముద్రణ
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1-1-694/2/ఎ గాంధీనగర్
హైదరాబాద్ 500 380

(తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థికసహాయముతో ప్రచురితము)



విద్యార్థి దశలోనే
విమర్శపైన నాకు
అభిరుచిని కలిగించి,
అన్ని వేళలా
వెన్ను తట్టి నిలబెట్టిన
విశ్వంభరా హృదయులు

**ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి**
**ఆరాధనాభావంతో**

పద్మశ్రీ, కళాప్రపూర్ణ
**డా॥ సి. నారాయణరెడ్డి**
ఎం.ఏ, పి.హెచ్ డి, డి.లిట్.

'త్రివేణి' వివేకనగర్
హైదరాబాద్ 500 020.
ఫోన్ నెం. 63068

# స్వీకృతి

స్వామి ఎం.ఏ లో మా పూర్వవిద్యార్థి. వినయాన్నీ, వివేకాన్నీ కలగలుపుకున్న జిజ్ఞాసువు.

తెలుగు నవలా రంగంలో ఉన్నవ యుగకర్త. హిందీలో ప్రేమ్‌చంద్ పథ నిర్దేశకుడు. ఉన్నవ మాలపల్లినీ, ప్రేమ్‌చంద్ గోదాన్‌నీ తులనాత్మకంగా పరిశీలించాలని అనుకోవడంలోనే స్వామి విజ్ఞత స్పష్టమవుతున్నది.

పరిశోధనకు స్వీకరించిన ఈ వస్తువును జాగ్రత్తగా విశ్లేషించి మంచి సిద్ధాంతవ్యాసం రచించి పట్టా అందుకున్నాడు స్వామి. నా మీద అభిమానంతో ఆ గ్రంథాన్ని నాకు అంకితం చేస్తున్నాడు. కృతజ్ఞతలతో స్వీకరిస్తున్నాను.

సి. నారాయణరెడ్డి

నసుమాస స్వామి

పుట్టింది : 1952 జనవరి 1న
చెన్నారావుపేట మండలంలో

పెరిగింది : వ్యవసాయ కుటుంబంలో

చదువు : ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి
ఎం.ఏ ; ఎం.ఫిల్. (తెలుగు) ; ఎం.ఏ. (చరిత్ర)
ప్రస్తుతం తెలుగు సాహిత్యంలో "తెలుగు నవల–
అస్పృశ్యతా సమస్య" అంశం మీద పరిశోధన

ఉద్యోగం : 1981–83 ల నడుమ రైల్వే డిగ్రీ కాలేజీలో,
1983 నుంచి ఆంధ్ర విద్యాలయ కాలేజీలో అధ్యాపకత్వం....

# విషయ విభాగము

ఆచార్య నాయని కృష్ణకుమారి
అధ్యక్షులు
తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్.
19-9-1986

# ముందుమాట

'మాలపల్లి — గోదాన్' నవలల తులనాత్మక పరిశీలన చూచాను. శ్రీ ఎన్. స్వామి పరిశోధన విషయంగా దీన్ని గ్రహించి యం.ఫిల్ పట్టాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి అందుకున్నాడు.

భారతదేశం బహుభాషల కాణాచి. ఎన్ని అద్దాలలో చూచినా, ఒక ముఖం ఒకే విధంగా కనిపించేటట్లు, ఎన్ని భాషలకు సంబంధించిన సాహిత్యాన్ని పరిశీలించినా, భారతీయ సంస్కృతి ఒకే విధంగా కనిపిస్తుంది. మనుష్యులూ, వాళ్ళు తమ జీవితం నడుపుకునే పద్ధతీ, వాళ్ళ ఆలోచనాధార, కష్టసుఖాలకూ కలిమి లేములకు వాళ్ళు స్పందించేతీరూ, అన్నీ చిక్కని పోలికలు కలిగే ఉంటాయి. మనస్సు అనేది బహుచిత్రమైనది. ఇది ఘన ద్రవవాయురూపాలలో దేనికి చెందిందో మనకు తెలియదు. మానవ శరీరంలో దీనికి ప్రాతినిధ్యం వహించే అంగమేమిటో అంతు పట్టదు. మామూలుగా ఎవరైనా మనస్సును గురించి చెప్పుకుంటూ గుండెవైపు చూపించుకుంటారు. కాని ఇది గుండెకూ, మెదడుకూ కూడా పూర్తిగా సంబంధించని, లేదా అరకొరగా సంబంధించే, అద్భుత పదార్థం. ఈ మనస్సు, భూమండలంమీద ఏమూలనున్నా ఒకే రకంగా స్పందించడం ఆశ్చర్యకరమైన విషయం. ఈ లోకంలో ఆది కావ్యాలవంటివి, ఏభాషకు సంబంధించినవైనా ఏకీకృత స్పందనవే తెలియచేస్తూ ఉంటాయి. ప్రాచీనమో, ఆధునికమో, అధునాతనమో. అనే కాలంగిచే అడ్డు కట్టలుగానీ, కులమూ, మతమూ, భాష అనే

నిర్బంధాలు కానీ, మానవ హృదయస్పందనకు లేవు. కష్టం కలిగినప్పుడు కన్నీళ్ళు ఎవరికైనా ఒకే విధంగా వస్తాయి. సుఖపారవశ్యంలో ఏ ముఖమైనా విరిసిన కమలంలా రహిస్తుంది.

ఈ న్యాయాన్ని మాలపల్లి — గోదాన్‌లకు సంబంధించిన ఈ తులనాత్మక పరిశీలన ఋజువుచేస్తున్నది.

ఉన్నవ, ప్రేమ్‌చంద్‌ల వ్యక్తిగతజీవనాలలో చాలా పోలికలున్నాయి. ఇద్దరూ 19వ శతాబ్ది ఉత్తరార్థంలో పుట్టినవారు. ఇద్దరూ ఉపాధ్యాయవృత్తి నిర్వహించినవారు. ఉన్నవ వితంతువులకు వివాహాలు చేయించి, శరణాలయాలు స్థాపించి, వారికోసం పాటుపడితే, ప్రేమ్‌చంద్ వితంతువును స్వయంగా వివాహం చేసుకున్నవాడు. గాంధీజీ పిలుపువిని ఇద్దరూ స్వరాజ్యసమరంలోకి దూకినవారే; జాతీయోద్యమానికి బాసటగా నిలిచినవారే.

ఇద్దరి రచనల్లో గ్రామీణ జీవన చిత్రణ ప్రధానస్థానాన్ని పొంది కని పిస్తుంది. గోదాన్ - మాలపల్లి నవలల కథలు, గ్రామీణ వాతావరణం చుట్టూ, గ్రామ పెత్తందారీతనం చుట్టూ తిరిగే కథలు. వీటిల్లో ఉండే కథాంశం వేరుగా అనిపించినా, కథకు లొంగి చిత్రీకరింపబడిన పాత్రల మనస్తత్వం మాత్రం పోలికలు కలిగి కనిపిస్తుంది. భూస్వాముల దురంతాలు, రైతులు అందుకు లొంగి క్రమంగా వ్యవసాయం చేసుకునే కూలీలుగా మారడం, ఈ అంశాలు రెండు పుస్తకాలలోనూ ఉన్నాయి. అవి సమకాలీన సమాజంలో కనిపించే చేదు నిజాలు.

మాలపల్లి - గోదాన్‌లు రెండూ, మానవతతో స్పందించే రెండు హృద యాలు. అడుగు జాతి బాధల్ని చాటడానికీ, వాటిపరిష్కారాన్ని సాధించ డానికీ, ఎత్తిన ధ్వజాలలాగా గర్వంగా, అతివీరతా లక్షణంతో రెపరెపలాడుతూ కనిపిస్తాయి.

ఈ విషయం ఈ పుస్తకం చదివేవాళ్ళకు తెలుస్తూనే ఉంటుంది. మానవ స్వభావాధ్యయనానికి, భారతీయమైన, ఆ మాటకువస్తే, విశ్వజనీనమైన ఏకాత్మ భావాన్ని చాటి చెప్పడానికి, ఇటువంటి తులనాత్మకాధ్యయనాలు ఎన్నైనా అవసరమే. సాహిత్య విమర్శపరంగా ఒక మంచిప్రయత్నానికి అక్షరరూపాన్నిచ్చిన ఈ చిరంజీవికి ఆశీస్సులు.

ఈ గ్రంథానికి సాదరాహ్వానం.

## ఆచార్య ఎం. కులశేఖరరావు

విజ్ఞానపురి - విద్యానగరం

హైదరాబాదు.

12-9-86

# ఆకాంక్ష

ఈనాడు విశ్వవిద్యాలయాల్లో బహుముఖంగా పరిశోధనలు జరుగుతున్నాయి. ఇదివరకు కేవలం సాహిత్యం - అందులోను ప్రాచీన సాహిత్యంవరకే పరిమితమై ఉండిన పరిశోధన ఇప్పుడు బాగా విస్తరించి, నూతనత్వాన్ని సంతరించుకొన్నది. మన సమాజం ఎంతటి విస్తృతిని పొందిందో, ఈ నాటి పరిశోధన రంగంకూడా ఆ స్వరూపాన్ని ధరించింది అనడం సముచితంగా ఉంటుంది.

పాశ్చాత్య భాషాసాహిత్యాల ప్రభావం మనసాహిత్యంమీద ప్రసరించడంతో, మన సాహిత్యానికి ఆధునికత అనే కొత్త లక్షణం ఏర్పడింది. దానితో కేవలం పద్యగద్యాల్లో ఉండే సాహిత్యం, అనేక నూతన ప్రక్రియల్లో రూపుదిద్దుకొన్నది. పరిణామంగా క్రొత్త ఆలోచనా విధానాలు, సంక్లిష్ట సిద్ధాంతాల స్వరూప స్వభావాలు మన సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. అన్ని విధాల ఈ నూతన స్వరూపావిర్భావం భాషకు, భావాలకు ఆరోగ్యకరమైన లక్షణమని చెప్పవలసి ఉంటుంది.

ఈ నేపథ్యంలో దాదాపు నూరేండ్లనాడు నవల అనే నూతన ప్రక్రియ తెలుగుసాహిత్యంలో అడుగుపెట్టింది. కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్వర్ణహస్త ప్రభావమేమోకాని, ఆయన ప్రారంభించిన ఈ సాహిత్య పద్ధతి ఈ నూరేండ్లలో అనంతంగా విస్తరించింది. నవలా రచన చేసేవారి సంఖ్య, వాటిని చదివే వారి సంఖ్య నానాటికి వృద్ధి అవుతూనే ఉన్నది. తెలుగు నవలకు, తెలుగు

వారి జీవితానికి విడరాని సంబంధం ఏదో ఉండడం చేతనే ఈ పరిణామం ఏర్ప డిందని భావిస్తాను.

వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్ర' సామాజిక విన్యాసాలను మాత్రమే చూపించి మన సమాజం ముందడుగు వేయాలని సూచించింది. ఉన్నవ లక్ష్మీ నారాయణగారు మరొక అడుగు ముందుకువేసి ఆనాడు సమస్తదేశాన్ని సంచ లితంచేసిన గాంధేయవాదాన్ని వస్తువుగాచేసుకొని 'మాలపల్లి' రచించినాడు. గాంధీగారు, సత్యాగ్రహాలూ రాజకీయ సమావేశాలు చేసి ప్రజలను జాగృతం చేస్తే, ఉన్నవవారు ఈనవలను సాధనంగా చేసుకొని తెలుగు ప్రజలకు ప్రబోధం చేసి కనువిప్పు కలిగించినారు, సాహిత్యానికి ఎంతటి శక్తి ఉన్నదో ఋజువు చేసినారు తెలుగుదేశం ఉన్నవ వారికాలంలో ఏస్థితిగతుల్లో ఉండేదో తెలసికొన డానికి ఇప్పుడు మనకు 'మాలపల్లే' శరణ్యం.

గాంధీగారి ఉద్యమంలో హరిజనోద్ధరణ చాల ప్రధానమైన అంశం. తగినంత సంఖ్యకలిగిన ఒక వర్గంవారు, ముందుకు రానంతకాలం, వారిలో చైతన్యం ఏర్పడనంతకాలం, మనకు స్వాతంత్ర్యం రాదని, అది వచ్చినా ఫలితం లేదని భావించి ఉద్యమించినాడు గాంధీజీ. ఈ ఉద్యమాన్ని త్రికరణ శుద్ధిగా నమ్మిన లక్ష్మీనారాయణగారు తమ నవలలో కథారూపంగా, కాంతా సమ్మితంగా ఈ ఉద్యమాన్ని తెలుగు ప్రజల మనస్సులో ప్రవేశపెట్టి వారికి చైతన్యం కలిగించినారు/

ఇది ఇట్లా ఉండగా, మున్షీ ప్రేమ్‌చంద్ ఉత్తర భారతదేశంలో, కథాని కను, నవలను సాధనాలుగా గ్రహించి ఆనాటి సమాజంలో అక్కడివారిని జాగృతం చేయడానికి పూనుకొన్నాడు. లక్ష్మీనారాయణగారుచేసిన పనే యిది. విశేషమేమంటే, ఈ ఇద్దరు నవలాకారులు తమ ఉద్దేశ్యం నెరవేర్చడంలో కృత కృత్యులైనారు. మున్షీగారి నవల 'గోదాన్' "నవల మాత్రమే గాదు అది ఒక డాక్యుమెంటరీ కూడా. రచనా కాలానికి సంబంధించిన ఉత్తర భారతదేశం డాక్యు మెంటరీగా దాన్ని చెప్పొచ్చును. పరాయి ప్రభుత్వంలోని జమీందారీ వ్యవస్థ

పంచాయితీ వ్యవస్థల పాలన నడుమ రైతుల కడగండ్లు సాంఘిక వ్యవస్థలోనికట్టు బొట్లు కులాల నడుమ సంఘర్షణలు, కులాంతర మతాంతర, ప్రేమ వివాహాలు, నాటి పరిణామాలు, కార్మికుల ప్రతిఘటనలు దానిలో చిత్రితమైనాయి." అనాటి సాంఘిక వ్యవస్థకు, సంస్కృతి స్థితిగతులకు, 'గోదాన్' ఒక చక్కని ప్రతిబింబం.

వర్ధిష్ణువు ఎన్. స్వామి ఈ రెండు నవలల్లోని విశేషాలు సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించి ఈ చక్కని సిద్ధాంత గ్రంధాన్ని కూర్చినాడు. భిన్నమైన భాషల్లో ఉండే రెండు ఉత్తమ నవలలను తులనాత్మకంగా పరిశీలించి, విశేషాలను విశ్లేషించడం సామాన్యమైన పనేమీ కాదు. అయినా స్వామి దానిలోని సాధక బాధకాలను, కష్టసుఖాలను ఎదుర్కొన్నాడు. మంచి గ్రంధాన్ని రచించినాడు. ఇటువంటి అంతర్భాషా పరిశీల గ్రంధాలు మనకు ఎక్కువగా లేవు. ఆ కొరతను కొంత వరకైనా ఈ యువ రచయిత తీర్చగలిగినందుకు స్వామిని అభినంది స్తున్నాను. ఇకముందు కూడా సాహిత్య పరిశోధన కొనసాగించి ఈ రచయిత సామాజిక విలువ కలిగినట్టి గ్రంధాలను రచించాలని ఆకాంక్షిస్తున్నాను.

డా. భీమసేన్ నిర్మల్
ఆచార్య, అధ్యక్ష
హిందీశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్.
18-6-1986

# రెండు మాటలు

సమాన - విభిన్న దృక్పథాలను పరిశీలిస్తూ, మానవజాతిలోగల సమైక్యతను తులనాత్మకాధ్యయనం నిరూపిస్తుంది. అది భాషాగతంకాక, భావగతమయిన ఏకరూపతను ప్రతిపాదిస్తుంది. వేర్వేరు భాషలు మాట్లాడే వారిలో పరస్పరం అవగాహనను, సౌహార్ద్రతను పెంపొందించి, విశ్వమానవ సౌభ్రాతృత్వ సంస్థాపనకు కృషి చేయడం తులనాత్మకపరిశీలనకు ప్రధానలక్ష్యం.

అనేక భాషలతో, ఆయా భాషలలోని సమృద్ధ సాహిత్య సౌరభాలతో పరిమళిస్తున్న నందనోద్యానం మన భారతదేశం. ఆయాభాషలను వాటిలోని సాహిత్యాలను ఏకసూత్రనిబద్ధం చేసేది భారతీయ సంస్కృతి. విభిన్నమయిన లిపులలో వ్రాయబడిన భారతీయ సాహిత్యంలోని భావవాహిని, అంతర్వాహిని ఒక్కటే. అంచేతనే రాధాకృష్ణ పండితుడు *the scripts are different but soul is the same* అన్నాడు.

భారతీయ భాషలు, సాహిత్యాలు ఒకే మూసలోనుంచి వెలువడ్డవనే విషయం తులనాత్మక పరిశీలనవల్లగాని ఉద్ఘాటితం కాలేదు. అయితే ఈ కార్యక్రమం కేవలం హిందీ వరకే పరిమితమయి ఉండడం శోచనీయం. విశ్వవిద్యాలయాలలోని హిందీవిభాగాలతోపాటు, ఇతర భాషావిభాగాలు కూడా తులనాత్మక పరిశీలనకు ప్రోత్సాహం కల్పించడం అవసరం. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో

తెలుగుశాఖ అందుకు పూనుకోవడం ముదావహం. తత్పరిణామమే శ్రీ ఎస్. స్వామిగారు పరిశోధించి వెలువరించిన ఈ వ్యాసం.

గాంధీవాద ప్రభావం భారతీయభాషల సాహిత్యాలన్నింటిలోను కనిపిస్తుంది. హిందీకథా సాహిత్యంలో అనితర సాధ్యమయిన మార్పును తెచ్చిన ప్రేంచందు, తెలుగు కథా సాహిత్యంలో యుగపురుషుడయిన ఉన్నవ లక్ష్మీనారాయణగారు, తమ రచనల్లో గాంధీవాద సిద్ధాంతాలచే ప్రేరితులయి, అలనాటి సమాజానికి అద్దం పట్టేరచనలను, అవీ ఆదర్శోన్ముఖమయిన కథలు, నవలలు వ్రాసారు. చక్కటి భాషలో, సత్యాన్ని వ్యక్తీకరిస్తూ, మనస్సుమీద, మేధస్సుమీద ప్రభావాన్ని కలిగించే సాహిత్యరచనచేసి అమరులయిన సరస్వతీ పుత్రులు వారు. వారి రచనలు విశ్వసాహిత్యంలోనే మణిదీపాలవంటివి అంటే అతిశయోక్తికాదు.

శ్రీ ఎస్. స్వామిగారు తమ పరిశోధనావ్యాసంలో ప్రేంచంద్ రచనా ప్రపంచంలో కీర్తిపతాక అయిన గోదాన్‌నూ, ఉన్నవవారి యశస్సుకు మకుటాయమానమయిన మాలపల్లినీ తులనాత్మకంగా పోలుస్తూ, చక్కగా వారిరువురి రచనల్లో గల సామ్య-వైషమ్యాలను ఎత్తిచూపారు. వారి కృషి ప్రశంసనీయంగా సాగింది. నాలుగు ప్రకరణాలలో సాగిన వారి పరిశోధన తెలుగు పరిశోధనారంగంలో తులనాత్మక పరిశీలనా వ్యాసంగానికి బీజాలు వేస్తుందని నమ్ముతున్నాను. ఈ రంగంలోవారు ముమ్ముందు ఇతోధికంగా కృషి జరిపి, భాషా సామరస్యానికి పునాదులు వేస్తారని ఆశిస్తున్నాను.

**ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి**
భారతీయ భాషల శాఖాధిపతి
ఆం.ప్ర. సార్వత్రిక విశ్వవిద్యాలయం
హైదరాబాద్.
14-9-86

# ఒక వాంఛనీయ ప్రయత్నం

భారతీయ భాషా సాహిత్య రంగాల్లోనూ, ప్రాంతీయ చారిత్రక సాంస్కృతిక రంగాల్లోనూ, తులనాత్మక అధ్యయనాలు ఇటీవలి కాలంలో ఆరంభమయ్యాయి. ఆయారంగాల్లోని నిపుణులూ, ఔత్సాహికులు, పరిశోధకులూ విశ్వవిద్యాలయాల వెలుపలా, లోపలా తులనాత్మక అధ్యయనాలను పట్టించుకోవలసిన అవసరం ఉందని గుర్తించారు, గుర్తిస్తున్నారు. భారతీయ అధ్యయన విజ్ఞాన రంగంలో ఇది ఒక అభిలషణీయమైన పరిణామం.

భారతీయ అధ్యయన విజ్ఞాన రంగంలో తులనాత్మక సాహిత్యాధ్యయనం ఒక శాఖ. ఈ శాఖలో కృషిచేయాలనుకునే ఆలోచనాపరులు గుర్తించుకోవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. అవి:

1. ఏవైనా రెండు భాషల్లోని సాహిత్యాల మధ్య తులనాత్మక పరిశీలన చేయాలనుకునే వాళ్ళకు, ఆ రెండు భాషలు తెలిసిఉండాలి. ఆరెండు భాషల్లోని సాహిత్యంతోనూ, ఆ సాహిత్యవికాసానికి కారకమైన సామాజిక చరిత్రతోనూ, ఆ చరిత్ర గత సూత్రాలతోనూ తగిన పరిచయం ఉండితీరాలి. భాషలు రాకపోయినా, ఆ భాషల్లోని సాహిత్యానువాదాలను ఆధారంగా తులనాత్మక సాహిత్య పరిశీలన చెయ్యవచ్చు. అందుకోసం ఆ భాషల్లో ఉత్తమ అనువాద సాహిత్యం సమృద్ధిగా ఉండాలి. అంతేగాదు ఆయాభాషా ప్రాంతీయ సమాజాలచరిత్ర, అంటే చరిత్ర రచనలు బాగా అందుబాటులో ఉండాలి.

2. పరిశీలన నిమిత్తం తీసుకున్న సాహిత్యాల్లోని, లేదపోతే, ఇద్దరు భిన్న భాషా రచయితల సాహిత్య రచనల్లోని నిర్దిష్ట లక్షణాలమధ్య సామ్యాలేవో, సాధారణలక్షణాల మధ్య సామ్యాలేవో గుర్తించ గలగాలి. సామ్యంతోపాటు వైశమ్యాలను కూడా గుర్తించగలగాలి. పరిశీలనలో సమాజగతీ, సాహిత్య వికాసమూ, ప్రక్రియావిర్భావ వికాసాలు, రూపపరిణామంలో, వస్తు స్వభావాల మధ్య ఉండే అన్యోన్య ప్రభావక సంబంధాలనూ గుర్తించగలగాలి, పరిశీలనలో సాహిత్య వికాసానికి కారకమైన సమాజ పరిశీలన ఎంత ముఖ్యమో సాహిత్యాంశాలైన ప్రక్రియ (*Genre*), ప్రక్రియరూపమూ (*Form*), వస్తువూ (*Context*) అంతే ముఖ్యం.

3. తులనాత్మక సాహిత్య పరిశీలనకు ముఖ్యంగా అవసరమయ్యేది సాహిత్య సామగ్రి, చరిత్రసామగ్రి. వీటితోపాటు ఒక రచనా పద్ధతి అంటే *Methodology* ప్రాముఖ్యం వహిస్తుంది.

తెలుగు సాహిత్య తులనాత్మక పరిశీలనల్లో, పరిశీలనకు అవసరమైన పూర్వకాంక్షిత స్పృహ పరిశోధకులలో గట్టిగా ఉందని చెప్పలేము. కానీ ప్రాంతీయ భాషా సాహిత్య తులనాత్మక అధ్యయనంలో కొందరు పరిశోధకులు కొంత మంచి కృషి చేశారు. మన విశ్వవిద్యాలయాలలో జరిగే తెలుగు పరిశోధనలో తులనాత్మక సాహిత్య పరిశీలనకు ఒకస్థానం అంటూ గత పదేండ్లలో ఏర్పడింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో దాక్షిణాత్య భాషల్లోని తులనాత్మక సాహిత్యం ఎం.ఏ.లో ఒక ఐచ్ఛికాంశంగా కూడా ఉండింది.

మాలపల్లి - గోదాన్ నవలల తులనాత్మక పరిశీలనం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఫిల్. పట్టా పొందిన పరిశోధక వ్యాసం. భారతీయ సాహిత్య తులనాత్మక అధ్యయనాల్లో ఈ సిద్ధాంత వ్యాసం ఎన్న దగిన ప్రయత్నం. స్వాతంత్ర్య పూర్వపు రెండు భిన్న ప్రాంతాల గ్రామీణ జీవితాన్ని చిత్రించిన, రెండు భిన్న భాషల్లో కన్పించే ఇద్దరు ప్రముఖ రచయితల సామాజిక ఆర్తిని రచయిత సోపపత్తికంగా నిరూపించాడు. ఉన్నవ, ప్రేమ్‌చంద్ గొప్ప రచయితలు

మాత్రమే గాదు. గ్రామీణ సమాజసంబంధాలలో వస్తున్న మార్పులను సవిమర్శకంగా చిత్రించడానికి ప్రయత్నించిన తొలితరం వాస్తవికతావాద రచయితలు. భారత జాతీయ విముక్తి పోరాట రీతులను ఆనాటి తమ పరిమితుల్లో అవగాహన చేసుకున్న రచయితలు. గ్రామాల్లోని జమీందారుల ధనదాహాన్నీ, అధికార దాహాన్నీ, భూస్వాముల భూదాహాన్నీ, రక్తదాహాన్నీ, కౌల్దారులూ, పేదరైతుల అశక్త హృదయాక్రోశాలనూ, మెట్టవేదాంతాలనూ, కులవ్యవస్థ వికృతరూపాలనూ, దళితుల నిస్సహాయతనూ, తిరుగుబాట్లనూ, భూ సంబంధాలలో వచ్చే మార్పులనూ, ఆ మార్పుల కారణంగా మానవ సంబంధాలలో వచ్చే పరిణామాలనూ చిత్రించిన రచయితలు. ఉన్నవ నవలా రంగస్థలం ఆంధ్రదేశానికి చెందిన గుంటూరు జిల్లాలోని మంగళాపురం. ప్రేమ్‌చంద్ నవలా రంగభూమి ఉత్తర ప్రదేశ్‌కు చెందిన బేలారి. ఉన్నవ నవలేతివృత్తం 1920 దశకానికి చెందినది. ప్రేమ్‌చంద్ నవలేతివృత్తం 1930 దశకానికి చెందింది. స్థూలంగా గాంధీ నాయకత్వంలోని జాతీయవాద ఉద్యమ సన్నివేశకాలం ఈ రెండు నవలల్లో కని పిస్తుంది. ఆ సన్నివేశ కాలంలోని రాజకీయ సిద్ధాంతాల ప్రభావం కనిపిస్తుంది. ఈ రెండు నవలల్లో ఆసన్నివేశ కాలంలోని వైరుధ్యాలు కూడా ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. 1920–1930 మధ్య కాలంలోనే దేశభక్తిలో, హరిజన విముక్తి నినాదంలో, జాతీయవిముక్తి పోరాట స్వరూపాల్లో సంభవించిన వైరుధ్యాలను ఈ రెండునవలలు ప్రస్ఫుటం చేస్తాయి. రాజకీయ సాహిత్యవాది అయిన ఉన్నవ, సాహిత్య కార్యశీలి అయిన ప్రేమ్‌చంద్ సాహిత్య తత్వాలలోని తేడాలను కూడా ఈ రెండు నవలలూ వ్యక్తం చేస్తాయి. మాలపల్లిలోని ఉద్యమ పరమైన ఆశావాదం గోదాన్‌లో కన్పించదు. గోదాన్‌లోని కఠిన గ్రామీణ జీవిత వాస్తవం మాలపల్లిలో కనిపించదు. ఉత్తరప్రదేశ్‌లోని జమీందారీ, మద్రాసు ప్రెసిడెన్సీలోని రైత్వారీ పద్ధతుల్లో తేడాలున్నాయి. ఈ రెండు నవలల్లో కొట్టవచ్చే పోలికలు కొన్ని ఉన్నాయి.

ఈ పరిశోధక వ్యాస రచయిత స్థూలంగా గుర్తించినది "రైత్వారీ, జమీందారీ విధానాలు రెండూ కూడా దేశంలో పూర్వం నుంచి అమలులో ఉన్న

సాంప్రదాయిక భూవ్యవస్థలతో ప్రాథమికంగా విభేదించాయి. భూమిపైన స్వంత ఆస్తి హక్కు అనే కొత్త రూపాన్ని బ్రిటిషువారు సృష్టించిన దానివల్ల రైతుకు ఒనగూడే లాభం ఏమాత్రంలేదు. ధనిక రైతు చేతిలో నలిగిన చిన్నరైతును 'మాలపల్లి'లో జమీందారీలోని రైతుల బడుగు జీవితాన్ని 'గోదాన్'లో మనం చూస్తాం....రైతు క్రమేణా భూమిని కోల్పోయి కూలివాడు కావటం 'గోదాన్'లో, పెత్తందారీ వ్యవస్థలో రైతు భూమినే కోల్పోవడం 'మాలపల్లి'లో కనబడుతుంది. (పే. 83)

ఈ పరిశోధక వ్యాసంలో కీలకమైన అధ్యాయం నాలుగోది. ఉన్నవ, ప్రేమ్‌చంద్ నవలల్లోని పోలికలనూ, తేడాలనూ ఆయా చారిత్రక నేపథ్యాల్లో పరిశీలించడానికి ఈ వ్యాస రచయిత స్వామి మంచి కృషి చేశారు. మాలపల్లి-గోదాన్ నవలల్లోని ప్రాంతీయ రైతాంగ జీవితాలు ఏరకంగా చిత్రిత మయ్యాయో వివరించారు. గ్రామీణ జీవితంలోని సామాజిక ఆర్థిక అంతరువులలోని వైరుధ్యాలనాడిని పట్టుకోడానికి ప్రయత్నించారు. కార్మిక వర్గం స్పష్టంగా రూపుదిద్దుకోలేని చారిత్రక సన్నివేశంలో, రైతాంగజీవితంలో తల ఎత్తుతున్న రాజకీయ ప్రతిఘటన ధోరణినీ, హిందూకర్మవాద అహింసాత్మక వ్యాఖ్యాన ధోరణినీ, నిష్క్రియా తత్త్వధోరణినీ, అర్థం చేసుకోడానికి ప్రయత్నించారు. కాని మాల పల్లిలోని రామదాసులో, గోదాన్‌లోని హోరీలో ప్రతిఘటనను ఆర్పేసే గుణం "అచంచలమైన శాంతికాముకతకు నిదర్శనంగా" పే. 94 అభిప్రాయ పడడం భూమి స్వంత ఆస్తిగా ఉన్నవానిలోని వైరుధ్యాలను రచయిత సరిగ్గా అర్థం చేసుకోక పోవడమే. భారత సమాజంలోని సనాతనత్వానికున్న పట్టును సరిగ్గా అంచనా వెయ్యలేక పోవడమే. "రామదాసు, హోరీ భావాల్లో కార్యాల్లో సహనమే ప్రధానంగా కనబడుతుంది. ఎట్టి పరిస్థితుల్లో కూడా వీరు ద్వేషాన్ని ప్రదర్శించరు. అహింస ప్రేమరాజ్యంగానే రామదాసు హోరీలు తమ జీవితాలను వెళ్లదీస్తారు. వాస్తవిక రచనల్లో యిలాంటి శాంతి కాముకులు కనిపించటం అరుదు. ద్వేషానికి తావీయకుండా పాత్రలను తీర్చిదిద్దటం రచనా పటిమకు తార్కాణం" (పే. 93)

అని రచయిత వాదించారు. రామదాసు దృష్టి భగవద్గీతకు తిలక్ లేదా గాంధీ చేసిన వ్యాఖ్యానం లాంటి దృష్టి. అయితే కావచ్చుకానీ, (రామదాసులో చిన్న రైతు లక్షణాలూ, ఆచిన్న రైతులోని కులపెద్దల స్వభావమూ, మత గురువుల లక్షణాలు లేక పోలేదు). హోరీది భారతీయ గ్రామీణరైతు సగటు చైతన్యం. హోరీ తత్త్వరీత్యా శాంతి కాముకుడు కాదు. పీడనను ప్రతిఘటించలేని స్థితిలోని బాధా సర్వద్రష్టుడు.

సాహిత్యాన్ని సామాజిక నేపథ్యంలో, సామాజిక శాస్త్రఫలితాల వెలుగులో చూడటం అనేది చాలామంది తెలుగు పరిశోధకులు చెయ్యలేనిపని, చెయ్యనిపని, చెయ్యకూడదనేపని, నిజానికి చెయ్యవలసినపని.

ఈ తులనాత్మక సాహిత్య పరిశోధక వ్యాసంలో ఈ పని విస్తృతంగా చెయ్యకపోయినా సాహిత్య సమాజ సంబంధాల స్పృహ మాత్రం ఈ రచనలో నిస్సందేహంగా కనిపిస్తుంది. తులనాత్మక సాహిత్యాధ్యాయానికి కారకమైన అంశాల స్పృహ కన్పిస్తుంది. ఇది విద్యైక రంగంలో ఒక వాంఛనీయమైన పరిణామం. తెలుగు పరిశోధనలో ప్రోత్సహించ దగిన ప్రయత్నం ఇది. ఈ రంగంలో ఎన్. స్వామి చేయబోయే మంచి కృషికి ఇది ఒక దృష్టాంతం.

డా॥ ఎన్. గోపి
రీడర్
ఉస్మానియా తెలుగు శాఖ
13-9-86

# అభినందన

నవల ఆవిర్భావానికి మధ్యతరగతి ప్రజల్లోని అనుకూలపరిస్థితులే కారణం. 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో భారతదేశంలో జమీందారీవ్యవస్థ క్షీణించడం, మధ్య తరగతి ప్రజలు తమ శక్తినీ ఉనికినీ చారిత్రక పాత్రనూ గుర్తించడం మొదలైంది. ఇలాంటి పరిస్థితుల్లోనే దుర్గేశనందిని, రాజశేఖర చరిత్ర వంటి నవలలు వెలువడ్డాయి.

తెలుగు నవల పుట్టి 'శతకం' దాటింది. (108 సంవత్సరాలు), 1878లో వెలువడిన రాజశేఖర చరిత్ర తొలినవలే కాక తొలి సాంఘిక నవల కూడా. ఈ శతాబ్దం తొలి దశకంలో చారిత్రక, అపరాధ పరిశోధక నవలల అనువాదాలు ఎక్కువగా వచ్చాయి. రెండో దశాబ్దంలో స్వతంత్ర చారిత్రిక నవలలు వెలువడ్డాయి. ఇదే కాలంలో ఆంధ్రరాష్ట్రోద్యమానికి బీజాలు పడి తెలుగు ప్రభువుల వ్యక్తిత్వ చిత్రణాసక్తితో నవలలు వచ్చాయి.

1900–1920 మధ్యకాలంలో సాంఘికేతివృత్తాలతో వెలువడిన నవలల్లో వస్తు వైవిధ్యం కనిపిస్తుంది. పాశ్చాత్య ప్రభావం, హేతు దృష్టి పెరిగి సమాజ సంక్లిష్టతను ప్రదర్శించడానికి ప్రయత్నాలు జరిగాయి. వితంతువివాహాలు, హరిజనాభ్యుదయం వంటి సంస్కారప్రతిపాదకాలైన వస్తుస్వీకరణలు మొదలైనాయి. నేదునూరి గణేశ్వరరావు రచించిన "సుగుణవతీ పరిణయము (1908) : మద్దనూరి గోపాలరావు 'సుందరి' (1912) వంటివి ఈ కోవకు

చెందిన నవలలు. తల్లాప్రగడ సూర్యనారాయణ రచించిన "హేలావతీ" (1918) తెలుగులో వెలువడిన మొదటి హరిజనాభ్యుదయ నవల.

అయితే భారత దేశంలో గాంధీజీ "హరిజనుడు" అన్న మాటను సృష్టించక ముందే అస్పృశ్యతను గురించీ అస్పృశ్యుల సాంస్కృతిక ఆర్థిక బాధలను గురించీ సమగ్రంగా చిత్రించిన నవల మాత్రం 'మాలపల్లే' మాలపల్లి 1922లో వెలువడింది. రాబోయే తరాల్లో విశ్వరూపం ధరించబోయే నవలా ప్రక్రియకు మార్గదర్శకత్వం వహించిన ఒకటిరెండు నవలల్లో (మాతృమందిరము ,గణపతి) మాలపల్లి శిఖరాయమానంగా నిలుస్తుంది. ఆనాటికే వ్యావహారిక భాషను వాడటం కూడా మాలపల్లి ప్రత్యేకత.

ప్రేమ్‌చంద్ రచించిన గోదాన్, కర్మభూమి నవలలు మాలపల్లితో పోల్చ తగ్గవి. స్వామి గోదాన్‌ను ఎన్నుకున్నాడు. తులనాత్మక పరిశీలన చెయ్యటానికి ధైర్యం కావాలి. తగిన పరిశ్రమతో స్వామి ఈ కార్యంలో ఎదురైన సమస్యలను ఎదుర్కొన్నాడు అయితే ఇది మాలపల్లి-గోదాన్ నవలల సమగ్ర పరిశీలన కాదు. ఈ పరిశోధన ఉద్దేశం కూడా అది కాదు.

సగటున వారానికో నవల పుట్టుకొస్తున్న రోజులివి. వెలువడుతున్న నవలల సంఖ్యతో పోలిస్తే నవలలపైన వస్తున్న విమర్శముత్తైమంతే. ముఖ్యంగా నవల నిర్మాణ శిల్పం గురించి అనేక దృక్కోణాల్తో పరిశీలన జరగవలసి ఉంది. ఈ మధ్య ఎక్కువ మంది ఎం.ఫిల్ పరిశోధకులు నవలలను పరిశీలనకు ఎన్నుకుంటున్నారు. వీరు సత్ఫలితాలను సాధించి నవలా విమర్శను సుసంపన్నం చేస్తారని ఆశించవచ్చు.

స్వామి నా పర్యవేక్షణలోని ప్రథమ పరిశోధకుడు. హద్దు పొద్దెరగని నా అత్యుత్సాహాన్ని తట్టుకొని సకాలంలో పని పూర్తి చేశాడు. కష్టజీవినని నిరూపించుకున్నాడు. అయితే ఇప్పటి పరిశోధక విద్యార్థులకు నాదో సూచన. ఎం.ఫిల్‌లు పి హెచ్‌డీలు ప్రారంభాలేకాని తలాపుదిండ్లుకావు. నిజమైన అన్వేషణ ఇప్పుడే మొదలు కావాలి. స్వామి అదిశలోనే నడవాలని కోరుతూ అభినందిస్తున్నాను.

# మనవి మాటలు

'మాలపల్లి' నవల పట్ల నాకు మొదటి నుంచి అభినివేశం ఉంది. అయితే దానిని 'గోదాన్'తో పోల్చి అధ్యయనం చెయ్యాలనే దానికి ప్రేరణ మాత్రం యాదృచ్ఛికంగానే జరిగింది. నేను ఎం.ఏ రెండో సంవత్సరంలో ఉండగా ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్స్ కాలేజీలో 13 మార్చి 1980న హిందీ విభాగం వారు ప్రేమ్‌చంద్ శతజయంతి ఆచార్య సభను ఏర్పాటుచేశారు. ఆ సభలో వక్తలు భీమసేన్ నిర్మల్, ఆచార్య నాయని కృష్ణకుమారి గార్లు. ఆ సభలో ఆచార్య నాయని కృష్ణకుమారి గారు 'మాలపల్లి' కి గోదాన్‌కు పోలికలున్నాయని, పరిశోధనకు తగిన అంశం అని పేర్కొన్నారు. అట్లా నాకు ఈ రెండు నవలల తులనాత్మక పరిశీలన చేయాలనే అభిలాష కలిగింది. 1980 మార్చిలో సారస్వత పరిషత్ వారి ఆధ్వర్యంలో ఉన్నవ, ప్రేమ్‌చంద్ శత జయంతి సభ జరిగింది. ఆనాటి వక్తలు ఆచార్య సి. నారాయణరెడ్డి, దాశరధి రంగాచార్య గార్లు. రంగాచార్య గారు "ప్రేమ్‌చంద్ ఉన్నవకు చాలా పోలికలు ఉన్నాయని తెలుగులో ఎవరైనా వీరి రచనలను పోల్చి పరిశీలన చేస్తే సంతోషిస్తానని" అన్నారు. 1980 డిసంబర్‌లో కేంద్ర అకాడమీ వారు కళాభవన్‌లో బెజవాడగోపాల్‌రెడ్డి అధ్యక్షతన ప్రేమ్‌చంద్, కట్టమంచి శత జయంతి సభను నిర్వహించారు. ఆనాటి వక్తలు ఆచార్య సి. నారాయణరెడ్డి, ఆచార్య భీమసేన్ నిర్మల్ గార్లు. భీమసేన్ నిర్మల్ గారు 'గోదాన్—మాలపల్లి'కి దగ్గఱ పోలికలున్నాయని అన్నారు. 1980 నవంబర్‌లో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంలో జ్వాలాముఖిగారు "ఉన్నవ వారి 'మాలపల్లి' నవలను ప్రేమ్‌చంద్ 'గోదాన్' నవలను తులనాత్మకంగా పరిశీలించ వలసిన అవసరం ఉంది" అన్నారు. ప్రేమ్‌చంద్ కోవకు చెందిన ఒక్క నవలా రచయిత కూడా మనకు లేక పోవటం నిజంగా శోచనీయమైన విషయమని విచార పడ్డ ఎ.బి. సాయిప్రసాద్ గారికి ఉన్నవ ఉన్నారని నిరూపించాలని అనుకున్నాను. ఈ విధంగా నా సంకల్పం బలపడింది.

నేను ఈ సాహసం చెయ్యటానికి హిందీ భాషలో స్వల్పమైన ప్రవేశం ఉండటం కూడా కొంత దోహదం చేసింది. తులనాత్మక పరిశీలనకు 'మాలపల్లి-గోదాన్'లనే ఎందుకు ఎన్నుకున్నాననే ప్రశ్నకు పై ప్రేరణలే కారణం. అయితే అవి అచ్చు గుద్దినట్లు పోలికలున్న నవల నవలలా ? అన్న ప్రశ్నకు మాత్రం వాటిలోకి దిగి తలస్పర్శిగా పరిశీలన మొదలు పెట్టిన తర్వాతగాని సమాధానం దొరకలేదు. 'మాలపల్లి—గోదాన్' సుదూరంగా ఉన్న రెండు వేరు వేరు ప్రాంతాలకు చెందిన నవలలు. దాదాపు ఓ దశాబ్దకాలం వార ఉన్నా సమకాలీన రచనలు. రెండు వేరు వేరు వ్యవస్థల భూమికల్లోంచి మొలచిన సారస్వత తరువులు. అయితే ఈ రెండూ రైతు జీవన పరిస్థితులకు అద్దం పట్టాయి. రైతు జీవితంలోని ఆశ నిరాశలు నమ్మకాలు, పేదరికం అమాయకత్వం మొదలైన వాటికి వ్యాఖ్యానం చెప్పాయి. ఈ రెండు నవలల్లో ఉన్న కొద్దోగొప్పో సామ్యం భేదాల గురించి అధ్యయనం చెయ్యటం వల్ల తెలుగు మహానవల 'మాలపల్లి'ని గురించి మరింత స్పష్టంగా చెప్పుకోటానికి వీలయిందని గ్రహింపు ఏర్పడింది. ఒక ఉత్తమ తెలుగు నవలను మరో ఉత్తమ హిందీ నవలతో పోల్చి చెప్పటం వల్ల క్రొత్త దృక్కోణాలు వెలికి వస్తాయని నా ఆశ. ఆ ఆశే ఈ పరిశీలనకు పాథేయం.

నా పరిశోధనకు కావల్సిన విషయ సంగ్రహణానికై నాగార్జున విశ్వవిద్యాలయానికి, కాకతీయ విశ్వవిద్యాలయానికి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి వెళ్ళి 'మాలపల్లి-సామాజిక స్పృహ' 'మాలపల్లిలో పాత్రా చిత్రణం' 'మాలపల్లి ఒక పరామర్శ,' ఈ గ్రంథాలను పరిశీలించాను.

1988 ఆగస్టులో వేటపాలెం గ్రంథాలయం "సారస్వతనికేతనా"నికి వెళ్లాను. 'మాలపల్లి' ప్రథమ ముద్రణ లభించింది అక్కడే. 1922 లో ముద్రణ మూడు భాగాలే అయినందున అవే పరిశీలించాను. ఉన్నవ పీఠిక సమకూర్చిన గ్రంథం "దేశబంధు చిత్తరంజన్‌దాసు" అక్కడే లభించింది. తర్వాత గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయంలో 'గుంటూరు జిల్లా స్వరాజ్య ఉద్యమం,' 'ఆంధ్ర దర్శిని'ని చదివి నా విషయానికి సంబంధించిన వానిని సేకరించాను. ఇంకా నగర

కేంద్ర గ్రంథాలయం, శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం, స్టేట్ లైబ్రరీ మున్నగువానిలో నాకు కావల్సిన విషయ సామగ్రి సేకరించాను. పై సంస్థల సహాయం మరువరానిది.

పరిశోధనకు అవకాశం కల్పించిన ఉస్మానియా తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య. కే. గోపాల కృష్ణారావు గారు. సిద్ధాంత వ్యాసానికి ముందు 'మాలపల్లి-గోదాన్'ల గురించి నేను రాసిన వ్యాసాలు చదివి తగిన సలహాల నిచ్చిన ఆచార్య నాయనికృష్ణకుమారి, ఆచార్య కులశేఖరరావు, డా॥ ఎస్. వి. రామారావు గార్లు, తులనాత్మక అధ్యయనం గురించి ముఖ్యంగా దనియా ప్రాశస్త్యాన్ని గురించి ఆవేశంతో మాట్లాడి నన్ను ఉత్తేజ పరచిన దాశరథిరంగాచార్యగారు, గోదాన్‌ను బాగా అర్థంచేసుకోటానికి ఆనాటి పరిస్థితులను గురించి ఓపికగా నాకెరుక పరిచిన ఆచార్య భీమసేన్‌నిర్మల్ గారు, తమ 'మాలపల్లి' నాటకాను భవాలను వివరించిన నగ్నముని గారు, పరిశోధనలో చేరిన తొలి రోజులలో నా ఉత్తరాలకు వెంటనే జవాబులు రాస్తూ ఎంతో సమాచారాన్ని అందించిన కె. చెంచయ్యగారు; 'మాలపల్లి'ని గురించి మాట్లాడి నా అవగాహనను మరింత విస్తృతం చేసిన శ్రీమతి కాత్యాయనీ విద్మహే, తమకు తెల్సిన ఉన్నవ గురించి గుంటూరు రాజకీయ ఉద్యమాల గురించి చెప్పిన జి. కృష్ణగారు-

తమ సేకరణల్లోంచి నాకు కావల్సిన ముఖ్యమైన పుస్తకాలను ఇవ్వటమే గాక నాలోని అలసత్వాన్ని అడుగు అడుగునా తొలగిస్తూ పరిశోధక స్ఫూర్తిని కలిగిస్తూ అధికారపరిధిని మీరిన శ్రద్ధాసక్తులతో పర్యవేక్షించారు డా॥ ఎస్. గోపిగారు. ఈ పుస్తకం అచ్చు విషయాల్లో కూడా తగు సూచనలు చేశారు.-

నిస్సహాయస్థితిలో దిక్కుతోచక కొట్టుమిట్టాడుతున్నప్పుడు అభయ హస్తంతో నన్ను ఆదుకొని జీవితాంతం నా కృతజ్ఞతకు పాత్రులైన యం. ఓంకార్ (*M. L. A.*) గారు—

ఎంతో అభిమానంతో నా పుస్తకాన్ని అంకితం అందుకొన్న ఆచార్య సి. నారాయణరెడ్డిగారు—

1984 ఆగస్టు 14న ఈ పరిశోధన వ్యాసానికి ఎం. ఫిల్. డిగ్రీ ప్రకటించ బడింది. పరీక్షకులుగా వచ్చిన సార్వత్రిక విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ కేతు-విశ్వనాధ రెడ్డిగారు

నా పరిశోధన అంశానికి సంబంధించిన పత్రికలను అందించిన సోదరి శ్రీమతి ఎన్. అరుణగారు—

నా పరిశోధనకు తగిన సమయాన్ని కల్పించి సకాలంలో పూర్తిచేసేందుకు తోడ్పడిన మా కళాశాల ప్రిన్స్‌పాల్ ఎన్.వి.యన్.రెడ్డిగారు —

అనేక సందర్భాల్లో తమ సహాయ సహకారాలందించిన మా కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు టి. ప్రభాకర రెడ్డిగారు—

ఈ పుస్తకానికి తమ అభిప్రాయా లొసగిన గౌరవ పెద్దలు-

ఉన్నత విద్యాభ్యాసానికి నన్ను ప్రోత్సహించి, నాకు ఆశ్రయం ఇచ్చి ఎన్నో విధాల అండగా నిలిచిన మామ గారు టి. జనార్ధన్‌గారు-

నాకు ఉజ్వల భవిష్యత్ ఉందని నాలో విశ్వాసాన్ని పెంచి ముందడుగు వేయించిన స్నేహితుడు సి. కృపానందంగారు.

నా పర్యటన నిమిత్తం రెండుసార్లు ట్రావెల్ గ్రాంటు, పరిశోధనా గ్రంథం ఖర్చులనిమిత్తం ఆర్థికసహాయమిచ్చిన యూ.జి.సి. యూనిట్ ఉస్మానియావారు—

ఈ గ్రంథం ప్రచురణ నిమిత్తం ఆర్థిక సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయంవారు —

నా కోసం శ్రమించి ఈ గ్రంధాన్ని అందంగా ముద్రించి త్వరగా అందించిన మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత వాసిలి వసంతకుమార్ గారు,

—అందరికీ నావందనాలు.

నసుమాస స్వామి.

# సవరించి చదవండి

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 1 | ఆకర్షించింది | ఆకర్షించింది. |
| 7 | 5 | నడవడం | చదవడం |
| 9 | 14 | ఉన్నవ | ఉన్నవ. |
| 9 | 20 | ప్రకటెంచారు | ప్రకటించారు. |
| 11 | 12 | తిక్కన | తిక్కన. |
| 11 | 25 | ముద్రించాడు | ముద్రించాడు.[24] |
| 12 | 2 | అచ్చయింది.[24] | అచ్చయింది. |
| 14 | 6 | ప్రకటించినవి | ప్రకటించినవి. |
| 16 | 21 | మహావక్తి | మహావ్యక్తి |
| 17 | 22 | గాంధివాదం | గాంధీవాదం |
| 17 | 23 | క్రమగా | క్రమంగా |
| 18 | 3 | చూరగొన్నాడు | చూరగొన్నాడు. |
| 19 | 19 | చేశాడు | చేశాడు. |
| 19 | 22 | యదార్ధమును | యథార్థమును |
| 21 | 6 | పనిచేశాడు | పనిచేశాడు. |
| 22 | 26 | జీవితాన్ని | జీవితాన్ని, |
| 23 | 2 | సోమరుల | సోమరులు |
| 23 | 22 | సంపుటాలనువాదం | సంపుటాల తెనుగానువాద |
| 24 | 7 | *S. V. V* | *S. S V* |
| 25 | 3 | "హడతాల్" | "హడతాప్" |
| 27 | 11 | సాహిత్య | స్వాతంత్ర్య |

| | | | |
|---|---|---|---|
| 29 | 25 | సుహాసినిప్యాండె | సుహాసినిపాండె |
| 31 | 18 | గాంధీజీ | గాంధీజీ 1/A. |
| 33 | 5 | తెలియజేశాడు. గాంధీజీ | తెలియజేశాడుగాంధీజీ. |
| 33 | 13 | శాళనోల్లంఘన తీవ్రంగా | శాసనోల్లంఘన ఉద్యమం తీవ్రంగా |
| 33 | 23 | చారాచౌరాలో | చౌరీచౌరాలో |
| 34 | 26 | సామ్రాజ్యవాదులైన | సామ్రాజ్యవాదుల తొత్తులైన |
| 35 | 18 | స్వారాజ్య సంపాదనా | స్వరాజ్య సంపాదన |
| 47 | 19 | దగ్గఅ | దగ్గర |
| 48 | 3 | వాళ్ళ | వాళ్ళు |
| 49 | 13 | చేసింది. ప్రభుత్వం | చేసింది ప్రభుత్వం. |
| 51 | 1 | అం. ప్ర. సా .తి. | అం. ప్ర. సా. అ. |
| 55 | 3 | జైలులో తోస్తారు. | జైలులో తోస్తారు |
| 55 | 23 | తీర్పు యిచ్చారు. | తీర్పు యిచ్చారు.[3] |
| 56 | 26 | ముందు నిలిపాడు | ముందు నిలిపాడు. |
| 57 | 7 | జైల్డో | జైల్లో |
| 58 | 13 | సోషలిస్టు బావాలు | సోషలిస్టు భావాలు |
| 65 | 20 | చిత్రణం. | చిత్రణం |
| 68 | 22 | హోరి దంపతులు | హోరీ దంపతులు |
| 69 | 24 | ఇంటో | ఇంట్లో |
| 69 | 26 | జమిందార్ల | జమీందార్ల |
| 70 | 20 | పాతలు, | పాత్రలు, |
| 73 | 10 | ఘర్షన | ఘర్షణ |
| 76 | 20 | గోదాన్‌తో | గోదాన్‌లో |
| 77 | 7 | ప్రెసిడెన్సి | ప్రెసిడెన్సీ |

| | | | |
|---|---|---|---|
| 77 | 14 | సిపార్సు | సిఫార్సు |
| 82 | 13 | తేస్తాడు | తెస్తాడు |
| 82 | 17 | ఝుంగురాసింగు | ఝింగురాసింగు |
| 83 | 26 | నవలలోని | నవలల్లోని |
| 84 | 1 | సమస్యల్ని స్పృశించి | సమస్యల్ని ఈ నవలల్లో చర్చించబడినాయి. ఆనాడు అన్ని వర్గాలలో ఉన్న సమస్యలను స్పృశించి |
| 87 | 13 | దగ్గఱ | దగ్గర |
| 87 | 21 | పెంచుకుత్నాడు. | పెంచుకున్నాడు. |
| 89 | 15 | పడుచు | పడుచును |
| 91 | 19 | జమిందారీ | జమీందారీ |
| 93 | 27 | గోవర్ | గోబర్ |
| 103 | 18 | ఉహించవచ్చు | ఊహించవచ్చు |

# రచయితల జీవితరేఖలు - సాహిత్యాది వ్యాసంగాలు

## 1. ఉన్నవ లక్ష్మీనారాయణ

### అ) వ్యక్తిగత బహిరంగ జీవితాలు

### i) జననం, విద్యాభ్యాసం, ఉద్యోగాలు

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు అనగానే తెలుగుదేశానికి వెంటనే స్ఫురించేది 'మాలపల్లి.' ఆంధ్రసాహిత్యంలో అనేక ప్రక్రియల్ని చేపట్టి ఆంధ్ర సారస్వతాన్ని అలంకరించిన రచయితల్లో ఆయన ప్రముఖుడు. రచయితగానే కాక సంఘ సంస్కర్తగా, తీవ్రజాతీయవాదిగా ప్రత్యక్షంగా జాతీయోద్యమంలో పాల్గొని జైలు జీవితాన్ని అనుభవించిన దేశభక్తుడుగా కీర్తికెక్కాడు. సహాయనిరాకరణోద్యమ కాలంలో యావద్భారత దేశంలోనూ ప్రప్రథమంగా నిర్బంధింపబడి కారాగారానికి వెళ్ళింది కూడా లక్ష్మీనారాయణ పంతులే అంటరానివారుగా అవమానాలకు గురవుతున్న అభాగ్యుల కన్నీళ్ళను తుడిచి వారికోసం కలంపట్టాడు ఉన్నవ. తనకు తానుగా ఎన్నుకొన్న దీనజన సేవలో కాలం గడిపాడు సవ్యసాచిగా భావ, భాషావిప్లవాలను ఏకకాలంలో నడిపించి దేశానికి, సాహిత్యానికి గణనీయమైన సేవచేశాడు.

ఉన్నవపై వెలువడిన జీవితచరిత్రల్లోని వివరాలను క్రోడీకరించి ఉన్నవ వ్యక్తిగత బహిరంగ జీవితాలను గూర్చి దిఙ్మాత్రంగా చెప్పుకోవచ్చు.

ఉన్నవ లక్ష్మీనారాయణ 1877వ సంవత్సరం డిసెంబరు 4వ తేదీన గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలుకా వేములూరుపాడులో జన్మించాడు.[1] వేములూరుపాడుకు ప్రక్కనే ఉన్న అమినాబాద్‌లో 1897లో అయన ప్రాథమిక విద్యాభ్యాసం జరిగింది. అమినాబాద్ వాస్తవ్యులు అయిన సీతారామయ్య కూతురు లక్ష్మీబాయమ్మతో ఉన్నవకు వివాహమైంది. 1897లో మెట్రిక్యులేషన్ కోసం ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో చేరి 1899లో ఎఫ్. ఏ. పాసయ్యాడు.[2] ఉపాధ్యాయ వృత్తిమీద ఆసక్తి ఉన్న ఉన్నవ శిక్షణ పూర్తికాగానే గుంటూరు ఉన్నత పాఠశాలలో (1902) ఉపాధ్యాయుడుగా చేరాడు.

## ii) వితంతు వివాహాలు

ఉన్నవ ఉపాధ్యాయుడుగా పాఠశాలలో చేరిన సంవత్సరం (1902) గుంటూరులో వితంతు శరణాలయం స్థాపించబడింది. అదే సంవత్సరం అక్టోబర్ 11 న వెంకటరమణమ్మ (వితంతువు)తో బేతపూడి ప్రకాశరావుకు జరిగిన వివాహంలో ఉన్నవ ముఖ్యపాత్ర వహించాడు. ఈ మొదటి వివాహానికి వీరేశలింగం గారు హాజరైనారు.

రాజమహేంద్రవరంలో టీచర్ ట్రైనింగ్ కాలేజిలో శిక్షణ కోసం (1905) చేరిన ఉన్నవకు సంఘసంస్కర్త శ్రీ వీరేశలింగంతో చనువు కుదిరింది. ఉన్నవ శ్రీ వీరేశలింగం నడుపుతున్న వితంతు శరణాలయానికి సూపరింటెండెంటుగా కుదిరాడు. కాని వీరేశలింగం గారితో అభిప్రాయ భేదం ఏర్పడి ఉన్నవ 1908లో తిరిగి గుంటూరు చేరుకున్నాడు [3]

1908 నుంచి గుంటూరులో న్యాయవాదిగా ప్రాక్టీస్ ప్రారంభించడంతో ఉన్నవ సంఘ సంస్కరణ ఉద్యమం నిరాటంకంగా సాగేందుకు అవకాశం కుదిరింది. గుంటూరు వితంతు శరణాలయానికి సూపరింటెండెంటు కాగానే స్వయంగా ఉన్నవ ఒక వితంతు వివాహాన్ని జరిపించాడు.[4] దీనితో పట్టణంలోని సనాతనులు అగ్నిహోత్రులైనారు. ఐనా ఉన్నవ మాత్రం భయపడక పరంపరగా సంస్కరణ పెళ్ళిళ్ళు జరిపించాడు. వితంతు వివాహాలు జరిపిస్తున్నందుకు ఉన్నవను సాంఘికంగా బహిష్కరించారు. ప్రాయశ్చిత్తం చేసుకోమంటే తాను ఆచరించేది

అధర్మంకాదని ఆకార్యక్రమాలనే కొనసాగించాడు ఉన్నవ స్వయంగా 39 వితంతు వివాహాలు జరిపించాడు. ఆయన ఆశయ సిద్ధికి అనేక ఏండ్లు సంఘ బహిష్కరణకు గురై ఒంటరి జీవితాన్ని గడిపాడు. గాంధిగారి స్వాతంత్ర్యోద్యమం మొదలైన తర్వాత ఈ బహిష్కరణ తొలగిపోయింది. అనంతర కాలంలో ఆయన భార్య కూడా సంఘ సంస్కరణకు ఎంతో తోడ్పడింది. ఉన్నవ ప్రభావంతో దరిశి చెంచయ్యసంస్కరణ రంగంలో దూకినాడు.[5] ఉన్నవ మార్గంలో నడిచి సుమారు వందకుపైగా వితంతు వివాహాలు జరిపించిన ఘనుడీతడు. ఉన్నవ వలెనే ఈయన కూడా సాంఘిక బహిష్కరణకు గురైనాడు.

## iii) స్వాతంత్ర్య-ఆంధ్రోద్యమాలు

ఆనాటి దేశ పరిస్థితులను అవగాహన చేసుకున్న ఉన్నవకు న్యాయవాది వృత్తిపట్ల మక్కువ కలిగింది. రాజకీయ విషయాలలో జోక్యం కలుగచేసుకో కూడదనే నిషేధం రావడంతో తన రాజకీయ వ్యక్తిత్వానికి, అధ్యాపకత్వానికి కుదరదని పంతులుగిరి వదులుకున్నాడు. ఉన్నవ 1903 లో జిల్లామున్సబు కోర్టులో ప్లీడరుగా చేరాడు. కాని సంవత్సరం తిరగకుండానే దానిని వదిలివేశాడు. ర్యాలి బ్రదర్స్ (పాశ్చాత్యవ్యాపార సంస్థ)లో క్యాషియర్‌గా కుదిరాడు. కాని ఆ ఉద్యోగం నచ్చక 1908 లో మళ్ళీ న్యాయవాద వృత్తిలో చేరాడు.

వంగదేశ విభజన 1905 లో శాసనమై అమల్లోకి వచ్చింది. విభజించి పాలించే బ్రిటిషు వైఖరికి నిరసనగా వంగదేశ విభజన రద్దుకు యావద్భారత అధినేతలు కలిసి పనిచేయడానికి పూనుకున్నారు. ఈ స్థితిలో వందేమాతరం శంఖారావం దేశంలో ప్రతిధ్వనించింది హోమ్‌రూల్ ఆందోళనతో 1911 లో బెంగాల్ విభజన రద్దయింది.

1913మేలో బాపట్లలో ప్రథమాంధ్రమహాసభ జరిగింది. అప్పుడుఆయన రెండో తరగతి వకీలుగా ఉన్నాడు. బారిష్టరు కావాలనే కోరిక గాఢంగా నాటుకొంది ఉన్నవలో. 1913లో డబ్లిన్‌లోని కింగ్స్ ఇన్స్ కాలేజీలో చేరాడు. ఐరిష్ ప్రజలు స్వరాజ్యంకోసం సాగిస్తూ వచ్చిన హోమ్‌రూల్ పోరాటం 'షిన్‌ఫాన్' ఉద్యమంగా మారిన రోజులవి. ఆ ఉద్యమ ప్రభావం రాజకీయాభినివేశంతో పరవళ్ళు తొక్క

ఉన్నవపైన గాఢంగా ముద్రవేసింది. సెలవుల్లో స్వదేశానికి వచ్చినప్పుడు గుంటూరులో శ్రీనివాసశాస్త్రి ఆంధ్రోద్యమం గురించి చేసిన ఉపన్యాసం సందర్భంగా అధ్యక్షత వహించిన ఉన్నవ మాట్లాడుతూ "రాజకీయ స్వాతంత్ర్యం లేనిదే ఇతర సంస్కరణలేవీ అభివృద్ధికావని ఐరిష్ ప్రజలవలెనే భారతీయులు స్వరాజ్యాన్ని సాధించాల"ని చాటినాడు.[7] ప్రప్రథమంగా ప్రత్యేక రాష్ట్ర ఆవశ్యకతను గూడూరు నుంచి వెలువడే దేశాభిమాన పత్రిక (1911) వ్యక్తంచేసింది.

ఉన్నవ బారిష్టరు పట్టాపుచ్చుకొని 1916లో స్వదేశానికి తిరిగి వచ్చాడు. మొదట మద్రాసులో తర్వాత గుంటూరులో 1920 వరకు న్యాయవాద వృత్తిని కొనసాగించాడు. ఆ వృత్తిలో ఉన్నప్పుడే రాజకీయరంగంలో ప్రవేశించాడు. 1917 ఏప్రిల్ 13న మద్రాసు ఆంధ్రపత్రికాఫీసులో ఆంధ్రదేశ నాయకుల సమావేశం జరిగినప్పుడు ప్రత్యేకాంధ్ర రాజకీయ సంఘానికి ఉన్నవ కార్యదర్శిగా ఎన్నికైనాడు. ఆంధ్రులు అభ్యుదయాన్ని సాధించాలంటే తెలుగువారంతా ఒకే పాలనలోకి రావాలనేది ఆనాటి ఆకాంక్ష.[8] హిందీవారికి బెంగాలీలకు భాషా ప్రాతిపదికగా రాష్ట్రాలు ఏర్పాటు చేసినట్టుగానే తెలుగువారికి కూడా ఏర్పరచాలని గుంటూరులోని యువజన సాహితీ సభ్యులు కోరారు. 1912లో నిడదవోలులో జరిగిన కృష్ణా గుంటూరు జిల్లాల సంయుక్త సభలో భాషాప్రయుక్త రాష్ట్రాలు కావాలనే వాదాన్ని ప్రవేశపెట్టాడు ఉన్నవ. 1914లో రెండవ ఆంధ్రమహాసభ విజయవాడలో సమావేశమైంది. దీనిలో మచిలీపట్నం జాతీయకళాశాలకు, రాజమండ్రి జాతీయ విద్యాలయానికి తగిన సహాయం చేయాలన్న విషయంపైన ఏకీభావం కుదిరింది. నిజానికి ఈ ప్రత్యేక రాష్ట్రాందోళన ఆనాడు ప్రజలను చలింప చేసేంత తీవ్రరూపం దాల్చలేదు[9].

గుంటూరు కాంగ్రెస్ నాయకులు జాతీయోద్యమంలో భాగమైన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని త్రివిధ బహిష్కరణకు పూనుకున్నారు.[10] గాంధీజీ అనుమతి అందకముందే ఆంధ్రలో పన్నుల నిరాకరణోద్యమాన్ని కాంగ్రెసువారు ప్రారంభించారు. 1921లో ఈ ఉద్యమం దేశంలో మొట్ట మొదటి సారిగా గుంటూరు జిల్లా పెదనందిపాడులో ప్రారంభమైంది. శాసనోల్లంఘన ఉద్యమం చీరాలలో తీవ్రరూపం ధరించింది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన జరిగిన "చీరాల పేరాల ప్రతిఘటన" ఉవ్వెత్తున లేచి యావద్భారత

దృష్టిని ఆకర్షించింది. ఈ చీరాల పేరాల ప్రతిఘటనకు తోడుగా గుంటూరులోనే పల్నాడు పుల్లరి సత్యాగ్రహం మొదలైంది.[11] పుల్లరి సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు ఉన్నవ రాయవెల్లూరు జైలులో నిర్బంధింపబడ్డారు.[12] ఆ సమయంలోనే బ్రిటిష ప్రభుత్వాన్ని కలవరపరచిన 'మాలపల్లి' ఉన్నవ కలంనుంచి వెలువడింది.

సహాయ నిరాకరణోద్యమంలో ఉన్నవ గొప్పతనం బయటపడింది. ఉన్నవ, దుగ్గిరాల, ప్రకాశం, వెంకటప్పయ్యలు-ప్రజలను ఉద్దేశించి సత్యాగ్రహ సిద్ధాంతాలను వివరించి చెప్పారు. 1930లో జరిగిన సత్యాగ్రహోద్యమానికి గుంటూరులో జీవంపోసి-ది ఉన్నవే. ఇది 1930 నుంచి 1933 వరకు సాగింది. అంతకు ముందు (1929లో) గాంధీజీ ఆంధ్రలో ఆరువారాలపాటు పర్యటించి ఉద్యమం పట్ల ప్రజల బాధ్యతను గుర్తుచేశారు. 1930లో ఉప్పుసత్యాగ్రహ సమరంలో ఉన్నవ దంపతులు ఆంధ్రలోని 'దేవరంపాడు' శిబిరానికి నాయకత్వం వహించారు. ప్రభుత్వం అస్పృశ్యులకు, వెనుకబడిన వారికి ప్రత్యేక నియోజక వర్గాలుంటాయని ఇచ్చిన తీర్పును గాంధీజీ ప్రతిఘటించ తలచి తన నిరసన తెలిపేందుకు పూనాజైల్లో నిరాహార దీక్షను పూనాడు. గాంధీ పట్ల సానుభూతితో ఆంధ్రలో ఉన్నవ నిరాహార దీక్షకు పూనుకున్నాడు. జాతీయ నాయకులంతా అస్పృశ్యతా నివారణకై కృషిచేస్తామని వాగ్దానాలు చేశారు. 1933లో గాంధీజీ ఆంధ్ర జిల్లాలలో 15 రోజులు పర్యటించారు. ఈ పర్యటనలో అస్పృశ్యతా నివారణకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు.

యుద్ధావసరం వల్ల ఆంధ్రలో కొంత భాగం నైజాంలో కలపాలని బ్రిటిష ప్రభుత్వం కృష్ణానదిపై తాత్కాలికంగా వంతెన నిర్మించడం మొదలు పెట్టింది. ఈ వంతెనవల్ల రెండు భూభాగాలను కలపాలని ప్రభుత్వంఅభిప్రాయం. పల్నాడు బ్రిటిషువారికి బలమైనస్థానం. అక్కడే బ్రిటిషువారిని దెబ్బగొట్టాలని ఉన్నవ తలచాడు. వెంటనే బ్రిటిషు వారికి అలజడి కల్గించే రీతిలో ప్రజాందోళన ఉద్యమం లేవదీశాడు. ఈ సందర్భంలో ప్రభుత్వం ఉన్నవను అరెస్టుచేసి జైల్లో (1942) పెట్టింది.

స్వాతంత్ర్యానికి పూర్వం, స్వాతంత్ర్యానంతరం ఆంధ్రరాష్ట్రం కావాలనే కోరుకున్నాడు ఉన్నవ. 1913లో ప్రత్యేకాంధ్ర రాష్ట్రోద్యమం మొదలైతే 1953 అక్టోబర్ 1న ఆంధ్రరాష్ట్ర అవతరణ జరిగింది. ఉన్నవ తాను కోరుకున్నట్టుగానే ఆయన కళ్ళ ముందే ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది.

## iv) స్త్రీ జనాభ్యుదయం

స్త్రీ విద్యావశ్యకతను గురించి ఉధృతంగా ప్రచారం చేశారు ఉన్నవ దంపతులు. ప్రథమ కారాగారవాసానంతరం సతీమణి లక్ష్మీబాయమ్మతో కలిసి 1922 లో గుంటూరులో శారదా నికేతనానికి పునాదులు వేశాడు ఉన్నవ. స్త్రీ జనోద్ధరణకై ఉన్నవ స్థాపించిన సంస్థలలో ఇది జయపతాక వంటిది. జాతీయోద్యమ ప్రాబల్యంచేత మొట్టమొదట అందులో హిందీ, సంస్కృతం, తెలుగు తరగతులు నిర్వహించారు. అనాదిగా సమాజంలో స్త్రీల జీవితం అనేక కట్టుబాట్లతో బంధింపబడి సంకుచితమైంది. స్త్రీలకు చదువులవసరంలేదని భావించే ఆ రోజుల్లో స్త్రీల విద్యావశ్యకతను గుర్తించి సకాలంలో తోడ్పడ్డాడు ఉన్నవ. స్త్రీ విద్యలో కళలకు ప్రాధాన్యం కల్పించాలనే సంకల్పంతో సంగీతం, చిత్రలేఖనం, స్వతంత్ర మార్గజీవికకై కుట్టుపని, రాట్నము మున్నగు చేతిపనులు ఏర్పాటుచేశాడు. ఈ రకంగా శారదా నికేతనం జాతీయోద్యమ భాగంలో ఒక నిర్మాణ కార్యక్రమంగా స్థాపించడం జరిగింది.

## v) హరిజనోద్ధరణ

చాతుర్వర్ణ వ్యవస్థను నిశితంగా విమర్శించి మనుషులంతా ఒకేజాతి అని చాటి చెప్పాడు ఉన్నవ. అస్పృశ్యత ఎంత ప్రాచీనమైనా దానిని వెంటనే నిర్మూలించాలన్నదే ఆయన ధ్యేయం. సమాజంలో అట్టడుగున ఉన్న బడుగుజీవులు పైకిరానంత కాలం దేశానికి విముక్తిలేదని అభిప్రాయపడ్డాడు. అందుకే గాంధీజీ సహాయనిరాకరణకు ముందే 1916 లో పెద్దపాలెంలో 'కృష్ణాశ్రమం' స్థాపించి అధ్యక్షులుగా ఉండి నిమ్నజాతుల ఉద్ధరణకు పాటుపడ్డాడు. తాను ఆశించిన సంస్కరణలకోసం అహర్నిశలు కృషిచేశాడు. అస్పృశ్యతా నివారణకు పాటుపడి వితంతు వివాహాలను చేయించి వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించి వికాసయుగంలోనే మేటి సంఘ సంస్కర్తగా పేరొందాడు ఉన్నవ.

## vi) భాషోద్యమంలో తొలి సమిధ

భాషా పరంగా ఉన్నవ వ్యావహారిక భాషా సారస్వతం ఉండాల్సిన అవసరాన్ని ఆనాడే గుర్తించాడు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ కృత్రిమ రూపాలు కల్పించుకొని రాయడం, చదవడం అలవాటు కావడంచేత కృత్రిమ రూపాలకు అలవాటు పడ్డ నోటితో వాడుక భాష చదువబోతే ఎబ్బెట్టుగా కనబడడం నే నెఱుగుదును. మాట్లాడే మోస్తరుగానే నడవడం ప్రారంభిస్తే వాడుక భాషలో రుచి కనబడుతుంది అన్నాడు.[15] భాషా విషయంలో 'మాలపల్లి' ఒక కొత్త ప్రయోగం. సాంఘిక, ఆర్థిక పరిస్థితుల్ని సాహిత్యంలో చిత్రించాలని ఎవరూ ఊహించని రోజుల్లో వ్యావహారిక భాషలో 'మాలపల్లి' వెలువడింది. 1921 నాటికి గిడుగు, గురజాడల ఉద్యమానికి ఉన్నవ చేయూత నిచ్చాడు. ఆ కాలంలో దేశ పరంగా స్వాతంత్ర్యోద్యమం, భాషాపరంగా వ్యావహారిక భాషోద్యమం, జాతి పరంగా హరిజనోద్యమం, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమం ఉధృతంగా సాగుతున్నాయి. దేశభక్తునిగా స్వాతంత్ర్య, ఆంధ్రోద్యమంలో పాల్గొని, సంఘ సంస్కర్తగా వితంతు, స్త్రీ జనోద్ధరణకు, హరిజనాభ్యుదయానికి పాటుబడి సాహితీవేత్తగా వ్యావహారిక భాషోద్యమంలో ప్రధాన పాత్ర వహించిన ఉన్నవ వ్యక్తిగతంగా కూడా మహోన్నత వ్యక్తి. పదవీ వ్యామోహం లేక దేశానికి ఎనలేని సేవచేసి 1958 సెప్టెంబరు 25న మరణించాడు. దేశసేవ ప్రధానం గల ఉన్నవకు సాహిత్యం హృదయం వంటిదైతే సంఘ సంస్కరణ ఊపిరి లాంటిది.

# ఆ) సాహిత్య కృషి

## i) రచనలు - ఆశయాలు

ఇరవయ్యో శతాబ్దం తొలి రోజుల్లో గుంటూరులో 'యంగ్‌మెన్స్ లిటరరీ అసోసియేషన్' అనే యువజన సాహితీ సమితి స్థాపించబడింది. ఈ యువజన సాహితీ సమితి కాలక్రమాన దినదినాభివృద్ధి జెంది మహా వటవృక్షమై ఆంధ్రోద్యమంగా మారడానికి దారి తీసింది. ఈ సమితిలో ఉన్నవ, జొన్నవిత్తుల గురునాథం, న్యాపతి నారాయణరావు, చల్లా శేషగిరిరావు ప్రభృతులంతా సభ్యులు.[16]

ఉన్నవ గుంటూరు జిల్లా గ్రంథాలయాల అభివృద్ధికి కృషిచేయడం ఆంధ్ర సారస్వతాభ్యుదయం పరమ లక్ష్యంగా పనిచేయడం ప్రారంభించాడు. 1935 లో జరిగిన మారేపల్లి రామచంద్రశాస్త్రి, షష్టిపూర్తి ఉత్సవాలు విశాఖలో జరిగాయి.[17] అప్పుడే శరణు రామస్వామిచౌదరి అధ్యక్షతన 'గ్రంథాలయ సేవక సంఘం' ద్వితీయ సమావేశం జరిగింది. అందులో ఒక ఉప సంఘం ఏర్పడింది. ఉన్నవ దానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైనాడు. ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు 'ఆంధ్ర భాషా ప్రవీణ' పరీక్షలో తెలుగు లేకుండానే డిగ్రీ పొందే వీలు కల్పిస్తే దాన్ని రద్దుచేయాలని ఈ సంఘం తరపున ఉన్నవ తన వ్యాసం ద్వారా నివేదించాడు.[18]

గుంటూరు తాలూకా గ్రంథాలయ సంఘంగాని, పట్టణ గ్రంథాలయ సంఘంగాని తలపెట్టిన కార్య పరంపరకు'శారదానికేతనం' కేంద్రంగా ఉందంటే ఉన్నవ అండదండలే కారణంగా చెప్పొచ్చు. 1942 లో తాలూకా గ్రంథాలయ సంఘం నిర్మాణం చేసిన వయోజన గ్రంథాలయ శాస్త్ర ఉప సంఘాలకు ఉపదేశి కత్వం ఉన్నవదే.

గుంటూరు యువసాహితీ సంఘం వారు స్వాతంత్ర్య ఉద్యమానికి సాంస్కృతికంగాను, రాజకీయంగాను తోడ్పడ్డారు భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తుందని విశాలాంధ్రను సాధిస్తామని దృఢ సంకల్పంతో పనిచేశారు. వారు అనుకున్నట్లుగా స్వాతంత్ర్యమే గాదు విశాలాంధ్ర కూడా సిద్ధించింది.

తెలుగు సాహిత్య వికాస యుగంలో (1920—1940) ఉన్నవ స్థానం విశిష్టమైంది. సాహిత్యాన్ని పునర్వికాసానికి సాధనగా గ్రహించి తెలుగు జాతి కన్నుతెరిచిన మహనీయుల్లో ఉన్నవ ఒకడు. తెలుగులో నవలా రచనకు వికాస దశ ఉన్నవ 'మాలపల్లి' (1922) తోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. 'మాలపల్లి' వెలువడే నాటికి భారతీయ భాషల్లో దేనిలోనూ యింతటి నవల వెలువడలేదు.[19] తెలుగులో వాడుక భాషలో వెలువడ్డ మొట్టమొదటి నవల 'మాలపల్లి'. గాంధి, తిలక్‌ల స్వరాజ్యవాదం, రాజారామమోహన్‌రాయ్, కందుకూరి వారల సంఘ సంస్కరణాభిలాష, రష్యన్ బోల్షివిజం ఉన్నవకు స్ఫూర్తినిచ్చాయి. ఇరవయ్యో శతాబ్దారంభంతో ఆయా దేశభాషల్లో బలపడుతున్న

నవలా ప్రక్రియను దాని కాల్పనిక (*Romantic*) లక్షణంనుంచి తప్పించి వాస్తవిక దృష్టితో పీడిత ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల అభ్యున్నతికి ప్రేరకంగానూ; నూతన సోషలిస్టు ప్రపంచ దృక్పథ ప్రదర్శకంగానూ, విలక్షణంగా ఒక పెద్ద మలుపు తిప్పిన భారతీయ నవలా రచయితలలో ఉన్నవ ఒకడు. అట్టడుగున పడి అణగారిన దీనుల జీవిత విధానం చూచి హృదయం కరిగి వారిని సమాజంలో సమున్నతులుగా చేయాలన్న కోరికతో ఎన్నో రచనలు చేశాడు.

ఉన్నవ పదికి పైగా పుస్తకాలు రచించాడు. వీటిలో నవలలు, నాటకాలు, కవితలు, చారిత్రకాలు, జీవిత చరిత్రలు మొదలైనవి ఉన్నాయి ఉన్నవ సాహిత్య వ్యాసంగం అనువాదాలతో ఆరంభమైంది. ఆయన మూడు పుస్తకాలను అనువదించాడు

1. బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాస సంపుటి

1907 లో బిపిన్‌చంద్రపాల్ ఆంధ్ర దేశంలో పర్యటించి స్వరాజ్యోద్యమ ప్రచారానికి పూనుకున్నాడు ఆయన ఉపన్యాసాలను మొట్టమొదట తెలుగులోకి తర్జుమా చేశాడు ఉన్నవ ఈ ఉపన్యాస సంపుటి గ్రాంథికాంధ్రంలో రూపొందింది. ఈ రాజకీయ ఉపన్యాసాల అనువాదం ఉన్నవ గ్రంధరచనకు మొదటి ప్రయత్నమని చెప్పవచ్చును.

2. అక్బర్ చరిత్ర

1907 ఆంధ్రభాషాభివర్ధనిసంఘం వారు అక్బరు చక్రవర్తి మత సామరస్య ధోరణిని ప్రచారం చేసేందుకు ఉన్నవ చేత అక్బర్ చరిత్రను రాయించి ప్రకటించారు ఈ గ్రంథం స్వతంత్ర గ్రంధమనడానికి వీలులేదు [20] ఈ గ్రంధాన్ని గ్రాంధికాంధ్రలో అనువదించాడు ఉన్నవ.

3. మాక్సిమ్ గోర్కి తుది గడియలు

సామ్రాజ్య వాదులను, నిరంకుశ వాదులను ప్రతిఘటించిన మాక్సిమ్ గోర్కి జీవితానికి సంబంధించిన గ్రంధాన్ని అనువాదం చేశాడు ఉన్నవ. ఈ

'మాక్సిమ్ గోర్కీ తుది గడియలు' ఉన్నవ చేసిన అనువాదాల్లో ముఖ్యమైంది. కాని అది అలభ్యం. ఒక్క ఉపేంద్రశర్మగారే దీనిని పేర్కొన్నారు.

4. ఇండియా రాజ్యతంత్రము

ఉన్నవ, జొన్నవిత్తుల గురునాథంతో కలిసి 'ఇండియా రాజ్యతంత్రము' రచించాడు. రాజకీయ, ఆర్థిక విషయాలను అంకెలతో తెలియ చెప్పే ఈ స్వతంత్ర గ్రంథం గ్రాంధిక భాషలో రాశారు.

5. రాట్నము—మగ్గము

సహాయ నిరాకరణోద్యమంలో భాగమైన విదేశీవస్తుబహిష్కారానికి పూను కున్న నాయకులు స్వదేశీ వస్తువులను వాడాలని ప్రచారం చేసి ఖద్దరు నేతకు కుటీర పరిశ్రమలను స్థాపించారు. ఆ సందర్భంలో ఖద్దరును గూర్చి రాసిన గ్రంథం 'రాట్నము-మగ్గము'. శారదా నికేతనంలో రాట్నము యింకా ఇతర చేతి పనుల శాఖలను ఏర్పాటు చేసి ఉద్యమానికి తోడ్పడ్డాడు ఉన్నవ.

6. మాలపల్లి[22]

కాల్పనిక సాహిత్యం రాజ్యమేలుతున్న ఆ కాలంలో వాస్తవిక రచనలను అందించాలనే తపనతో నవలా రచనకు పూనుకున్నవాడు ఉన్నవ. 1920-22 ప్రాంతంలోని తెలుగు దేశ స్థితిగతుల చిత్రనమే 'మాలపల్లి' లోని ఇతివృత్తం. అనాటి మనదేశంలో ఎల్లెడలా కనిపించేది స్వరాజ్యం జ్వరమే. ఆ స్వరాజ్యం ఎలా ఉండాలో కలలు కంటున్నాడు ఉన్నవ. అది సురాజ్యంగా ఉండాలను కున్నాడు. స్వరాజ్యం సమతారాజ్యంగా కూడా ఉండాలను కున్నాడు. ఆ దృక్పథంతో నవల రాయాలని మనస్సులో మథన పడుతూ వచ్చాడు. పల్నాడు పుల్లరి సత్యాగ్రహంలో అరెస్టు కావడం తోటే 'మాలపల్లి' రచనకు అంకురార్పణ జరిగింది. సమాజ జీవనంలో అధోగతిలో ఉన్న ప్రజల ఉద్ధరణ మన కర్తవ్యం అని 'మాలపల్లి' సారాంశం. పునరుజ్జీవన ఉద్యమాన్ని అంది పుచ్చుకుంటూనే సనాతనత్వాన్ని ఆధునికమైన మానవీయమైన విలువలకు సమన్వయం చేస్తూ సాగించిన తొలి తెలుగు నవల 'మాలపల్లి'.

ఉన్నవ గ్రామీణ జీవితంలో భూస్వాములకు చిన్న రైతులకూ నిత్యం జరిగే సంఘర్షణను వాస్తవికంగా చిత్రించాడు. ఉన్నవ స్వయంగా జాతీయోద్యమంలో పాల్గొని జైలు జీవితం గడిపాడు. కాబట్టి ఆ ఉద్యమ తీవ్రతను దేశ వ్యాప్తంగా దాని ప్రభావాన్ని కనులకు కట్టేట్లుగా చిత్రించాడు.

రామదాసు జీవిత పరిణామం 'మాలపల్లి' లోని కథా వస్తువు. రామదాసు ఆలంబనగా చేసిన సమస్తమానవకోటి జీవిత చిత్రణం కాబట్టి మాలపల్లి మానవ ధర్మ పరిణామ చిత్రణగా అంటే మానవుల్లోని ఆశలు, ఆకాంక్షలు, సుఖాలు, దుఃఖాలు, బాధలు, ద్వేషం మానావమానాలు చివరికి జీవిత పరిణామం ఎలా పర్యవసిస్తుందో నిరూపించాడు ఉన్నవ.

7. తిక్కన (నవల)

1930 ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టయి జైలు శిక్ష అనుభవిస్తున్నప్పుడు వ్రాసిన నవల తిక్కన "ఆంగ్లేయులు భారతదేశాన్ని జయించ లేదు. భారతీయుల అనైకమత్యమే ఓటమికి కారణం" అని నిరూపణ చేయడానికి ఉన్నవ 'తిక్కన' నవలను ప్రారంభించి 6—7 అధ్యాయాలు పూర్తి చేశాడు. ఉన్నవ సంకల్పించిన తిక్కన రచన ఆయన వేసుకున్న ప్రణాళికతో పోలిస్తే అసంపూర్ణమే. తిక్కనను గురించి భారతి పత్రిక బాగా ప్రశంసించింది.[23] ఆ నవలలోని 5—6 అధ్యాయాల గ్రంథం 1946 లో ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది. తిక్కన నవలలోని రెండో భాగం కొద్దిగా మార్చి నాటకంగా రూపొందించి 1944 'తారణ' సంవత్సరాది సంచికలో ప్రచురించాడు

ఉన్నవ ఒక నాటకం, నాలుగు నాటికలు రచించాడు. నాయకురాలు నాటకం. తిక్కన నవలను మూడు నాటికలుగా విభజించి రాశాడు. తిక్కన, అన్నమాంబ, సంగీతవాపసాని, మరోనాటిక సోదోయమ్మసోది.

8. నాయకురాలు

పల్నాటి వీరచరిత్ర ఆధారంతో ఉన్నవ 'నాయకురాలి దర్పం' నాటకంగా రాసి 1926లో ప్రథమంగా ముద్రించాడు. తర్వాత ఉన్నవ జాతీయోద్యమ సంస్కృతి ప్రతిబింబించే విధంగా రాయాలన్న కుతూహలంతో ముందురాసిన

నాటకంలో కొన్ని సన్నివేశాలు తగ్గించి 'నాయకురాలు'ను రూపొందించాడు ఈ నాయకురాలు రెండోసారి 1969లో అచ్చయింది.[24] గతకొన్నేళ్ళుగా ఉస్మానియా యూనివర్సిటి డిగ్రీ తరగతులకు పాఠ్యగ్రంథంగా ఉంటూవచ్చింది.

పల్నాటి వీరచరిత్ర పట్ల అత్యంత అభినివేశంతో ఈ కథను నాటకీకరించి నట్లు తెలుస్తుంది. దీనిలో పల్నాటి వీరోచిత కృత్యాలు, బ్రహ్మ నాయుని సర్వమానవ సౌభ్రాతృత్వ సిద్ధాంతం మున్నగు విషయాలతోపాటు గాంధీ గారి ఉపదేశాల్ని స్ఫురణకు తెచ్చే విధంగా నాటకీకరించడం జరిగింది. ఈ నాటకంలో ఉన్నవ ఆశయమైన పంచమోద్ధరణను ప్రతిపాదించాడు. అంతే గాక వర్గ సంఘర్షణను కూడా ఉన్నవ ఇందులో సూచించాడు. "చివరకు ఈ పోరాటం పంచమ పంచమేతర తగాదాలోకి దిగుతుంది" అని కన్నమనీడు అంటే బ్రహ్మనాయుడు "అంతకంటే బీదల భాగ్యవంతుల తగాదాలోకి దిగుతుందంటే సరిపోతుంది" అనేదాకా వెళ్ళాడు.[25]

ఈ నాయకురాలు నాటకంలో నుంచి ఒక భాగాన్ని తీసుకొని "హరిజన నాటకము" అనే పేరుతో విడిగా ముద్రించడం జరిగింది.[26] ఈ హరిజన నాటకంలో హరిజనుల దేవాలయ ప్రవేశం అన్న సమస్యే ప్రధాన ఇతివృత్తం. కులమత భేదాల్ని నిరసించడం ఇందులో మనకు కనిపిస్తుంది.

9. తిక్కన

తిక్కన ఉన్నవ అభిమాన కవి. జాతీయోద్యమంలో భాగమైన ఉప్పు సత్యాగ్రహంలో (1930) పాల్గొని అరెస్టయి జైల్లో కూర్చొని 'తిక్కన' నవ లను ఆరంభించాడు. కాని అది పూర్తి కాలేదు. తిక్కన నవలలోని రెండో భాగం లోని రెండో అధ్యాయానికి రూపాంతరమే 'తిక్కన' నాటిక. ఒకే రంగంతో నాటి కగా రూపొందించి 1944 'తారణ' సంవత్సరాది సంచికలో ప్రకటించాడు.

10. అన్నమాంబ

'అన్నమాంబ' తిక్కన నాటికకు అనుబంధము. 'అన్నమాంబ' నాటిక కొమ్మన చనిపోయిన పది రోజుల తర్వాత భర్త చనిపోయిన భార్య చేయవల్సిన కర్మకాండను గూర్చి అన్నమ, దోహర్త్ర, తిక్కనల మధ్య జరిగిన ప్రాణవంత

మైన సంభాషణ యిది. సతీ సహగమన మూఢాచారానికి కాలం చెల్లిపోయినట్టు ఉన్నవ యిందులో వివరిస్తాడు.

11. సంగీతనాపసాని[27]

నాయకురాలు, తిక్కన, అన్నమాంబ నాటికలకు భిన్నమైంది ఈ నాటిక. సంగీతనాపసాని తిక్కన కూతురు. అపురూపమైన సంగీత జ్ఞానం గలది. అందుకే ప్రకృతిలోని ప్రతి కదలికలోనూ సంగీతం వినగలుగుతుంది. పక్షుల నాదాలలో సంగీతాన్ని, వ్యక్తుల అడుగుల సవ్వడిలో తాళాన్ని గుర్తించే అద్భుత శక్తి ఆమెది.

తిక్కన, అన్నమాంబ, సంగీతనాపసానులు 'తిక్కన' నవలలోని కొన్ని భాగాలకు సందర్భోచితంగా కావించిన నాటకీకరణ మాత్రమే.

12. స్వరాజ్య సోదె

ఇది ఉన్నవ ఖద్దరు సోదె అనవచ్చు. ఈ నాటికలో గాంధీజీ గొప్పతనాన్ని ఆయన తెచ్చే ప్రేమ రాజ్యమైన స్వరాజ్యాన్ని గూర్చి సింగి సోదె చెపుతుంది. స్వరాజ్యం గురించి కలలుకనే ఉన్నవ స్వరాజ్య సోదె యిది.

ఉన్నవ రాసిన నాటకాలను పరిశీలిస్తే తేలే సామాన్య గుణం అవి చారిత్రక ఇతివృత్తాలు కావడం. చరిత్ర ప్రసిద్ధిపొందిన పాత్రలు. ఆ నాటకాల్లోని సంఘటనలు పూర్తిగా కల్పితాలు కాదు. కాని నాటకాల ద్వారా తాను చెప్పదలచుకున్న ఉద్దేశాలు మాత్రం తన సొంతం అనవచ్చు. 'నాయకురాలు' పల్నాటి వీరచరిత్రకు సంబంధించినదైతే మిగిలిన మూడు నాటికలు తిక్కన జీవితానికి సంబంధించినవి. మిగిలిన ఒకటి ఆనాటి స్వాతంత్ర్యావశ్యకతను తెలిపే స్వతంత్ర నాటిక. అన్నిటా ఉన్నవ ఆశయం ఒకటే. సామాన్య ప్రజానీకాన్ని జాగృతం చేయడం ఉన్నవ సామాజిక అవగాహన వీటి ప్రత్యేకత.

13. కవితలు

ఉన్నవ కృష్ణాపత్రికలో 1922 నుంచి జానపద గేయాలు ప్రకటించాడు. జానపద గేయరీతులపైనున్న ప్రేమకు ఆ బాణీలపై ఆయనకు గల అధికారానికి

నిదర్శనం కృష్ణా పత్రికలో అచ్చయిన 'స్వరాజ్యసోది'. స్వారాజ్య దండకం కూడా రాసి ఉద్యమంలో గానం చేసేవాడు. ఉన్నవ కవితా విభాగం 'భావతరంగాలు' కావ్యంగా 1933లో ముద్రించ బడింది. ఈ ముద్రణ తర్వాత 'బుడబుక్కల జోస్యం' జానపద బాణీలో రాసిన కవిత భారతి పత్రికలో 1936 మేలో అచ్చయింది. 1933లో ముద్రించిన భావతరంగాలు వివిధ గ్రంథాల నుంచి ఏరి ప్రకటించినవి ఇందులో ఏలలు, సుద్దులు, చిందులు, బుర్రకథలున్నాయి. ఇవన్నీ జానపద గేయ బాణీల్లో రాశాడు. ఏలపాట 'మాలపల్లి' సంగదాసు హత్య సందర్భంగా పాడేది. బుర్రకథ జగ్గని తత్త్వాలు ప్రచారం చేసే వేళ పాడేవి. పశువుల కాపరులు 'నాయకురాలు' నాటకంలో పల్నాడు విభజన తర్వాతి ఇబ్బందులను పాటలో సూచిస్తారు. 'రోటిపాట' గామాలపాడు స్త్రీజనం పాడే పాటయితే 'తందాన' పాట కోడిపందాల సందర్భంలోనిది. 'ప్రళయగీతం' కారెమపూడి యుద్ధం తర్వాత భూత ప్రేత పిశాచాల వర్ణనం. 'యశోదా వైభవం' వేదాంత పరిభాషలో మనోరాజ్యాన్ని సూచిస్తుంది. 'చిందుపాట'లో అంటరానితనాన్ని నిరసిస్తూనే బానిసత్వం తొలగాలని ప్రబోధం చేశాడు. సంస్కరణ దృష్టితో చూస్తే ఉన్నవ కవితల్లోకెల్లా ఇది మేలుబంతి. 'పువ్వుపాట' పువ్వుబోడి ప్రేమ భావాన్ని వ్యక్తపరిచే పాట. 'మేకపాట' వీరమ్మ అనే గొల్ల స్త్రీ భర్తతో సహగమనం చేసిన కథ. చివరిపాట 'సంగీతనాపసాని'- 'తోటపాట' కోకిలమ్మకు గొంతును సవరించి, కలరవమున సుతి కలపమని తుమ్మెదను వేడి తైతక్కలాటకై నెమిలమ్మను పిలచి తీగ సానితో చేయిసాచి ఆటపాటలో తేలేది ఆ గాయత్రీదేవి.

చిరుకబ్బములైనా వీటిలో సమకాలీన వృత్తాంతాలను ప్రాచీనరీతుల్లో మలచడం కనబడుతుంది.

14. పీఠికలు

ఉన్నవ రసవత్తరమైన పీఠికలురాసి రచయితలను ప్రోత్సహించిన కావ్యాలు చాలా ఉన్నాయి. 'మర్యాదరామన్న చరిత్ర' 'దేశబంధు చిత్తరంజన్ దాసు' లాంటివి కొన్ని లభించాయి.

తురగా వెంకయరాజకవి ప్రబంధశైలిలో రాసిన 'మర్యాదరామన్న చరిత్ర'కు పీఠికను రాశాడు ఉన్నవ. కవి రచనా ప్రాగల్భ్యాన్ని విశదం చేయడమే గాక కవి కాలాదులను చర్చించి ఆంధ్రలోకానికి పరిచయం చేశాడు. ఈ పీఠికవల్ల ఉన్నవకు ఉన్న చారిత్రక పరిశోధనాసక్తి,ప్రవేశం విదితమవుతున్నాయి.

కోన వెంకటరాయశర్మ రాసిన 'దేశబంధు చిత్తరంజన్‌దాసు' జీవిత చరిత్రకు ఉన్నవ పరిచయం రాశాడు. 1921లో ముద్రించిన ఈ కావ్యానికి పరిచయంరాస్తూ ఉన్నవ దేశబంధు చిత్తరంజన్‌దాసు దేశసేవా నిరతిని శ్లాఘించాడు. కోన వెంకటరాయశర్మను ఎంతో మెచ్చుకున్నాడు.

తిలక్ మహరాజు తిక్కన నాటికనురాసి దానికి పీఠికను ఉన్నవ చేత రాయించాడు. తిక్కనకవిమీద అభిమానమున్న ఉన్నవ ఆనాటికకు రసవత్తర పీఠికను సమకూర్చాడు. ఉన్నవ రాసిన పీఠికల్లో ఆయనకున్న దేశాభిమానం, సాహిత్యాభిమానం ప్రస్ఫుటంగా వ్యక్తమౌతాయి.

15. వ్యాసాలు

ఉన్నవ 20 వ్యాసాల వరకు రాశాడు. ఆయన పలువిషయాలకు సంబంధించిన వ్యాసాలు రాశాడు. సాహిత్యానికి సంబంధించినవీ, జాతీయ ఉద్యమ, ఆంధ్రోద్యమాలు మున్నగు విషయాలపై రాసిన వ్యాసాలున్నాయి.

1. శివకవులను మించినకవి [కవిరాజు (1942 ఏప్రిల్‌లో) గజారోహణోత్సవం సందర్భంగా రాసింది] 2. కవిరాజు అస్తమయం (ఆంధ్రపత్రిక 28-1-1943) 3. హిందూమతము - అచలబోధ. (ఆంధ్రసర్వస్వము — 1943) 4. నా అనుభవాలు (చేతన ఏప్రిల్ 1962) 5. సౌందరనందము (కృష్ణాపత్రిక 16-3-1935) 6. నన్నయభట్టుకవి - గోపాలుని రామకవి (ఆంధ్రపత్రిక 1919 ఉగాది సంచిక) 7. ప్రేమరాజ్యము (ఆంధ్రపత్రిక 1939 సంవత్సరాది సంచిక) 8. ఆశీస్సులు 9. బొమ్మలాట (భారతి రజతోత్సవ సంచిక 1948) 10. ఆంధ్రభాషాప్రవీణ (భారతి సెప్టెంబర్ 1933) 11 పల్నాడు అడవి ఇబ్బందులు (గుంటూరుజిల్లా స్వరాజ్య ఉద్యమం 1921) 12. సంజయ రాయబారము (జయంతి ప్రథమ సంచిక 1927) 13. కృష్ణ రాయబారము (భారతి నవంబర్ 194 ).

విశాలాంధ్రోద్యమం, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి మీద రాసిన వ్యాసం (ఆంధ్రపత్రిక అక్టోబర్ 1958) దేవాలయాలు, భీష్మవిభీషణులు మున్నగు వ్యాసాలు రాశారు. తెలుగును నిరసించే ఆంగ్లాభిమానుల భావాల్ని ఖండిస్తూ ఆంధ్రపత్రికా ముఖంగా వ్యాసాలు గుప్పించి ఉన్నవ తన భాషాభిమానాన్ని ప్రదర్శించాడు.

ఈ విధంగా ఉన్నవ సాహితీ కీర్తి 'మాలపల్లి'తో ముడిబడి ఉన్నప్పటికి ఇతర రచనల ద్వారా ఆయన ప్రతిభ, అభినివేశాలు బహుముఖాలుగా విస్తరించి భాసించాయని చెప్పుకోవచ్చు.

# 2. ప్రేమ్‌చంద్

## అ) వ్యక్తిగత, బహిరంగ జీవితాలు

ప్రేమ్‌చంద్‌గా ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఈ రచయిత అసలు పేరు ధనపతిరాయ్ శ్రీవాస్తవ్. మొదట 'నవాబ్‌రాయ్' అన్న పేరుతో రచనలు సాగించాడు. ఉర్దూ, హిందీ సాహిత్యాలలో ఉత్తమ నవలలు, కథానికలు వ్రాసి అగ్రతాంబూలం అందుకున్న ఘనుడు. ఈతడు సంఘాన్ని సంస్కరించి నవ జీవన చైతన్యాన్ని రగిలించి, సామాజిక దృక్పధాన్ని వాస్తవికతతో సమ్మిళితం చేసి, నవసమాజాన్ని కాంక్షించిన ఆదర్శవాది. సమాజం గురించీ, ఆర్థిక సంబంధాల గురించీ శాస్త్రీయమైన అభిప్రాయాలు ఇంకా మన దేశానికి రాకముందే అభ్యుదయ భావాలతో ఈయన సాహిత్యం పరవళ్ళు దొక్కింది.

ఉర్దూ, హిందీ భాషలలో వివిధ ప్రక్రియలను చేపట్టి సాహిత్యాన్ని అలంకరించిన ప్రముఖ రచయిత ప్రేమ్‌చంద్, హిందీ ఉపన్యాస్ చక్రవర్తిగా కీర్తిని ఆర్జించిన మహావక్తి.[28]

ప్రేమ్‌చంద్ ఉత్తరప్రదేశ్‌లోని 'లమహీ' గ్రామంలో పేదకుటుంబంలో 31 జులై 1880లో జన్మించాడు. ప్రేమ్‌చంద్ తండ్రి అజాయబ్‌లాల్, తల్లి ఆనందిదేవి. ఆనాటి అధికారభాష ఉర్దూ అయినందున ప్రాథమికస్థాయి వరకు ఉర్దూలోనే విద్యాభ్యాసం చేశాడు ఆయనకు 15వ ఏట బనారస్‌లోని క్వీన్స్‌కాలేజీలో 9వ తరగతి చదువుతున్న రోజులలో వివాహమైంది. అనురాగం ఏర్పడని కారణంగా భార్యను పుట్టింటికి పంపించాడు.

ప్రేమ్‌చంద్ మధ్యతరగతిలో అట్టడుగువర్గానికి చెందడంవల్ల చునార్‌లోని మిషనరీ స్కూలులో ఉపాధ్యాయుడుగాచేరాడు. ఆ ఉద్యోగం ఆధారంగానే కుటుంబాన్ని పోషించుకోసాగాడు 1900లో బహ్రైచ్‌లో జిల్లా ప్రభుత్వ పాఠశాలలో అధ్యాపకుడుగా చేరాడు. 1901 నుండి నవాబురాయ్ పేరుతో సాహిత్యవ్యాసంగం ప్రారంభించాడు. తర్వాత అలహాబాద్ మోడల్ స్కూల్లో హెడ్‌మాష్టరుగా నియమింపబడ్డాడు ఫతేపూర్‌లోని ఒక కుగ్రామ నివాసి మున్షీదేవీ ప్రసాద్ కూతురు శివరాణీదేవి (బాలవితంతువు)ని ప్రేమ్‌చంద్ ద్వితీయ వివాహం చేసుకున్నాడు. ఆ రోజులలో వితంతువును చేసుకోవడమంటే సామాన్య విషయంగాదు. సాహసించి శివరాణీదేవిని ద్వితీయం చేసుకున్నాడు ప్రేమ్‌చంద్. సాంఘిక దురాచారాలను ఎదిరించి, ఆనాటి యువకులకు ఆదర్శమూర్తిగా నిలబడ్డాడు. 1905 మే నుంచి 1909 జూన్ వరకు పాఠశాలల డిప్యూటీ ఇన్‌స్పెక్టర్‌గా ఆయన కాన్పూర్‌లోనే ఉన్నాడు. 1913 నుండి ప్రేమ్‌చంద్ హిందీలో రచనా వ్యాసంగాన్ని మొదలుపెట్టాడు. ఆయన వ్యాసం 'జవ్వా–ఎ- ఇసాద్'లో హిందీభాష ప్రాముఖ్యాన్ని గూర్చి వివరించాడు. భారతదేశ రాజకీయ రంగంలో జాతీయోద్యమం ఒక రూపం ధరించకముందే ప్రేమ్‌చంద్ దరిద్రులైన కష్ట జీవుల గురించి ఆవేదనపడ్డాడు మొదట్లో గాంధీవాదం మీద ఆయనకు మొగ్గు ఉన్నా క్రమ గా ప్రగతివాద దృక్పథంపైపు ఆకర్షింపబడ్డాడు. 1908లో వెలువడిన 'సోజేవతన్' (దేశంవ్యథ)లో దేశ విద్రోహ ప్రచారం ఇమిడి ఉన్నదని బ్రిటిషు ప్రభుత్వం హెచ్చరించడం, నిషేధించడం జరిగింది. ఈ సంఘటన తర్వాత తన పేరును ప్రేమ్‌చంద్‌గా మార్చుకొని పుంఖానుపుంఖంగా రచనలు సాగించాడు 'సోజోవతన్'ను ఆంగ్లేయ ప్రభుత్వం అగ్నికి ఆహూతి చెయ్యడంవల్ల యింకా బ్రిటిషు ప్రభుత్వంపట్ల ద్వేషాన్ని ప్రజ్వరిల్ల

చేసింది. ఆ ఆవేశంతో రాసిన 'సమరయాత్రా' కూడా ప్రభుత్వ నిషేధానికి గురి అయింది. తానుకేవలం రచయితగానే గాక జాతీయోద్యమ కార్యకర్తగా పలువురి మన్ననలు చూరగొన్నాడు

ఆనాటి జాతీయోద్యమం ప్రేమ్‌చంద్‌ని ప్రభావితం చేసింది. 1921 ఫిబ్రవరి 8 న గాంధీజీ గోరఖ్‌పూర్‌లో ఉపన్యసించాడు. ఆ సంవత్సరమే (ఫిబ్రవరి 16న) ఆయన ఉద్యోగాన్ని విడిచిపెట్టాడు. ఆ తర్వాత కుటీర పరిశ్రమలను ప్రోత్సహించేందుకు నూలువడికే వ్యాపారం మొదలు పెట్టాడు. ఓపికలేని కారణంగా అనతికాలంలోనే ఆ వ్యాపారానికి స్వస్తి చెప్పి 1921 జూన్‌లో కాన్పూరులోని ఒక పాఠశాలలో హెడ్‌మాస్టర్‌గా చేరాడు. కాని సంవత్సరం కాక ముందే అంటే 1922 ఫిబ్రవరి లోనే ఈ ఉద్యోగం వదులుకున్నాడు.

1928లో మహాత్మాజీ పునర్దర్శనంతో ప్రేమ్‌చంద్ జాతీయ సేవలో జీవితం గడుపాలని నిశ్చయించుకున్నాడు. 1929 లో కాంగ్రెసులో చేరి జాతీయోద్యమ కార్యాక్రమాల్ని చేపట్టాడు. 1930 మార్చి బెనారస్‌లో ప్రేమ్‌చంద్ ఒక ప్రెస్సు పెట్టి 'హంస' అనే కథానికల పత్రికను ప్రారంభించాడు. ఈ పత్రిక సంపాద కీయంలో చాలా వరకు రాజకీయాలు ఉండడం వల్ల బ్రిటిషు ప్రభుత్వ అణచివేత చర్యకు గురి కావల్సి వచ్చింది. ప్రెస్సు పక్షాన రు. 1000/-లు ధరావత్ కట్ట మన్నారు. ఈ పరిస్థితుల్లో దేశంలో (1930) ఉప్పు సత్యాగ్రహోద్యమం సంచలనం సృష్టిస్తున్నది. 1931 విదేశీ వస్తు బహిష్కారణోద్యమంలో పాల్గొన్నందుకు శివరాణీదేవికి జైలుశిక్ష పడింది. మనలో ఆత్మబలం, చరిత్రబలం లేనందు వల్లనే తెల్ల ప్రభుత్వం ఇన్నేళ్ళుగా మనదేశంలో ఉంది ఆత్మబలం పెంచు కొని బ్రిటిషు ప్రభుత్వాన్ని త్రోసివేయాలని ప్రబోధించాడు [29] ప్రేమ్‌చంద్. తన భార్య జైల్లో ఉన్నా సహాయనిరాకరణోద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు ఆయన.

1932 నుంచి 'జాగరణ్' వార పత్రికను ప్రచురించడం మొదలుపెట్టాడు ప్రేమ్‌చంద్. ఈ ప్రెస్సు పత్రికల వల్ల నష్టపోతూ కూడా ప్రేమ్‌చంద్ వాటిని వదలుకోలేదు 1934 లో ఆయన బొంబాయి 'అజంతా సినీటోన్' సినిమా కంపెనిలో పనిచేయడానికి ఒప్పుకొన్నాడు. కాని ఆ వాతావరణం బొత్తిగా నచ్చక

మళ్ళీ బెనారస్ చేరుకున్నాడు. తన ఆరోగ్యాన్ని సయితం లక్ష్య పెట్టకుండా ధనం యావత్తు హంస పత్రికా నిర్వహణకు వెచ్చించాడు.

జీవిత చరమదశలో ప్రేమ్‌చంద్ దేశమంతా పర్యటించాడు. "సమాజ ధ్వజాన్ని పైకెత్తి పట్టుకున్న సైనికులం మనం" అంటూ అభ్యుదయ రచయితల సంఘం ప్రారంభ మహాసభాధ్యక్ష స్థానం నుంచి 1936 లో ప్రకటించాడాయన.[30] అప్పటికే లండనులో అభ్యుదయ రచయితలు ఒక లక్ష్య ప్రకటనను చేశారు.[31] అప్పుడది లండను నుంచి లక్నోకు దిగి వచ్చింది. ఈ అభ్యుదయ రచయితల మహాసభలు 1936 ఏప్రిల్ 9,10 తేదీలలో లక్నోలోనే జరిగాయి. ప్రేమ్‌చంద్ చివరి రోజుల్లో అంటే 1936 సెప్టెంబర్‌లో 'హంస' పత్రికలో 'మహాజనీ సభ్యత' అన్న వ్యాసాన్ని రాశాడు. మంగళసూత్రం నవలను రాస్తున్నాడు. 1936 అక్టోబర్ 8 ఉదయం 7 గం 30ని. లకు ప్రేమ్‌చంద్ తన 56 వ ఏట మరణించాడు ఆయన మరణించినపుడు ఆయన అంత్యక్రియలకు సరిపోను డబ్బు కూడా ఇంట్లో లేదు. ఆయన జీవితాన్ని కర్పూరంగా వెలిగించి మనకు వెలుగును ప్రసాదించాడు.

## ఆ) సాహిత్య కృషి

### i) రచనలు- ఆశయాలు

నవభారత సాహితీ జగత్తులో ధృవతార ప్రేమ్‌చంద్. ఆయన రచనను ఒక ఉద్యమంగా నిర్వహించాడు. భారతదేశంలోని కోట్లాది అమాయకుల ఆర్త నాదాలు వినిపించడానికి రచనలు చేశాడు అతని కలంలో బలం వుంది. క్రాంతి పతాకం చేతబూని రచనలు సాగించాడు.

ఉన్నత భావాలతో మౌలికమైన ఆలోచనతో ఆత్మవిశ్వాసం కలిగించి మానవుని ఆదర్శోన్ముఖున్ని చేసేదే సాహిత్యం. అది యదార్థమును చేయూతగా ధరించి మానవాళికి మార్గ దర్శకత్వం వహించాలి అన్నదే ప్రేమ్‌చంద్ లక్ష్యం. ఆ లక్ష్యానికి అనుకూలంగా అప్పటిదాకా కాల్పనిక జగత్తులో విహరిస్తున్న హిందీ కథా వాఙ్మయానికి సామాజిక స్పృహ కల్పించిన వాడు ప్రేమ్‌చంద్,

ఈ దేశంలో రచయిత తన రచనల మీద బతకలేడని జీవితావసరాలు తీరక అసంతృప్తితో అలమటించేవాడు సజీవ సాహిత్యం సృష్టించలేడని, రాసేవారికి నామ మాత్రం డబ్బువస్తే సరిపోదని స్వంత లాభాలు చూసుకొనే ప్రచురణకర్తల బారినుంచి రచయితలను కాపాడాలని ప్రేమ్‌చంద్ ముందుకు వచ్చాడు. రచయితలకు న్యాయం చేకూర్చాలనే ధ్యేయంతో మున్షీదయా నారాయణ్‌తో కల్సి 'హిందూస్థానీ అకాడమీ' స్థాపించాడు. అయితే అనతికాలంలోనే ఈ అకాడమీ సరిగా పనిచేయలేక మూత పడింది. దీని వలన ఆతనిఆశయం ఫలించలేదు. రచయితలకు తనకు తోచిన మేలు చేయాలనే సంకల్పనతో ప్రేమ్‌చంద్ ప్రెస్సు పెట్టాలని నిర్ణయించుకున్నాడు. 1923 లో సరస్వతీ ప్రెస్సును కాశీలో స్థాపించాడు. తాను ప్రారంభించిన ప్రెస్సుతో నానాయాతనలు పడ్డాడు. రాను రాను ప్రేమ్‌చంద్ సంకల్పానికీ, వ్యాపారానికీ అగాధం ఏర్పడి ప్రెస్ మూత బడింది. ఈ సరస్వతీ ప్రెస్సులోనే ప్రేమ్‌చంద్ 'ప్రేమ్ పచ్చీస్' అనే కథా సంకలనం, 'సంగ్రామ్' అనే నాటకం, 'ప్రేమాశ్రమ్' అనే నవల ప్రచురించారు. మొదటనే మూడు విభిన్నమైన సాహిత్య ప్రక్రియలను ప్రకటించడం ఆయన ప్రత్యేకత.

ప్రెస్ వల్ల తాను అనుకున్న ప్రయోజనం నెరవేరని కారణంగా పత్రికల ద్వారానైన సందేశం అందించాలని 'హంస' మాస పత్రికను 1930 లో ప్రారంభించాడు. ఈ పత్రిక సంపాదకీయంలో ప్రజలను చైతన్యం చేసే రాజకీయాంశాలుండేవి. బ్రిటిషు ప్రభుత్వం కన్నెర్ర చేసింది. ఈ పత్రిక ప్రభుత్వ అణచివేత చర్యకు గురికావల్సి వచ్చింది.

'హంస' పత్రికను చేపట్టిన రెండేండ్లకు ఇది సరిపోదన్నట్లు వినోద్‌-శంకర్ వ్యాస్ నడుపుతున్న 'జాగరణ్' వార పత్రికను కూడా నెత్తినేసుకున్నాడు ప్రేమ్‌చంద్. 'జాగరణ్' తొలి సంపాదకీయంలో "ఇది ఎవరిని కీర్తించదు. ఐతే మర్యాదలను అతిక్రమించదు. అప్పుడప్పుడు కటువైన మాటలు వినిపిస్తుంది" అని రాశాడు.[32] భావ స్వాతంత్ర్యానికి దర్పణము లాంటి మాట.

కొంత కాలానికి 'హంస' 'జాగరణ్' పత్రికలు ప్రేమ్‌చంద్‌ను ఆర్థికంగా బాగా కృంగ దీశాయి. తన ఆశయసిద్ధికోసం ఆర్థిక సంక్షోభం భరిస్తూ కూడా

పత్రికలను ఆపకుండా ప్రచురిస్తూ ఆయన పోయాడు. 'హంస' 'జాగరణ్' పత్రికలు ఎంతో నష్టంతో నడుస్తున్నాయి. ఆర్థికంగా ఇబ్బందులు పెరిగి పోతున్నాయి ఆయనకు. ఈ సుడిగుండంలోంచి బయటపడే మార్గంలేక కొట్టు మిట్టాడుతున్న సమయంలో బొంబాయి సినీ రంగం నుంచి పిలుపు వచ్చింది. దానితో ఆయనకు ధైర్యం పెరిగింది. 1934-లో ఒక ఏడాది పాటు 'అజంతా సినీ టోన్' కంపెనిలో పనిచేశాడు సంవత్సరానికి వారిచ్చే 8 వేల రూపాయిలతో ప్రాణప్రదమైన పత్రికలను నడిపించాలని, పుస్తకాలు రాసిందాని కంటే సినిమా ద్వారా ఎక్కువ సేవ చేయాలని ఆపనికి కుదిరాడు. డబ్బు యిబ్బంది తొలగు తుందనుకున్న ప్రేమ్‌చంద్‌కు చలనచిత్రరంగంలో కూడా ఇబ్బందులు మొదలు అయ్యాయి. తన మనస్తత్వానికి సరిపడని ఆ సినీ సంస్థకు నమస్కారం పెట్టి బెనారస్ చేరుకున్నాడు.

ప్రేమ్‌చంద్ రాత్రింబవళ్ళు రచయితల కష్టాల్ని గురించి ఆలోచించే వాడు. అయినంత మేరకు రచయితలకు మేలు చేయాలనే ఉద్దేశంతో సత్యజీవన్ శర్మ సహకారంతో 'రచయితల సంఘం' స్థాపించాడు. 1935 లో అభ్యుదయ రచయితల సంఘం స్థాపించబడింది. 1936 ఏప్రిల్ 9,10 తేదీలలో లక్నోలో జరిగిన సభలకు ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించాడు. సాహిత్యంలో నవశక్తిని, చైతన్యాన్ని తీసుకొని రావడానికి ప్రయత్నించడం సంతోషించ దగ్గ విషయం. ఇలాంటి సదుద్దేశంతో లండన్‌లో "భారతీయ అభ్యుదయ రచయితల సంఘం" ఏర్పడింది. వారు పంపిన మానిఫెస్టో ఆధారంగానే మనం పయనిద్దాం. "సాహిత్య రంగంలో ఏ ఐశ్వర్యాన్ని ప్రేమించే వారికి స్థానంలేదు. ప్రజాసేవయే ప్రధా నంగా భావించే వారికి ఇక్కడ స్థానం ఉంది. స్పందించే గుండె గల వాళ్లు, ప్రేమ ప్రసాదించ గల వాళ్ళే యిక్కడ కావాలి. మనం సమాజ పతాకాన్ని ఎత్తి పట్టు కున్న సైనికులం" అన్నాడు.[38] తర్వాత కొన్నాళ్ళకు వామపక్ష ఉర్దూ రచయితల సభలో అధ్యక్ష ప్రసంగంచేశాడు ప్రేమ్‌చంద్.

అతని చివరి రోజుల్లో సాహిత్య సంస్థలనుంచి ఆహ్వానాలు వస్తే కాదనలేదు. 'దక్షిణ భారత హిందీ ప్రచారసభ' వారు మద్రాసుకు ఆహ్వానించగా ప్రేమ్‌చంద్ భార్యతో మద్రాసు చేరుకున్నాడు. ఆ దంపతులకు అక్కడ ఘనస్వాగతం లభించింది. మద్రాసు నుంచి మైసూరు, బెంగళూరు కూడా వెళ్లారు. అలహాబాద్,

లక్నో, పూర్ణియా, ఢిల్లీ, లాహోర్ ప్రాంతాలనుంచి ఆహ్వానాలు రాగా ఆ ప్రాంతాలు కూడా ఆయన పర్యటించి వచ్చారు.

1. కథలు

ప్రేమ్‌చంద్ రచనా కాలంనాటికి దేశంలో రాజకీయ, సాంఘిక రంగంలో కొత్త మార్పులు రాసాగాయి. ఇంగ్లీషువారి పాలన ఉచ్ఛస్థితిలో ఉంది. జాతీయోద్యమం ఒక మూల రాజుకుంటూనే వుంది. బెంగాల్ విభజనపై ఆందోళన కూడా చెలరేగుతూంది. ఆ రోజుల్లో (1907) నవాబురాయ్ (ప్రేమ్‌చంద్) తన మొట్టమొదటి కథ 'దునియాకా సబ్‌సే అన్‌మోల్‌రత్న'ను 'జమానా' పత్రికలో ప్రకటించాడు. 1908లో 'సోజేవతన్' (దేశవ్యథ) ప్రచురింపబడింది. మొత్తం ఐదు కథలను కలిపి 'సోజేవతన్' అనుపేర 1909లో ఒక సంపుటిగా అచ్చువేశాడు. అసలే అవి ఆందోళన రోజులు. ప్రభుత్వం ఆ ప్రతులను స్వాధీనం చేసుకొని తగులబెట్టింది. కలం నడకను, పేరును మార్చుకోవల్సిన అవసరం ఏర్పడిందాయనకు. 'ప్రేమ్‌చంద్'గా రచనలు చేయడం ప్రారంభించాడు. 'బడేఘర్‌కీబేటీ' (1910) మొదటి కథ తర్వాత ఆ కలం పుంఖాను పుంఖంగా కథలను సృష్టించింది. పాతకాలపు రాచరికపు వ్యవస్థ వాసనలు పారద్రోలి సామాన్య ప్రజల గుండె చప్పుళ్ళు వినిపించింది. జన సామాన్యానికి అందుబాటులో ఉండే సాహిత్యాన్ని సృజించడం ఇతనితోనే మొదలయింది. దాదాపు 300 కథలు అచ్చయినవి.

బ్రిటిషు ప్రభుత్వపు దమన నీతివల్ల 'పంచ్‌పరమేశ్వర్'లో ఉన్న పవిత్ర భావన నశించి పోతుంది. ఈ కథలో గ్రామీణుల్లోని కుళ్ళును స్వార్థ బుద్ధిని చిత్రిస్తూనే పంచ్‌లో ఉన్న పరమేశ్వరత్వాన్ని పాఠకుల ముందుంచుతాడు. 'నమ్మక్ దరోగా' (*Salt inspector*) కథలో మన ఆదర్శాలు, విలువలు ఎంత కృత్రిమమైనవో వివరిస్తాడు. పరిణతి పొందిన తర్వాత రచించిన కథలు ఆయనను అత్యుత్తమ కథాకారునిగా మనకు సాక్షాత్కరింప చేస్తాయి. 'పూస్‌కీ రాత్' (శరత్‌రాత్రి) కథలో చలి బాధను పొందే రైతుల దౌర్భాగ్యాన్ని చూపుతూనే వారి బద్ధకాన్ని, అలసటను చూపిస్తాడు. 'లోక్‌మత్‌కా సమ్మాన్' కథలో ఒక గ్రామం నుంచి పట్టణానికి వచ్చి నాలుగు రూపాయిలు సంపాదన చేతికందగానే తాగుడు, జూదము అలవడిన రైతు జీవితాన్ని 'కఫన్' (శవంమీది గుడ్డ)తో సోమరిపోతు

జీవితానికి అలవాటు పడ్డ తండ్రీకొడుకుల ప్రవర్తనను చిత్రించాడు. కఫన్‌లో అవకాశ వాదులైన సోమరుల శవాన్ని కూడా ఎరగా చూపి సొమ్ముచేసుకొని తాగి, తందనాలాడిన ఉదంతం ఉంటుంది. చెడి బ్రతికిన సోమరి ధనికుల్ని జల్సారాయుల్ని తీసుకొని 'షత్రంజ్‌కే ఖిలాడీ' (చదరంగం ఆటగాళ్లు) కథను రాశాడు. 'బలిదాన్' లో జానెడు భూమికై ప్రాణాలర్పించే రైతు జీవితం చిత్రించాడు. 'సభ్యతా కా రహస్య'లో సాంఘిక కట్టుబాట్లకు గ్రామీణులు ఎలా కట్టుబడి యాంత్రికంగా బతుకు వెళ్లదీస్తారో వివరించాడు.

'ఈద్‌గాహ్' 'సవాశేర్‌గేహూ' 'పచ్‌తావా' (పశ్చాత్తాపం) 'ఘాస్‌వాలి' (గడ్డికోయువనిత) 'మనోవృత్తి' 'మాతాకా హృదయ్' ఇత్యాది కథల్లో గ్రామీణ జీవితంలోని ఒడుదొడుకులను, ప్రేమను, దుఃఖాన్ని ఎంతో భావ స్ఫూర్తితో చిత్రించాడు.

'సమరయాత్రా' జాతీయోద్యమానికి సంబంధించిన కథ. 'సమరయాత్ర' ఊరికి వచ్చింది. సత్యాగ్రహుల బృందం ఊరికి వచ్చి నాయకులు ఉపాన్యాసం చేస్తుంటే 'నౌహరి' అనే వృద్ధురాలికి కదలిక వచ్చింది. ఆమెలో ఉత్సాహం ఉరకలు వేసింది. చేతిలో కర్రను గుంపులోకి విసిరి పారేసి గంతులేస్తూ ఆడింది. ఇంతలో పోలీసులు వచ్చారు. జనం అంతా జారుకున్నారు. నౌహరి పోలీసుల మీద విరుచుకు పడ్డది. ఆమె సాహసం చూచి జనం మళ్ళీ గుమిగూడింది. ఆ పోలీసులు సత్యాగ్రహుల బృందాన్ని అరెస్టు చేశారు మరో దళం తయారు కావాలని వారిని ఆయత్త పరిచింది 'నౌహరి'.

తన జీవిత కాలంలోని కథలనన్నిటినీ 8 సంపుటాలుగా వెలువరించాడు. ఆ కథా సంపుటాలకు 'మానసరోవర్' పేరును పెట్టాడు ప్రేమ్‌చంద్. ఈ కథా సంపుటా లనువాదం సూర్యనారాయణమూర్తిగారు చేశారు.

## 2. నవలలు

సమాజం అన్యాయాలను, అక్రమాలను ఎదిరించడానికి జీవితాంతం పోరాటం జరిపిన 'కలమ్‌కా సిపాహీ' ప్రేమ్‌చంద్.[84] ఆయన ఒక లక్ష్యంతో ఒక

గమ్యంతో ఒక ధ్యేయంతో నవలారచన చేశాడు. ఆయన నవలల్లో సమాజం సాక్షాత్కరిస్తుంది.

ప్రేమ్‌చంద్ రాసిన నవలలు 13. ఆతని మొదటి నవల 'కృష్ణా' ప్రయాగలో ప్రకటించబడింది. 'వరదాన్' 1905లో రాసిన సాంఘిక నవల 'రూఠీరాణి' చారిత్రక నవలయితే 'ప్రతిజ్ఞ' సాంఘిక నవల. 'సేవాసదన్' కూడా సంఘసంస్కరణ నవల. తెలుగులో 'సేవాసదన్'ను అనువాదం చేసింది *S V V.* సోమయాజులు (1955) 'ప్రేమాశ్రమ్' (1920) జమీందార్ల దౌర్జన్యాలను చిత్రించే నవల. 'కాయకల్ప' (1927) జన్మజన్మలకథ. ఇక 'రంగభూమి' (1926) ప్రేమ్‌చంద్ నవలల్లో విశిష్టమైంది కూలిపోతున్న భూస్వామ్య నాగరికత, ఉదయిస్తున్న పారిశ్రామిక నాగరికతల చర్చ ఈ నవల. విశాలాంధ్ర పబ్లిషర్స్ దీనిని (1964) తెలుగులో అచ్చువేశారు. 'గబన్' (1931) ఆడంబరాలకుపోయే ఆడవారిని హెచ్చరించే కథ. హోదాకోసం సంసారాన్ని గుళ్ళచేసుకొనే జల్సాసంసారుల చిత్రణం ఇది. 'నిర్మల' (1925) అతిచిన్న నవల. మహిళల దుస్థితికి ప్రతిబింబం ఈ నవల. ఈ నవలను చాయేశ్వర్ (1953) తెలుగులోకి అనువదించాడు. 'కర్మభూమి' (1932) ప్రేమ్‌చంద్ నవలల్లో ప్రత్యేకతను సంతరించుకొంది. ఈ నవల జాతీయ ఉద్యమం తీవ్రదశలో ఉండగా రాసింది.

3. నాటకాలు

ప్రేమ్‌చంద్ కథలు, నవలలేగాక నాటకాలు కూడా రాశాడు. ఆయన మొట్టమొదటి నాటకం 'సంగ్రామ్' 1923లో అచ్చయింది. తర్వాత 'కర్బలా' నాటకం రాశాడు. 1928లో 'సంపాదక్ మోటే రాంశాస్త్రి' అనే ప్రహసనం రాశాడు. 1933లో 'ప్రేమ్‌కీవేదీ' అనే నాటకాన్ని ఎంతో అభిమానంతోరాసి ప్రకటించాడు. ప్రేమ్‌చంద్ అన్ని ప్రక్రియలను సమానంగా చేపట్టి వస్తువుకు ఆధారమైన దాన్ని ఎన్నుకొని రాశాడు. అందుకు నిదర్శనంగా కథల పుధ నాటకాలు, నవలలు రాయడాన్ని చెప్పొచ్చు.

4 అనువాదాలు

ప్రేమ్‌చంద్ అనువాదాలు కూడా చెప్పుకోదగ్గవి. ప్రసిద్ధ ఆంగ్లేయ రచయిత జాన్‌గాల్స్ వర్ధీ రాసిన నాటకాలను ప్రేమ్‌చంద్ హిందీలోకి అనువదించాడు. 'న్యాయ్' (*Justice*) "చాందీకీ డిబియా" (*Silver Box*) "హడతాల్" (*Strike*) లను అనువదించి 1930లో ప్రకటించాడు ప్రేమ్‌చంద్. ఇందిరా గాంధీగారికి రాసిన్నట్టి లేఖలను కూడా ప్రేమ్‌చంద్ అనువదించి పుస్తక రూపంలో ప్రకటించాడు. "ఆజాద్ కథలు" కూడా హిందీలోనికి అనువదించి ప్రేమ్‌చంద్ ప్రకటించాడు.

ఈ ప్రకరణంలో ఉన్నవ ప్రేమ్‌చంద్‌ల వ్యక్తిగత, బహిరంగ జీవితాలు, రచనా వ్యాసంగమూ, రచనల సంక్షిప్త స్వరూపమాత్ర పరిశీలనలు ప్రదర్శింపబడ్డాయి.

## పాద సూచికలు

1. మొన్న మొన్నటి ఉన్నవ పుట్టినతేదీని గురించి కూడా ఏకాభిప్రాయం లేకపోవడం ఆశ్చర్యకరంగా ఉంటుంది. శ్రీ శ్రీనివాస శిరోమణి "మాలపల్లి నిర్మాత—శ్రీ ఉన్నవలక్ష్మీనారాయణ" అనే వ్యాసం (భారతి నవంబర్ 1945) లో ఉన్నవ జన్మ తేదీని "ఈశ్వరనామ సంవత్సర కార్తిక బహుళ 30 అమావాస్య" అని పేర్కొన్నారు. ఇది ఆంగ్లతేది 1877 డిసెంబర్ 4 మంగళ వారానికి సమానం కాని శ్రీ శిరోమణి 1877 నవంబర్ 6 అని పేర్కొన్నారు. కాని ఇది ప్రామాణిక మని తోస్తుంది. దీనికి సమానమైన తెలుగు తేది 'ఈశ్వర నామ సం॥ కార్తీక శు॥ 1 మంగళవారం అవుతుంది. / శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య (తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం 4వ సంపుటి—తెలుగు సంస్కృతి—చరిత్ర 2 భాగంలో) ఉన్నవ 1878లో జన్మించాడని పై దానికి నాలుగేండ్లు తగ్గించాడు. ఇక మసునూరి వెంకటశాస్త్రి "ఆధునికాంధ్ర రచయితల సంగ్రహ చరిత్ర" (విద్యార్థి కల్పతరువు 1967) అనే వ్యాసంలో ఉన్నవ పుట్టిన యేడును 1873 గా పేర్కొన్నారు. శ్రీ శిరోమణి చెప్పిన దానికివి ఆరు సంవత్సరాలు ఎక్కువ. ఇంకా శ్రీ శిరోమణి యిచ్చిన తేదికి దాదాపు ఒక నెల తేడాతో చెప్పిన

వారు శ్రీ గూడూరి నమశ్శివాయ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రకటించిన "సాహిత్యోపన్యాసాలు-17" (1980)లో ఉన్నవ "విక్రమ నామ సంవత్సరం కార్తీక బహుళ 30 మంగళవారంనాడు జన్మించాడని రాశారు. ఇది 1880 డిసెంబర్ 2 గురువారానికి సమానం. తెలుగు తేదీని బట్టి చూస్తే ఈయన శ్రీ శిరోమణి తేదీకి దాదాపు రెండేండ్లు ముందున్నారు.

శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యకు గాని, శ్రీ నమశ్శివాయకుగాని, శ్రీ మసునూరి వెంకటశాస్త్రికిగాని పై తేదీలు ఎట్లా లభించాయో తెలియదు. ఏ గుర్తునుండో విచారణల ఆధారంగానో రాసి ఉంటారు. రోజుల, నెలల తేడాలున్న ప్పటికి శ్రీ శిరోమణి మున్నగువారు పేర్కొన్న ఈశ్వరనామ సంవత్సరమే సరియైనదని ఉన్నవ జీవితంలోని తేదీలతో బేరీజు వేసుకొని నిర్ధారించవచ్చు. మచ్చుకు ఒక తేది.... "1890 లో నాకు ఉపనయనము జరిగినది నాకప్పుడు పన్నెండేండ్లు" అని 'నా అనుభవాలు' (చేతన ఎప్రిల్ 1962)లో ప్రకటింపబడిన వ్యాసంలో పేర్కొన్నారు.

2. ఫెల్లో ఆఫ్ ఆర్ట్స్.

3. వీరేశలింగం జాతీయోద్యమానికి విముఖులు కావడం వల్ల ఈ విభేదం సాహిత్యోపన్యాసములు-17. గూడూరి నమశ్శివాయ. పేజి. 6. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్. ఆగస్టు 1980.

4. 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు' బంగోరె. పేజి. 6. విశాలాంధ్ర పబ్లిషర్స్, విజయవాడ. 4. ఎప్రిల్ 1979.

5. దరిశ చెంచయ్య ఉన్నవను గురువుగా భావించి ఆయన అడుగుజాడల్లో నడిచిన శిష్యుడు సాహితీవేత్త కూడా.

6. వాల్కార్ట్ కంపెనీ క్యాషియర్ అని కపిల వెంకటరావు వ్యాసం. (నవ్యాంధ్ర నిర్మాతలు, నవోదయ పబ్లికేషన్స్). కార్డ్ & కంపెని క్యాషియర్ అని ఉపేంద్రశర్మ (లక్ష్మీనారాయణులు, పేజి. 31. గాంధీ సాహిత్య ప్రచురణా

లయం, హైదరాబాద్. 1974) బహుశా ర్యాలి కంపెనికి ఇవి ఇతర వ్యావహారాలై ఉంటాయి.

7. "ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు- జీవితచరిత్ర" ఆంధ్రపత్రిక, 23 సెప్టెంబర్ 1922.

8. వైస్రాయి లార్డ్ హార్డింజ్ హిందూదేశమంతా భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజించాలని 1911 డిసెంబర్‌లో ప్రకటన చేశాడు. (సంఘ సంస్కర్త–ఉన్నవ. పేజి. 8) దీన్ని ఆధారం చేసుకొని చల్లా శేషగిరిరావు హిందూపత్రిక (1911)లో బీహారు, బర్మా రాష్ట్రాలలాగా ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు కావాలని కోరారు. (ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య పోరాటం, పేజి. 16, హైమవతి. ఆంధ్ర-సాహిత్య అకాడమీ, హైదరాబాద్. 1975).

9. 'ఆంధ్రప్రదేశ్ సాహిత్యపోరాటం' పేజి. 19

10. శాసన సభ, న్యాయస్థానం, పాఠశాలల బహిష్కరణలే 'త్రివిధ బహిష్కరణ' సందర్భంలో ఉన్నవ నాయకత్వంలో జరిగిన ఈ ఉద్యమం విజయం పొందింది.

11. పుల్లు=గడ్డి; అరి=పన్ను– గడ్డిపన్ను. పశువులు మేసే గడ్డి భూములకు చెల్లించ వల్సిన పన్ను పుల్లరి.

12. 1921 లో పల్నాటి సీమలో అడవి పుల్లరి వసూలును పురస్కరించుకొని ఆంధ్రదేశానికే గాక భారతదేశానికే మొట్టమొదటి సారిగా సహాయ నిరాకరణోద్యమానికి మూల పురుషులలో ముఖ్యులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ గారు– అని 'కృష్ణాపత్రిక' (4–10–1958) సంపాదకీయం పేర్కొంది.

13. 'హిందీ' రాష్ట్ర భాషగా కాంగ్రెసు నిర్ణయించినందుకు ఆంగ్లేయ ప్రభుత్వం ఆ భాషమీద నిషేధం పెట్టింది. హిందీ ఐచ్ఛికంగా ఎన్నుకొన్న విద్యార్థులు శిక్షలపాలైనారు.

14. ఒక సందర్భంలో దరిశచెంచయ్యతో మాట్లాడుతూ ఉన్నవ "పంక్తి భోజనం ప్రజాసమ్మతమైనప్పుడు వర్ణాంతర వివాహాలు సులభంగా జరగుతా" యన్నాడు.

15. 'వైతాళికుల శత జయంతులు' నెలవంక 1979-80 ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల సాహిత్యవార్షిక సంచిక, హైదారాబాద్.

16. చల్లా శేషగిరిరావు ఆంధ్రపత్రిక సంపాదకుడు. మిగిలినవారు కాంగ్రెసు వాదులు.

17. స్వాతంత్ర్య యోధుడు 'కవితా సమితిని' స్థాపించి శ్రీశ్రీవంటి కవులను ప్రోత్సహించిన మహోన్నత వ్యక్తి.

18. 'ఆంధ్ర భాషా ప్రవీణ' ఉన్నవ. భారతి. సెప్టెంబర్ 1933.

19. "వాడుక భాషలో పుస్తకం వ్రాయడానికి నాకిదే మొదటి ప్రయత్నం.. దారిపెడితే బాగుంటుందని ప్రారంభించాను" 'మాలపల్లి' ప్రథమ ముద్రణ పరిచయంలో ఉన్నవ అంటాడు. ఆంధ్రపరిషత్- బెజవాడ 1922.

20. "ఈ ఆంగ్లమూలమేదో తెలియ రాలేదు. అక్బరు చరిత్ర అనే చరిత్ర గ్రంథము వ్రాసినారు. అదిన్నీ స్వతంత్ర గ్రంథము అనడానికి వీలులేదు. అది ఒకానొక యింగ్లీషు గ్రంథాన్ని బట్టి వ్రాసింది" అని శ్రీ శ్రీనివాస శిరోమణి చెప్తున్నారు. 'మాలపల్లి నిర్మాత శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ' భారతి, నవంబర్ 1945.

21. ఈ అనువాదానికి మూలమేమిటా అని నేను చేసిన అన్వేషణ ఫలించ లేదు. కాని ఉన్నవ దీనిని రష్యన్ భాషనుంచి గాక ఇంగ్లీషు నుంచో, ఇతర భారతీయ భాషల నుంచో అనువదించి ఉంటాడు. విప్లవానంతరం గోర్కీ జీవితం లోని ఘట్టాలు ఆ తర్వాత అర్ధశీకరితాలని తెలియ వస్తున్నది. అంత గొప్ప రచయిత చివరి రోజుల్లో ఎన్నుకున్న అతి నిరాడంబర జీవితం, కుమార్తుని

మరణం మొదలైనవి ఆ మేధావిని ఎంతగా కలవర పరిచాయో—మున్నగు సంఘటనలు అందులో ఉండి ఉంటాయి.

22. 'మాలపల్లి' మొట్టమొదటిసారి 1922లో మూడు విడివిడి భాగాలుగా అచ్చయింది. ఆంధ్ర పరిషత్తు విజయవాడ వారు బెల్లంకొండ రాఘవగారి సహకారంతో ముద్రించారు మూడు సంపుటాలు కలిపితే 608 పేజీల గ్రంథమది. ప్రస్తుతం వేటపాలెం సారస్వత నికేతనంలో లభిస్తున్నది. 1922లో ముద్రించిన ఈ గ్రంథాన్ని 1923లో బ్రిటిషు ప్రభుత్వం నిషేధించింది. ఐదేళ్ళపాటు అజ్ఞాతవాసం తర్వాత 1928లో నిషేధం ఎత్తివేశారు. మరో ఏడేళ్ళ తర్వాత అంటే 1935 సెప్టెంబర్‌లో నాలుగో భాగంతో కూడిన రెండో కూర్పు వెలువడింది. దీనిని కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు 'ఆంధ్ర గ్రంథమాల' తరపున ప్రకటించారు. అదే సంవత్సరం 'మాలపల్లిని'ని బి.ఏ కు పాఠ్యగ్రంథంగా నిర్ణయించారు. కాని జూన్ 1936లో మళ్ళి నిషేధం దాపురించడం వల్ల పాఠ్య గ్రంథంగా ఉపసంహరించుకోవల్సి వచ్చింది. అప్పటి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు సర్వేపల్లి రాధాకృష్ణన్, 1937 జూలైలో రాజాజి మంత్రివర్గం 'మాలపల్లి' మీది నిషేధాన్ని తొలగించింది. దేశీ కవితా మండలి విజయవాడ వారు 1957లో 'మాలపల్లి'ని పునర్ముద్రించారు. ఆ తర్వాత 1976లో కేంద్ర సాహిత్య అకాడమీ తరపున కోదండరామిరెడ్డి సంక్షిప్తీకరణ ముద్రణం వెలువడే దాకా 'మాలపల్లి'ని ఎవరూ ముద్రించినట్టు ఆధారాలు లేవు.

23. సాహిత్య విశేషణములు 'రెండు గొప్ప గ్రంథములు' భారతి అక్టోబర్ 1943

24. త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్నం, 1969. ఈ నాటకాన్ని 1982లో ఐదోసారి ముద్రించారు.

25. 'నాయకురాలు' పేజి. 63.

26. స్వరస్వతీ ముద్రాక్షరశాల గుంటూరు. ఆంధ్రపత్రికాఫీస్ వారు ప్రకటించారని J సుహాసినీ ప్యాండె "మాలపల్లి - సామాజికస్పృహ"లో పేర్కొ-

వ్నారు. ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఎం ఫిల్ పట్టాకోసం 1979లో నాగార్జున యూనివర్శిటి గుంటూరుకు ఆమె సమర్పించింది.

27. సరస్వతిప్రెస్ - గుంటూరు. 1933

28. 'వాస్తవంగా అతడు కథాకథన చక్రవర్తి' అని దాశరధి రంగాచార్య గారి ప్రశంస. 'ప్రేమ్‌చంద్ జీవితం - సాహిత్యం' పేజి. 58. యువభారతి ప్రచురణ, సాహితీ సంస్కృతిక సంస్థ, సికిందాబాద్. 1981.

29. 'ప్రేమ్‌చంద్ జీవితం' పేజి. 55. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్. విజయవాడ 1980.

30. 'కలం పట్టిన యోధుడు ప్రేమ్‌చంద్' సంబారి పేజి 19 'అరుణ తార' సెప్టెంబరు & నవంబర్ 1979

31. "నాజీ వ్యతిరేక సమావేశం రోమారోలా లాంటి రచయితలందరు పారిస్‌లో ఏర్పాటు చేస్తే, విదేశాల్లో వున్న సజ్జద్ జహీర్, ముల్కరాజు ఆనంద్‌లు దానికి హాజరై, ప్రభావితులై మన దేశంలో అభ్యుదయ రచయితల సంఘం పెట్టారు" 'అరుణతార' సెప్టెంబర్ & నవంబర్ 1979. పేజి 65.

32. 'ప్రేమ్‌చంద్ జీవితం - సాహిత్యం' లో దాశరధి రంగాచార్యగారు క్రోడీకరించిన వాక్యాలు, పేజి. 22.

33. 'ప్రేమ్‌చంద్ జీవితం - సాహిత్యం' పేజి. 23

34. "మైం కలంకా మజ్దూర్ హూ" అని ప్రేమ్‌చంద్ ప్రకటించుకున్నాడు.

# 2. మాలపల్లి - గోదాన్ నవలల నేపథ్య పరిస్థితులు

## 1. మాలపల్లి

### i) ఉద్యమ చైతన్యం

1920—21 నాటికి దేశ సామాజిక, రాజకీయ చైతన్యానికి ఉన్నవ చెక్కిన ప్రతిమ 'మాలపల్లి'. సమకాలీన చరిత్ర సమగ్ర రూపాన్ని మలచటానికి అనువైన సాహితీ ప్రక్రియగా నవలను ఎన్నుకొన్నాడు. ఈ 'మాలపల్లి' నవల రచన వెనుక ప్రరోచకంగా వీరేశలింగంగారి సంఘ సంస్కరణ, గాంధీజీ హరి జనోద్ధరణ కార్యక్రమాలు, భారత జాతీయ విముక్తి పోరాట తీవ్రవాద నాయకత్వ ప్రభావం, రష్యావిప్లవ విజయోత్సాహం, తెలుగుదేశంలోని రంపపితూరీ[1], గాంధీ గారి జాతీయోద్యమ తాత్త్విక దృక్పథంలో వచ్చిన పరిణామం — ఇవన్నీ ఉన్నాయి.

దేశమంతటా జాతీయ చైతన్యం వెల్లువికిన కాలమది. పంజాబ్‌లో రౌలట్ చట్టం అమలులోకి వచ్చింది. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ అప్పుడప్పుడే జరిగింది. బ్రిటిషు వ్యతిరేకత పైవర్గాల్లోనే అయినా దావానలంలా వ్యాపిస్తున్నది. జాతీయతాభావం గ్రామసీమల్లోకి సామాన్య జనంలోకి నెమ్మదిగా ప్రవేశిస్తున్నది. భారతీయులు తమలో వైరితలలు వేస్తున్న కులతత్వం వల్ల బానిస జాతిగా మారి పోవడాన్ని సహించలేక పోయాడు గాంధీజీ. అస్పృశ్యతా నివారణకవసరమైన సంస్కరణ చర్యలు తీసుకొని పనిచేయ నారంభించాడు. జాతి భవిష్యత్తుకు పునాది

రాళ్ళ వంశ్ప పీడిత జనుల ప్రగతి దేశప్రగతిగా భావించాడు ఉన్నవ. అందువల్ల వారికి సాంఘిక సమానత్వం కలిగించాలనే ధ్యేయంతో నవలా రచనకు పూను కున్నాడు ఉన్నవ.

భారతభూమి నలుమూలల స్వాతంత్ర్యకాంక్ష చెలరేగిన రోజులవి. బ్రిటిషు ప్రభుత్వాన్ని తోసి వేయాలని మాతృదేశం దాస్య శృంఖలాల నుంచి విడి వడా లని ప్రజాబాహుళ్యం ఉవ్విళ్ళూరుతున్నారు. ఆత్మోన్నతికి జాతీయ వారసత్వం దోహదకారి అవుతుందనే జిజ్ఞాసను బలపర్చడానికి ఆర్యసమాజం, దివ్యసమాజం వంటి ఉద్యమాలు ప్రేరకాలయినవి. అనిబిసెంట్ నిర్వహిస్తున్న 'హోమ్‌రూల్' ఉద్యమం గ్రామగ్రామాన ప్రాకుతుంది. 1917లో రష్యాలో ఫలసిద్ధి పొందిన సోషలిస్టు విప్లవం పరాధీన దేశాల రాజకీయ చైతన్యాన్ని ప్రజ్వలింప జేసింది. మన ప్రపంచ స్వరూపాన్ని మార్చివేసే సమూల సామాజిక పరివర్తనలకు పునాది వేసే ఆలోచనలకు దారి తీసింది. అక్టోబర్ విప్లవానికి బ్రిటిషు ప్రతిఘటన కూడా మన జాతీయ నాయకుల్ని ఆ విప్లవ భావాలవైపు ఆకర్షించడానికి బల మైన కారణం. 1920 నాటికే దక్షిణ భారతదేశంలో, ఆంధ్రలో బోల్షివిక్ భావాలు చొరబడ్డాయి. సింగార్ వేలుచెట్టియార్ కాంగ్రెసు ఉద్యమంలో సోషలిస్టు భావా లను ప్రవేశపెట్టారు. 1918 ప్రాంతంలో మద్రాసు కార్మికుల్లో లేచిన ఆందోళన పరోక్షంగా బోల్షివిక్ విప్లవ ప్రభావమే.

1916 ఏప్రిల్‌లో ఐర్లాండు దేశంలో ఈస్టర్ తిరుగుబాటు జరిగింది.[2] ఆ రోజుల్లో 'సిన్‌ఫెన్' ఉద్యమం స్వాతంత్ర్య సంగ్రామంగా మారింది. ఈ ఉద్యమం గ్రామగ్రామాన ప్రాకింది. జిల్లాస్థాయి నుంచి గ్రామస్థాయి వరకున్న సంస్థలన్నీ 'సిన్‌ఫెన్' ఉద్యమనాయకుల వశంఅయినాయి రాజకీయాభినివేశం ఉన్న మన జాతీయ నాయకుల్లో ఆ ఉద్యమ ప్రభావం చొరబడింది.

తిలక్ తర్వాత గాంధీజీ 1920 ప్రాంతంలో భారత జాతీయోద్యమంలో ముఖ్యపాత్ర వహించాడు. ఆ సంవత్సరమే సహాయ నిరాకరణోద్యమాన్ని రాజకీయ చైతన్య స్ఫూర్తినీ, స్వాతంత్ర్య భావ దీప్తినీ ప్రసాదించగా దాన్ని ప్రజ్వలింపచేసి స్వాతంత్ర్యోద్యమంగా రూపురేఖలు దిద్దిన వాడు, గాంధీజీ బ్రిటిషు ప్రభుత్వం 'రౌలట్ బిల్లు' ను 1919 మార్చి 18న ఆమోదించటంవల్ల

భారతీయులందరూ సాత్విక నిరోధక చర్యకు సిద్ధం కావాలని కోరాడు.[3] మొదటి ప్రపంచయుద్ధ ఫలితంగా టర్కీసామ్రాజ్యపు విచ్ఛిన్నానికి ఖలీఫా పరాభవానికి కారణం బ్రిటిష ప్రభుత్వం. అందుకు ముస్లింలు పగబట్టి ప్రభుత్వానికి వ్యతిరేకంగా 'ఖిలాఫత్' ఉద్యమాన్ని నడిపారు.[4] ముస్లిం సోదరులకు జరిగిన అన్యాయానికి తన సానుభూతిని తెలియచేశాడు. గాంధీజీ 1919 నవంబర్ 23 తేదీన జరిగిన ఖిలాఫత్ మహాసభకు గాంధీజీ అధ్యక్షత వహించాడు. ఇదే అదనుగా ముస్లింల ఆందోళనను, పంజాబ్ (జలియన్‌వాలాబాగ్) దురంతాలను జోడించి 'సాత్విక నిరోధ ఉద్యమాన్ని' లేవదీయాలనుకున్నాడు. దేశమంతటా పర్యటించి సాత్విక సహాయనిరాకరణ ద్వారా ప్రజలను ప్రభుత్వానికి తమనిరసనను తెలియజేయమని కోరాడు ఈ కార్యక్రమానికి యింకొక అంశం పన్నుల నిరాకరణ కూడా చేర్చాడు. ఈ ఉద్యమంలో ప్రజలు పాల్గొని ప్రభుత్వానికి తమ సత్తాను చూపించారు. 1920లో బెంగాల్ మిడ్నాపూర్‌లో పన్నుల నిరాకరణ, ఆంధ్రలో చీరాల, పల్నాడు, పెదనందిపాడుల్లో శాసనోల్లంఘన తీవ్రంగా సాగింది. మలబార్‌లో మాప్లా రైతుల తిరుగుబాటు జరిగింది.

బ్రిటిష ప్రభుత్వం అతివాద ఉద్యమాలను అణచడానికి రౌలట్ చట్టాన్ని తెచ్చింది. అప్పుడప్పుడే పెరిగి పెద్దదవుతున్న భారత కార్మికోద్యమంఆ చట్టాన్ని గుర్తించి వెంటనే సార్వత్రికసమ్మెచేసి వ్యతిరేకతను ప్రకటించింది. భారతదేశంలో ఆరుమాసాల్లో ఎన్నడూ జరగనంత పెద్దఎత్తున 200 సమ్మెలు జరిగాయి.[5] దేశమంతటా కార్మికోద్యమాలు, రైతుల ఉద్యమాలు ఉవ్వెత్తున విజృంభించాయి. బెంగాల్ నాగపూర్ రైల్వేసమ్మె, మిడ్నాపూర్‌లో రైతులసమ్మె కార్మికోద్యమానికి ఊపునిచ్చాయి.

1921 బీహార్‌లో రాణాభగత్ తిరుగుబాట్లుజరిగాయి. 1922 మేలో ఉత్తర ప్రదేశ్‌లోని చౌరాచౌరాలో కోపోద్రిక్తులైన ప్రజలు పోలీసుస్టేషన్‌పై దాడిచేసి దాన్ని తగుల బెట్టారు. అందులో 21 మంది పోలీసులు సజీవసమాధి అయ్యారు. బ్రిటిష ప్రభుత్వ చర్యలకు ఉద్రేకం పొందిన ప్రజలు హింసను హింసతో ఎదుర్కొనేందుకు దిగారు. కాన్పూరు,వజీరాబాద్, లాహోర్‌లలో ప్రజలు వీరావేశంతో తెల్లవారిని పట్టి చావబాదారు. ఇలా జరిగే సంఘటనలను చూచి బ్రిటిషవారు "గాంధీయే భారతదేశంలో అగ్గిపుల్ల వెలిగించాడు" అని ప్రకటించారు. ఈ

దుష్ప్రచారం చూచి గాంధీజీ "నేనొక అగ్గిపుల్ల వెలిగించానంటే నిజానికి పాలకుని 'రౌలట్‌చట్టం' అంటూ మా దేశమంతటా అగ్గిపుల్లలు వెదజల్లి ఉంచారు." అని సమాధానంగా ప్రకటనచేశాడు. తర్వాత ప్రజల ఉద్యమాన్ని ఆపివేస్తున్నట్లు ఆయన ప్రకటించాడు.[6] సుభాషు, మౌలానా, మోతీలాల్, లజపతిరాయ్‌లు గాంధీజీ నిర్ణయాన్ని తీవ్రంగా విమర్శించారు. సంవత్సరంలోనే (1923 జనవరి 1న) కాంగ్రెసుచీలి 'స్వరాజ్యపార్టీ' అవతరించింది. ఆంధ్రలోకూడా దీనిప్రభావం బాగా పడింది. స్వరాజ్యపార్టీ అధ్యక్షుడు చిత్తరంజన్‌దాస్‌కు యాధృచ్ఛికంగా ఉన్నవ అనుచరుడు అయినాడు.

## ii ఆంధ్రలో ప్రతిధ్వనులు

జలియన్‌వాలాబాగ్ దురంతం జరిగిన తర్వాత గాంధీజీ ఆంధ్రలో పర్యటించి సహాయనిరాకరణోద్యమానికి ప్రజలను ఆయత్తం చేస్తున్నాడు. సత్యాగ్రహులను తయారుచేసి ఉద్యమాన్ని ప్రారంభించాలనిగాంధీజీకోరాడు.[7] గాంధీజీ చెప్పినట్టు నడుచుకొంటే ఒక్కఏడాదిలో స్వరాజ్యం సిద్ధిస్తుందని ప్రజలు విశ్వసించారు. ఈ విధంగా భారత స్వాతంత్ర్య సమరం ఎవరూ ఊహించనిరీతిలో మలుపుతిరిగింది.

దేశస్వాతంత్ర్యానికై జాతీయవాదులంతా దేశవిముక్తికోసం రక్తతర్పణం చేస్తున్న సమయంలో జస్టిస్‌పార్టీ వారు స్వార్థచింతనతో బ్రిటిషు వాళ్ళ మద్దతుదారులుగా మారిపోయారు. జాతీయోద్యమాన్ని బలహీనపరిచేందుకు అనేక ప్రయత్నాలుచేశారు. ఉమ్మడి రాష్ట్రంగా ఉన్నప్పుడు మద్రాసు ప్రెసిడెన్సీకి జస్టిస్ పార్టీ అధికారంలోకి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమ నాయకులు ఏర్పాటుచేసిన సభలకు ప్రజలు హాజరు కాకుండా ప్రభుత్వయంత్రాంగాన్ని దుర్వినియోగం చేశారు. కాంగ్రెసు సహాయనిరాకరణోద్యమాన్ని ఖండిస్తూ జస్టిస్ పార్టీవారు తీర్మానాలుచేశారు.

ముఖ్యమైన ప్రభుత్వ అధికారాలను గవర్నరు జనరలు తాబేదారులైన బ్రిటిషు పాలక వర్గం చేతుల్లో ఉంచుకొని చిల్లర అధికారాలను రాష్ట్రమంత్రులకు ఇచ్చారు. సామ్రాజ్యవాదులైన జస్టిస్ పార్టీవారు ఈ రకంగా ద్వంద్వ ప్రభుత్వ

విధానాన్ని 1920లో స్థాపించారు. 1921లో సాగిన సహాయనిరాకరణోద్యమాన్ని అణచివేయడానికి జస్టిస్‌పార్టీవారు కఠినమైన శాసనాలుచేసి బ్రిటిషుప్రభుత్వానికి తోడ్పడ్డారు. జాతీయోద్యమాన్ని బలహీన పర్చడానికి సర్వవిధాలా ప్రభుత్వానికి సహాయపడ్డారు. జస్టిస్‌పార్టీ సభ్యులు రావుబహద్దూరు కోవెలమూడి గోపాలకృష్ణయ్య కాంగ్రెసును, దాని విధానాలను నిరసిస్తూ సహాయనిరాకరణం ఒక విధమైన పిచ్చి అని అభివర్ణిస్తూ ఆంగ్లంలో *'The Indian Political Craze"* అనే గ్రంథాన్ని రాశాడు. స్వరాజ్యం వద్దు బ్రిటిషు రాజ్యమే ఉండాలనే వాళ్ళున్న ఆ పరిస్థితుల్లో కాంగ్రెసువాదులు స్వరాజ్యంవైపు మొగ్గుచూపడం పక్షపాతం అనిపించుకోదు.

గాంధీజీ పిలుపునందుకొని ఆంధ్రలో [1920] త్రివిధ బహిష్కరణను పాటించారు. కాంగ్రెసువాదులు ప్రప్రథమంగా గుంటూరు బార్ అసోసియేషన్ న్యాయస్థానాలను బహిష్కరించారు. ప్రముఖన్యాయవాదులు తమ వృత్తిని త్యజించి స్వరాజ్య పోరాటంలో దూకారు. విద్యార్థులు పాఠశాలలను బహిష్కరించారు. శాసనసభా బహిష్కరణను తలపెట్టి ఎన్నికలను బహిష్కరించాలని కాంగ్రెసువారు ప్రచారం చేశారు. అనేక బ్యాలట్ పెట్టెలు ఖాళీగా తిరిగివచ్చాయి. జస్టిస్ పార్టీ గెలిచింది. ఈ విధంగా ఆంధ్రులు సహాయ నిరాకరణోద్యమంలో ముందడుగువేసి అమోఘమైన ఫలితాలను చూపించారు. గాంధీజీకి తన దేశ ప్రజలలో విశ్వాసం కుదిరి స్వరాజ్యసంపాదనా ప్రయత్నంలో యింకో అడుగుముందుకు వెళ్ళారు. గాంధీజీ దేశమంతా పర్యటించి ప్రజల ఆర్థిక స్థితిగతులను పరిశీలించాడు. గ్రామాల్లో దారిద్ర్యం తాండవిస్తున్న కారణంగా ప్రభుత్వానికి చెల్లిస్తున్న పన్నులను ఆపవల్సిందిగా కోరాడు. సహాయ నిరాకరణోద్యమానికి ఇంకొక అంశం పన్నుల నిరాకరణకూడా చేరింది. గాంధీజీ అనుమతి ఇవ్వడానికి కొంత ఆలస్యమైనా ఆంధ్రలో ముందుగానే పన్నులనిరాకరణను ప్రారంభించారు. ప్రభుత్వం పన్నులు చెల్లించని వారందరి ఆస్తులను జప్తుచేసి వేలం వేయించింది. చీరాలలో జరుగుతున్న పన్నుల నిరాకరణను ప్రోత్సాహిస్తూ గాంధీజీ కొన్ని సూచనలు చేశాడు.[8] శ్రీ గోపాలకృష్ణయ్య నాయకత్వాన గ్రామస్తులు గ్రామాన్ని వదిలి వెళ్ళారు. అప్పుడే పల్నాటి పుల్లరి ఆందోళన మొదలయింది. పెదనంది పాడులో పన్నుల నిరాకరణ కోసం జరిగిన శాసనోల్లంఘన ఉద్యమం దేశప్రజల

దృష్టిని ఆకర్షించింది. ఆనాటి 'వైస్రాయ్' ఆంధ్రలో ఉద్యమ తీవ్రతను చూచి భయపడి 32% నుంచి 5 ½% వరకు పన్నులను తగ్గించివేసి ప్రకటనచేశాడంటే బ్రిటిష్ ప్రభుత్వం ఎంత హడలిపోయిందో చెప్పనవసరంలేదు.

గాంధీజీ సిద్ధాంతాలతో ప్రభావితమైన దేశప్రజలు సహాయ నిరాకరణోద్యమంలో దూకారు. 1921 లో అల్లూరి సీతారామరాజు కూడా అందరివలె ఈ ఉద్యమంపట్ల ఆకర్షితుడైనాడు. గాంధీజీ అనుసరిస్తున్న అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం స్వాతంత్ర్యం తెస్తుందని నమ్మినవాడుగాదు. సామ్రాజ్యవాదులైన బ్రిటిష్‌వారు దెబ్బకే జడుస్తారని,హింసను హింసతో ఎదుర్కొనవలసిందేనని ఆయుధాన్ని చేపట్టాడు 1921 లోనే అల్లూరి సీతారామరాజు ఏజన్సీ ప్రాంతంలో ఒక స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకుని సాయుధ పోరాటం ద్వారా క్రమక్రమంగా ఒక్కొక్క ప్రాంతం బ్రిటిష్ అధికారం నుంచి విడిపించుకుంటూ పోవాలని పథకాలు వేశాడు. సాయుధ పోరాటానికి కావల్సిన ఆయుధాలు సేకరించాడు. అల్లూరి విజయపరంపర యావత్తు భారతదేశమంతా ప్రాకింది. ఆరు సంవత్సరాలు ఆంగ్లేయులను అతలాకుతలం చేశాడు అల్లూరి సీతారామరాజు.

## iii) సాంఘిక రంగంలో...

సాంఘిక, ఆర్థికాది పరిస్థితులకు రాజకీయ స్వాతంత్ర్యంలోనే అస్తిత్వముందని గుర్తించి తదనుగుణంగా 'మాలపల్లి'ని నిర్మించాడు ఉన్నవ. రాజకీయ పరిస్థితులు పూర్తిగా మారి పాలనాధికారం దేశీయుల చేతిలోకివస్తే తప్ప అన్ని రంగాలలో దేశంఅభివృద్ధి చెందడానికి వీలులేదని భావించి పురుటినొప్పులను త్వరితం చెయ్యటానికి జరిగిన నేపథ్య ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది.

హిందూ సమాజంలో ఉన్న కులమత భేదాలను సాకుగా తీసుకొని బ్రిటిష్ వారు మనలో కలహాలను సృష్టించే సమయంలో భారత జాతిలో ఐక్యత కుదిర్చి ఏకంగా పోరాటం సాగించాలని గాంధీజీ ప్రయత్నించాడు. కులతత్వ నిర్మూలనకు అవసరమైన సంస్కరణ చర్యలను ఆయన చేపట్టాడు. జాతీయ జీవన సంస్కృతిలో విడగొట్టరాని భాగమైనట్టి హరిజనులు హీనంగా చూడబడేవారు. వీరు సంఘం నుంచి వెలివేయబడి, అగ్రవర్ణాలచేత అసహ్యింపుకు గురికాబడటం వల్ల వాళ్ళలో

క్రమంగా అసంతృప్తి ప్రబలింది. బ్రిటిషువారు తమ స్వార్థ ప్రయోజనాల కోసం హరిజనుల్లో ప్రబలిన అసంతృప్తిని ఆసరాచేసుకొని పాలనను సుస్థిరం చేసుకోచూచారు. వారి మిషనరీలు పంచములకు క్రైస్తవ మతంనిచ్చి కలుపుకొని తమకు అనుకూలంగా మార్చుకున్నారు. ఆ కాలంలో దాదాపు 5000 మిషనరీలు దేశంలో వెలిశాయి. దాదాపు నెలకు 1050 మంది హిందువులు క్రైస్తవాన్ని పుచ్చుకొనేట్లు అవి పనిచేశాయి. అయితే హరిజనులు హిందూమతానికి దూరమవ టమేకాకుండా ప్రభుత్వం పట్ల నున్న సానుభూతివల్ల స్వాతంత్ర్యోద్యమానికి దూర మయ్యారు.

ఆంధ్రదేశంలో గాంధీ ఉద్యమానికి ముందే అస్పృశ్యతానివారణ కృషి బాగానే జరిగింది. కందుకూరి రఘుపతి వేంకటరత్నంనాయుడు, పిఠాపురం మహారాజు మున్నగువారు పంచముల విద్యకోసం కృషి చేశారు. ఆంధ్రదేశంలో ఉలపమ త్రివారు అస్పృశ్యులకు పాఠశాలలను పెట్టించారు. 1918 జనవరి 10న తెనాలిలోని పెదపాలెంలో పంచములకు విద్య, చేతిపనులు నేర్పటానికి శ్రీ హను మంతరావుగారు శ్రీ కృష్ణాశ్రమాన్ని స్థాపించారు. హైదరాబాద్‌లో భాగ్యరెడ్డి వర్మగారు ఆది హిందూ సేవాసంఘాన్ని స్థాపించి, దాని పక్షాన ముప్పై పాఠశాల లను నెలకొల్పారు. 1920 నాటికి హరిజనులకు స్థాపించిన పాఠశాలలు దేశంలో 6183 అయినాయి.[9] పంచములకోసం 'దీనబంధు' పత్రిక కూడా నడిచేది.

ఈ రచనాకాలం నాటికి ఆర్థిక వ్యవస్థ భూస్వామ్యం నుంచి ధనస్వామ్య వ్యవస్థకు మారుతూంది. సామాజిక వ్యవస్థలో పెద్ద మార్పును తెచ్చింది ధనం. వ్యవసాయమే ప్రధానంగా ఉన్నా కూడా సామాజిక సంబంధాలలో క్రమంగా వ్యాపార దృష్టి ప్రబలుతూ రావడంవల్ల సామాన్య జనం జీవనంలోని ఆర్థిక స్థితి క్షీణించింది. భూస్వామ్య వ్యవస్థ ధనస్వామ్య వ్యవస్థగా మారుతున్న సంధి యుగంలో తారుమారు అవుతున్న ఆనాటి మానవ సంబంధాలను 'మాలపల్లి'లో స్పష్టంగా పేర్కొన్నాడు ఉన్నవ.

## iV మాలపల్లిలో ప్రతిస్పందనలు

'మాలపల్లి'లో పై పరిస్థితుల ప్రభావాలు ఏదో ఒక మేరకు ఏదో ఒక రూపంలో సష్టాస్పష్టంగా, దృశ్యాదృశ్యంగా కనిపిస్తాయి. ఆనాడు స్వాతం

# (ఆ) గోదాన్

## 1) ఉత్తర భారతంలో ఉద్యమాలు

బ్రిటిషు సామ్రాజ్యాధికారాన్ని కూకటివేళ్ళతో కదిల్చి ప్రభుత్వాన్ని గడగడలాడించిన మహోజ్వల ఘట్టం శాసనోల్లంఘన ఉద్యమం. ప్రతి రాష్ట్రంలో శాసనోల్లంఘనను ప్రారంభించాలని బొంబాయి (1921) కాంగ్రెసు సమావేశం నిర్దేశించింది. ఆ సంవత్సరమే ఆంధ్రలో చీరాల, పెదనందిపాడు, గుజరాత్‌లోని బార్డోలిలో పన్నుల చెల్లింపును నిరాకరిస్తూ ప్రజల తిరుగుబాట్లు జరిగాయి ఉత్తర భారతదేశంలోని ఫిజాబాద్, రాయబరేలి జిల్లాలో రైతు కూలీలు భూస్వాములమీద తిరుగుబాట్లు, మలబార్‌లో మాప్లా రైతుల తిరుగుబాట్లతో భారతదేశం రగులబడి పోతున్న యిల్లులా వుంది. భూస్వామ్యవ్యవస్థలో ఉన్న మంచితనం ధనస్వామ్యం ఏవిధంగా అపహరిస్తుందో రాయబరేలి మున్నగు రైతుల తిరుగుబాట్లు చెపు తున్నాయి. అక్టోబర్ (రష్యా) విప్లవం ప్రభావంచేతనే భూస్వాముల దోపిడి విధానం గురించిన వివేకం ప్రజల్లో ఎక్కువ కావటం, భౌతిక పరిస్థితులు వాళ్ళకు అనుకూలం కావటం, దుష్ట ప్రభుత్వం చర్యలవల్ల విసిగిపోవటం ఎక్కువైంది. భూస్వాములు చేస్తున్న శ్రమ దోపిడిని తెలుసుకొన్న రైతు కూలీలు జమీందార్ల దగాకోరుతనాన్ని గ్రహించి తిరుగబడ్డారు. మొదటిసారిగా 1921లో ఉత్తర భారతదేశంలో ఫిజాబాద్, రాయబరేలి జిల్లాల్లో రైతుకూలీలు భూస్వాములమీద తీవ్రమైన తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాట్లకు నాయకత్వం వహించిన వాళ్ళు శ్రమశక్తులను మోసాలకు అమ్ముకొన్నవాళ్ళు, అగ్రవర్ణాల వారు సంఘం నుంచి వెలివేసినవాళ్ళు, అన్యాయాన్ని ఎదుర్కొనటానికి శ్రామిక జనంనుంచే ఆ తిరుగు బాటు బయలుదేరింది. 1926 ప్రాంతంలో పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లోని కొన్ని ప్రదేశాలలో రైతాంగ పోరాటాలు భీకరరూపం ధరించాయి. భూస్వాములు బ్రిటిషు ప్రభుత్వమూ కలిసికట్టుగా అణచివేయ ప్రయత్నించాయి. రాజకీయ సమైక్యతా దృష్ట్యా వర్గసామరస్యాన్ని కోరుతూ కాంగ్రెసు మితవాదులు భూస్వాముల్ని రైతుల్ని కూడగట్ట చూచారు. కాని ఆ పోరాటాలు కాంగ్రెసు నాయకుల అదుపును సైతం దాటిపోయాయి. విముక్తి కేవలం విదేశీ పాలననుంచేగాదు, స్వదేశీ శక్తుల నుంచీకూడా విముక్తి పొందాల్సిన పరిస్థితి. అది పై వర్గం నుంచి క్రింది వర్గం వరకు, బ్రిటిషు ప్రభుత్వంనుంచి దేశాన్ని విముక్తి చేయటమే

తమ లక్ష్యంగా భావించి పోరుసల్పారు. ఈ సంఘటనలు ప్రేమ్‌చంద్ హృదయా నికి హత్తుకొని దాదాపు పది సంవత్సరాల తర్వాత "గోదాన్"లో ప్రత్యక్షమైనాయి. ఈ వస్తువు స్వీకరించటం వల్ల అనైక్యంగా ఉన్న ఆ కాలపు బుద్ధి జీవులకు కళ్ళ ముందు విశాలమైన వాకిళ్ళు తెరిచాడు ప్రేమ్‌చంద్.

అది ఉప్పు సత్యాగ్రహం రెండో ఘట్టం కాలం. 1932 జనవరిలో కాంగ్రెసు శాసనోల్లంఘన ఘట్టం తిరిగి ప్రారంభించింది. ఈ ఉద్యమానికి ఊతగా ప్రభుత్వ వ్యతిరేక రచనలు సాగిస్తున్న పత్రికలను, రచయితలను కట్టడిలో పెట్టాలని ప్రభుత్వం తీర్మాణించుకొంది. ఆనాడు ప్రేమ్‌చంద్ నడుపుతున్న "హంస-జాగరణ్"ల పత్రికలకు హెచ్చరికలు చేసింది ప్రభుత్వం. వ్యతిరేక ప్రచారాలకు పూనుకోకుండా చేసేందుకు పత్రికల వారినుంచి హామీ డబ్బును కట్టించుకొంది ప్రభుత్వం. అయినా ప్రేమ్‌చంద్ తన పత్రికలో స్వాతంత్ర్యంగూర్చి, రైతుల గూర్చి రాస్తూనే ఉన్నాడు. 1932లో ఇర్విన్ ప్రభువు పోయి విల్లింగ్డన్ వైస్రాయి అయినాడు. ఇర్విన్ తో కాంగ్రెసు చేసుకొన్న ఒప్పందాన్ని ఈ క్రొత్త వైస్రాయి త్రోసిపుచ్చి రైతులపై, కాంగ్రెసు వాదులపై కఠినచర్యలను తీసుకోవటం మొదలుపెట్టాడు. దేశగౌరవాన్ని కాపాడేందుకు జాతీయ నాయకులు ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. తిరుగబడినట్టి నాయకులను ప్రభుత్వం బంధించినా ప్రజలే ఉద్యమాన్ని నడిపారు. ఈ సమయంలో ప్రభుత్వం అస్పృశ్యులకు వెనుకబడిన వర్గాలవారికి ప్రత్యేక నియోజకవర్గాలుంటాయని తీర్పునిచ్చింది. హిందువుల్లో విభజన కల్పించటానికే ప్రభుత్వం ఈ ఏర్పాటును సృష్టించిందని ప్రతిఘటించేందుకు గాంధీజీ నిరాహారదీక్షకు పూనుకున్నాడు. ఈ సమయంలో గాంధీజీ హరిజన సమస్య గురించే ఆలోచన చెయ్యటంతో సత్యాగ్రహోద్యమానికి ప్రాముఖ్యత తగ్గింది. అంతకుముందు గాంధీజీ దేశమంతా పర్యటించి అస్పృశ్యతా నివారణకే ఎక్కువ ప్రాధాన్యతను యిచ్చారు. ఆ దశలోనే సత్యాగ్రహోద్యమం నిలిపి వేయబడింది.

సత్యాగ్రహోద్యమం నిలుపుచేసిన తర్వాత కాంగ్రెసు నాయకుల దృష్టి శాసనసభల మీదికి మళ్ళింది. కాంగ్రెసు ఎన్నికల ప్రచారానికి పూనుకుంది. కాంగ్రెసువారి ఉద్దేశం ప్రభుత్వానికి సహకరించాలని కాదు. రానున్న శాసన సభలో ప్రవేశించి పౌరహక్కులను, భూసంస్కరణలను, రైతుల, కార్మికుల

హరిజనుల సంక్షేమానికి చేయవల్సిన వాటిని చట్టబద్ధం చేయాలని. 1935 లో భారతీయులను తృప్తిపరచటానికే ప్రభుత్వం భారత రాజ్యాంగ చట్టాన్ని ప్రవేశ పెట్టింది.[12] ఈ చట్టం 1937 లో అమలు జరిగిన కారణంగానే కాంగ్రెసు మంత్రులు ఎన్నిక కాగలిగారు. వైస్రాయ్ విల్లింగ్డన్ రైతులను శిస్తుల వసూళ్ళకు గాను కఠినంగా శిక్షించేవాడు. ఆనాడు ఉత్తరప్రదేశ్‌లో ఈ వసూళ్ళపోడు బాగా వుంది. వారు ఆనాటి రైతులనుంచి శిస్తును, జరిమానాను వసూలు చేసి పీడించేవారు. రైతులు అనైక్యంగా ఉన్న కారణాన జమీందారీ వ్యవస్థను కూల్చలేకపోయారు. కాని రైతులు పోరాటాలు చేస్తూ వచ్చారు. రాజకీయ సమైక్యత దృష్ట్యా కాంగ్రెసు వారు రైతాంగ పోరాటాలమీద కన్నెర్ర చేసి, చన్నీళ్ళుపోసి భూస్వాముల్ని రైతుల్ని కూడగట్టచూచారు.[13] పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో చెలరేగిన రైతాంగ పోరాటాలు కాంగ్రెసు యువనాయకుడు జవహర్‌లాల్ నెహ్రూ వెళ్ళినా అదుపు లోకి రాలేదు. ఒక్క స్వాతంత్ర్యాన్ని గురించే కాకుండా రైతులను గురించి కూడా ఆలోచించవల్సిన అవసరం ఉంది ఆనాడు. బ్రిటిషు వారి దోపిడి ఫలితంగా శిథిలమైపోయిన జీవితాలు రైతులనుగురించిన సమస్యలను తన "హంస-జాగరణ్" పత్రికల్లో ప్రేమ్‌చంద్ విపులంగా రాసేవాడు. 1933 జూన్ 28 నాటి హంస సంచికలో ప్రేమ్‌చంద్ సంపాదకీయం భారతదేశంలోని రైతుల స్థితిగతులను పరిశీలించి విశ్లేషించాలని కోరింది. జమీందార్లు, మిల్లుయజమానులు, వడ్డీ వ్యాపారస్తులు రైతుల దయనీయ స్థితికి కారకులు. ఆ నాడు వడ్డీ వ్యాపారస్తులు గ్రామాల్లోని రైతులకు అప్పులిచ్చి పీకిస్తే, జమీందార్లు ప్రభుత్వం వారికి భక్తులై దేశీయులైన రైతులను పట్టి పీడించేవారు. అట్లాంటి పీడకులు తర్వాతి కాలంలో శాసన కర్తలయినారు. ఆ పరిస్థితుల్లో వ్యావసాయిక సమాజ జీవిత ప్రభావాన్ని తన చైతన్యంలో బలంగా నింపుకొని "గోదాన్" రాశాడు ప్రేమ్‌చంద్.

ఆ రోజుల్లో విదేశాల్లో జరుగుతూ వచ్చిన పరిణామాలను కూడా గుర్తించాడు ప్రేమ్‌చంద్. అందుకు నిదర్శనం ఆయన హంస పత్రికలో (1933 జూన్ 28) "మన పొరుగు దేశమైన చైనా లో ఒక రాజకీయ నాయకుడు 'హూనాకా' రాష్ట్రం రైతుల స్థితి గతుల గురించి.... విశ్లేషాత్మకమైన పరిశీలన పూర్తి చేశాడు" అని రాశాడు. రష్యాలో రాజ్యమేలుతున్న బోల్షివిజం చైనాలో వ్యాప్తి చెందుతుందని హంస (మే 1933)లో రాశాడు. చైనా ప్రజలు మానసిక

దాస్యం నుంచి విముక్తి పొందుతున్నారని మాధురి పత్రిక (సెప్టెంబర్ 1935) లోని 'బితన్' కథలో రాశాడు.[14] 1934-36 కాలంలో గాంధేయుడై హృదయ పరివర్తన సిద్ధాంతాన్ని అవలంభించిన ప్రేమ్‌చంద్ హఠాత్తుగా మార్క్సిజం వైపు పోయి బోల్షివిజం వైపు మలుపుతిరిగాడు. బోల్షివిక్ విప్లవం ప్రభావం దేశీయుల మీద ఎలాంటి ముద్రవేసిందంటే పీడిత రైతుల, కూలీల, కార్మికుల, దళిత వర్గాలను ఎలా ఉద్ధరించాలనే తపన వారిలో బయలుదేరింది. ప్రేమ్‌చంద్ నిరుపేద రైతాంగం స్థితిగతులలో మమేకమైన కారణంగా వారి విముక్తికై పాటుపడ్డాడు. వ్యావసాయిక విప్లవానికి రైతాంగమే ప్రధాన శక్తి గాక తప్పదని ఆలోచించి ఈ 'గోదాన్' రాశాడు. ఆయన 1932 జూన్‌లో బనారసీదాస్ చతుర్వేదికి రాసిన ఉత్తరంలో "రైతాంగసమాజ కథా కారుడ"నని స్పష్టపరిచాడు.

'గోదాన్' నవల మాత్రమేగాదు. అది ఒక డాక్యుమెంటరీ కూడా. నవల రచనా కాలానికి సంబంధించిన ఉత్తర భారతదేశం డాక్యుమెంటరీగా దాన్ని చెప్పొచ్చు. పరాయి ప్రభుత్వంలోని జమీందారీ వ్యవస్థ, పంచాయితీ వ్యవస్థల పాలనల నడిమి రైతుల కడగండ్లు పేర్కొన బడ్డాయి. ఇంకా సాంఘిక వ్యవస్థ లోని కట్టుబాట్లు, కులాల నడుమ సంఘర్షణలు, కులాంతర, వర్ణాంతర, ప్రేమ వివాహాల సంఘటనలు, కార్మికుల ప్రతిఘటనలు చాలా వివరంగా చిత్రించబడ్డాయి. రచయిత తన జీవిత కాలంలో ప్రత్యక్షంగా చూసిన పరిస్థితులను, సామాన్య జీవితాలను వాస్తవికంగా చిత్రించాడు. ఇది నిస్సందేహంగా హిందీ నవలా చరిత్రలో సరికొత్త మైలురాయి. భారతీయులంతా గర్వించ దగ్గ నవలా రాజము.

## ii) సాంఘిక రంగంలో...

సాంఘికావసరాలైన వివిధ వృత్తుల ఆధారంగా ఏర్పడిన కులాలు రాను రాను కరడుగట్టుకుపోయాయి. శ్రమ విభజన ఆధారంగా సమరస భావంతో పుట్టిన కులం సాంఘికంగా బలం పెంచుకొంది. ఉత్తర భారతదేశంలో కూడా కులవ్యవస్థ పటిష్టంగా ఉంది. అగ్రవర్ణాల వారు కడజాతి వారిని అమానుషంగానే చూచే వారు. కాని శూద్రులు మాత్రం పంచమ జాతిని అంత నీచంగా చూడనట్లు తెలుస్తుంది. అయితే శూద్రులలో ఒక కులంతో యింకో కులం వారికి వైవాహిక సంబంధాలు సవ్యంగా లేవు.

ఆనాడు అంటరానితనంతో పాటు వితంతు వివాహం కూడా ఘోర పాపంగా పరిగణించేవారు. బహు భార్యత్వం కూడా కనబడుతుంది. ఇంకా చాతుర్వర్ణ వ్యవస్థ చట్టం పదిలంగా ఉండటం వల్ల మూఢాచారాలు ఘోరంగా ఆచరింపబడ్డాయి. ఆనాటి సంఘం కట్టుబాట్లతో బంధించబడి సంకుచితమైన భావాలకు ఆశ్రయమైంది. గ్రామ పెత్తందార్లు పంచాయితీ సభ్యులు. వారి వాక్కే వేదవాక్కు. సర్వాధికారాలు హస్తగతమై ఉండటం మూలాన వారి ఆగడాలకు అంతంటూ లేకుండా పోయింది. మానవతావాదం పంచాయితీ సభ్యులకు కొత్త సిద్ధాంతంగా తోచేది. ఆనాడు డబ్బున్న ప్రతివాడు వడ్డీ వ్యాపారస్తుడే. ఐతే గ్రామాధికారుల వడ్డీవ్యాపారం, పీడన పద్ధతి ప్రత్యేకంగా పేర్కొనాలి. రైతులకు అప్పులిచ్చి వడ్డీని, వడ్డీకి వడ్డీ వసూలు చేసుకుంటూ బాకి పడిన వారి చేత బానిస చేత చేయించుకొనే వారు. నాట్లు—ఊర్పుల కాలంలో కూడా గ్రామాధికారుల పనులే ముందు చేసిపెట్టాలి ఆ రైతులు. ఆ పనులు అన్నీ సవ్యంగా జరగని నాడు రైతులు ఎదుర్కొనే బాధలు వర్ణనాతీతం. ఇంత అణగిమణగి ఉన్నా కూడా పరుల రక్తం పీల్చే పంచాయితీదార్లు ఏదో వంకతో లంచాలు రాబట్టుకొనే వారు. కొన్ని సందర్భాలలో కట్టుబాట్ల పేర 'తప్పు' వేసి రైతుల రక్తం మరీ పీల్చేవారు. ఈ గ్రామాధికారులకు పోలీసుల అండదండలే కాకుండా ఆ ప్రాంతం జమీందారు బలం పూర్తిగా ఉండేది. గ్రామాల్లో ఏదైనా గల్లంతు జరిగిందని జమీందారుకు తెలిస్తే ఆ గ్రామాధికారిని కొలువుకు పిలిపించి గ్రామస్తుని వద్ద జరిమానా రూపకంగా గ్రామాధికారి వసూలు చేసిన సొమ్మును రాబట్టుకొనేవాడు. కాని గ్రామస్తుల క్షేమాన్ని మాత్రం జమీందారు కోరేవాడు గాదు. అనావృష్టి కాలంలో కూడా భూమి పన్ను వసూలుకు రైతులను హింసించే వాడు జమీందారు.

అగ్రవర్ణాల కుటుంబాలలో తప్ప దిగువ వర్ణాలలో, పంచములలో చదువు సంధ్యలు బాగా కనిపించవు. ముఖ్యంగా గ్రామాల్లో నిరక్షరాస్యత తాండవిస్తున్న కారణంగా అలగా జనం చైతన్యం కోల్పోయింది. దోపిడికి గురి అవుతున్న వారు దోపిడిదారులను నేరస్తులనే వారు గాదు. లోకానుభవసారంగా వారి బ్రతుకు తెల్లారేవి. వతనయినా బానిస తనమైనా కూడా వంశ పారం పర్యంగా వస్తూన్నట్లు తోస్తుంది.

## iii) గోదాన్‌లో ప్రతిస్పందనలు

గోదాన్ నవలలో పై పరిస్థితుల ప్రభావం ఏదో ఒక రూపంలో కనిపిస్తాయి. కొన్ని ప్రభావాలు ప్రత్యక్షంగా కనిపిస్తాయి. అవి గాంధీజీ హరిజనోద్ధరణ. కార్మికుల తిరుగుబాట్లు. 'గోదాన్' లో స్వాతంత్ర్య పోరాట ఉద్యమాలు మనకు స్పష్టంగా కనిపించవు. దానికి ముఖ్య కారణం ఆనాడు దేశమంతటా ఏర్పడిన స్తబ్దత అని చెప్పొచ్చు. ఈ కారణంగా ప్రేమ్‌చంద్‌కు కూడా ఉద్యమాల మీద నిరాశ కలిగింది. గోదాన్ చదువుతున్న పాఠకులకు ఏదో పాత్ర తిరుగుబాటు చేస్తుందనిపిస్తుంది. కాని అందున్న పాత్రల్లో ఏదీ పూర్తిగా తిరుగ బడదు. ఆనాడు వచ్చిన ఉద్యమాలు సకృత్తుగా వచ్చి చల్ల బడ్డాయి. ప్రేమ్‌చంద్ సన్న కారు రైతాంగానికి చెందిన గోవర్‌ను నగర ప్రవేశం చేయించి మిల్లు తాలూకు అక్రమాలకు అనర్థాలకు అతన్ని విముఖున్ని చేయించి యింటి మొగం పట్టిస్తాడు. ఈ చిత్రణం అప్పటికి యింకా నగర కార్మిక వర్గం కూడా సుసంఘటితమైన శక్తిగా రూపొంద లేదనే విషయాన్ని చెపుతుంది. ఇంకో విషయం సన్నకారు రైతాంగం ఉనికి మనికి కదిలి పోయి కూలీనాలి జనంలో వచ్చి చేరటం కూడా చారిత్రక వాస్తవం. స్రేహూ సోషలిజం, రష్యాబోల్షివిజం నమ్మినందునే ప్రేమ్ చంద్ 'గోదాన్' లో నగరాలు, కార్మికులు, సమ్మె పోరాటాలు ఆక్రమించాయి. ఆనాడు ఉత్తర ప్రదేశ్‌లో జమీందార్ల ప్రభావంతోపాటు పరిశ్రమల యజమానుల ప్రభావం హెచ్చు స్థాయిలో ఉంది. రష్యా చక్రవర్తి పోలికలో పరిశ్రమాధికారి ఖన్నా పాత్రను సృజించి, ఉద్రిక్తులైన కార్మికులచే చెక్కెర మిల్లును తగుల బెట్టించటం పరిశీలిస్తే కార్మిక వర్గ నియంతృత్వ ఆవశ్యకతను ప్రేమ్‌చంద్ బాగా గుర్తించాడని చెప్పవచ్చును.

జమీందారైన రాయ్‌సాబ్ అగర్‌వాల్‌సింగ్ స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంటాడు. కౌన్సిల్ సభ్యత్వం వదలు కుంటాడు. జైలుకు కూడా వెళ్తాడు. పేరు ప్రఖ్యాతులు ఆర్జించాలనే ఆ విధంగా నటన చేస్తాడు. నిజంగా ఆయన చేసింది రైతుల రక్తం పీల్చటమే. ఆనాడు దేశభక్తి ముసుగులో దౌర్జన్యం ఎలా చలాయించే వారో రాయ్‌సాబ్ పాత్ర తెలుపుతుంది. అంతే కాదు. దేశ భక్తుల విషయంలో శిథిలం అవుతున్న ప్రేమ్‌చంద్ విశ్వాసాలకు ఈపాత్ర మచ్చుతునక,

ఆనాడు జమీందారులు స్వరాజ్యం కావాలని ప్రాకులాడింది వాళ్ళ జమీందారీని నిలుపుకొనేందుకు మాత్రమే

ఆనాటి సాంఘిక జీవనంలో గ్రామ వ్యవస్థమీద విశ్వాసం ప్రేమ్‌చంద్‌కు ఉండేది కాదు. మొదట అచంచలమైన విశ్వాసం ఉండి 'పంచ్‌పరమేశ్వర్' రాశాడు. రానురాను పంచుల దౌర్జన్యం సహించలేక ఈ రచనా కాలంలో 'యహ్ పంచ్ నహీఁ పిశాచ్ హై' అనే భావనకు వస్తాడు ప్రేమ్‌చంద్.[15] 'గోదాన్'లో ధన్య నోట ఆ మాట అనిపించటానికి ఆయన ఎంత వేదన పడ్డాడో చెప్పటం కష్టం.

వైవాహిక వ్యవస్థలో కన్యాశుల్కం ఆచారంగా కనబడుతుంది. గోదాన్ లోని ప్రధాన పాత్ర (హోరీ) ద్వారా కన్యాశుల్కం గురించిన బాధను వివరిస్తాడు. పెళ్ళీడు వచ్చిన కొడుక్కి పెళ్ళి చేయాల్సివస్తే హోరీ చేతిలో డబ్బు లేనందు వల్లనే పెళ్ళి చేయటం మానుకుంటాడు. ''పెళ్ళంటే మాటలా ? ఎంత లేదన్నా పిల్లకి రెండు మూడు వందలివ్వాలి''అని హోరీ అంటాడు. ఝునియా విషయంలో 'తప్పు కట్టినప్పుడు కూడా ఆ తప్పు (జరిమానా) డబ్బు పెట్టితే గోబర్ పెళ్ళ యేది అని అనుకుంటాడు హోరి. తాను అప్పు తీర్చటానికి కూతురును అమ్ము కుంటాడు. వరకట్నం విషయం ప్రస్తావనకు వచ్చింది. కాని యిచ్చిన దాఖలాలు మాత్రం కనిపించవు.

హిందూ సంఘం వైధవ్యం పొందిన స్త్రీలను హీనంగా చూడటం, పునర్వి వాహం పాపంగా భావించటం ఆరోజుల్లోకద్దు. మన సమాజంలోని స్త్రీల దుస్థితిని చూచి జాలి పడ్డాడు ప్రేమ్‌చంద్. ఆ అభాగ్యులను పైకెత్తటానికి ప్రయత్నించాడు. సంఘం కళ్ళలో 'తప్పు' కారం కొట్టించి ఝునియా (విధవ) ను యింటి కోడలును చేశాడు. ఝునియాను యింట్లో పెట్టుకొన్నందుకు హోరీ మీద పంచాయితీ సభ్యులు జుల్మానా వేస్తే తప్పు చెల్లించాడు. కాని భోలానుంచి వచ్చిన వత్తిడిని భరించ లేక పోతాడు. సంఘం తప్పు వేసినా, ఝునియా తండ్రి కత్తి కట్టినా కూడా హోరీ భయపడక విధవరాలయిన ఝునియానే కోడలుగా చేసుకుంటాడు ధనియా ఆమెను కంటికి రెప్పలా కాపాడుతుంది.

అనాడు సంఘాన్ని పట్టి పీడిస్తున్న ప్రధాన జాడ్యం అస్పృశ్యత. అది ఎంత తీవ్రంగా ఉందో 'గోదాన్'లో సిలియా పాత్ర చెపుతుంది. మాతాదీన్ (బ్రాహ్మణుడు) ఉంచుకొన్న సిలియా (మాలవనిత)ను ఆదుకొన్నందుకు హోరీ మీద సంఘం కక్ష్కెర చేస్తుంది. అయినా సిలియాను మాత్రం ఇంట్లో నుంచి వెళ్ళగొట్టడు. అగ్రవర్ణాలు చేసే స్వార్థ పనులను అరికట్టేందుకు హరిజనులు పూనుకోవటం సాహస వంతంగా కనిపిస్తుంది. ఒక సందర్భంలో సిలియాను హింసిస్తే మాలవాండ్లు వచ్చి మాతాదీన్‌ను చుట్టిముట్టి కులం చెరుస్తారు వారు ధైర్యంగా ముందుకు వచ్చి, "మేము అగ్రవర్ణాలవారి కులంలోకి రాలేము, మిమ్ములనే మా కులంలోకి తీసుకొంటామని" ఆయన్ను కులభ్రష్టున్ని చేస్తారు. ఆనాడు ఆ పని చేయాలంటే ధైర్యం ఎంతో ఉండాలి. అంతే కాదు రచయితకు ఆ విషయం రాయలన్నా ధైర్యం కావాలి కదా!

పల్లెలో ఉన్న రైతులు కూలీల వారి జీవన విధానాన్ని చిత్రించాడు ప్రేమ్‌చంద్. హోరి యింట్లో ఐదుగురు సంవత్సరం పొడుగునా రెక్కలు ముక్కలు చేసుకున్నా ఏమీ మిగులుబాటు లేక పోయేది. అప్పులపాలై పొలం, పంటను హోరీ కోల్పోతాడు. రైతు దురదృష్ట వంతుడైతే కూలీగా మారటాన్ని హోరీ పాత్ర ద్వారా ప్రేమ్‌చంద్ చూపిస్తాడు. కూలి చెయ్యటం తప్పుకాదని ఒప్పిస్తాడు. రైతుల ఆర్థిక స్తోమతలు ఎలా సన్నగిల్లుతాయో దానికి నిదర్శనం హోరీ పాత్ర.

జమీందారుకు తెలియకుండా రైతుల దగ్గఱ జరిమానాలు వసూలు చేసిన ఊరి పెద్దల తీరును యిందులో రచయిత వివరిస్తాడు. సర్కారుకు తెలియకుండా జరిమానా వసూలుచేసే హక్కు పంచాయతీ దార్లకు లేదు. రైతుల మీద 'తప్పు విధించేది జరిమానా వసూలు చేసేది జమీందారు మాత్రమే. ఆ ప్రాంతం జమీం దారుకు అధికంగా వచ్చే రాబడి జరిమానాల క్రిందనే.

పంచాయితీదార్లు హోరీవద్ద వసూలు చేసిన జరిమానాను తన ఖజానాకు జమకట్టేందుకు వారిని పిలిపిస్తాడు జమీందార్ రాయ్‌సాబ్. గ్రామ పెత్తందార్లను గద్దించి నా జమీందారిలో ఒకనమ్మకస్తుడైన ఆసామిని దోచుకున్నారన్నమాట. మీకీ అధికారం ఎవరిచ్చారు? పారిపోవాలను కున్నవాడు (గోబర్) అమ్మాయిని

ఎందుకు లేవదీసుకు వస్తాడు. మీరే అతన్ని తన్ని తరిమేసి ఉండొచ్చు"నని వసూలు చేసిన సొమ్మును కక్కించు కొంటాడు.

ఇటు అప్పుల వాళ్ళు హోరీని ఎప్పుడూ తరుముతూ ఉంటారు. అటు జమీందారు నుంచి మొదలుకొని కొలువులోని వారందరూ హోరీని లంచాలకోసం పీక్కు తింటారు. వారి నడుమ హోరీ ఆర్థిక దోపిడికి గురవుతుంటాడు. రాబడి అంతా రాబందుల పాలవుతూ వుంటుంది. ఇది హోరీస్థితి గాదు. యావత్తు మన దేశం రైతుల దుస్థితి. పరిశ్రమలు పెరగటం వల్లకూడా రైతులకు ఒరిగింది ఏమీ లేదు. ఆనాటి రైతుల దుర్దశ అలాంటిది.

'మాలపల్లి — గోదాన్'ల రచనకు నేపథ్యంగా, ప్రేరకంగా పనిచేసిన అనేకానేక పరిస్థితుల దిఙ్మాత్ర పరిశీలన ప్రయత్నం ఈ ప్రకరణంలో జరిగింది.

## పాదసూచికలు

1. స్వాతంత్ర్య సమరంలో స్మరణీయులు గిరిజన సమర వీరులు 'జాగృతి' పరిధావి దీపావళిసంచికలో అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో కోయల రంప తిరుగుబాటు గురించి వివరించారు. చరిత్ర కెక్కినవి బ్రిటిషు వ్యతిరేక గిరిజన పోరాటాలు.

1/*A*. 'మాంపల్లి' కాత్యాయని విద్మహే- విమర్శిని. 3. పేజి 63. కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్ (పరిశోధన పత్రిక 1978)

2. జేమ్స్ కోన్నల్లీ నాయకత్వంలో ఈ తిరుగుబాటు జరిగింది. ఈయన గొప్ప మార్క్సిస్టు. ఈయనను 12-మే- 1916లో ఉరి తీశారు. 'ఉన్నవ రచనలు- కొన్ని' పేజి. *xviii*.

3. ఒక వైపు భారతీయులను సంతృప్తి పర్చటానికి ప్రయత్నిస్తూనే బ్రిటిషు ప్రభుత్వం అణచివేత చర్యలకు సిద్ధ పడింది. సమన్వయ పాలన (***Rule of law***)కు విరుద్ధమైన విపరీతాధికారాలు చేతుల్లో పెట్టుకోవాలని నిర్ణయించుకొంది. 1919 మార్చిలో ఈ 'రౌలట్ చట్టాన్ని' అమలు చేసింది. ప్రభుత్వం ఈ చట్టంద్వారా ఏ వ్యక్తినైనా విచారణ లేకుండా కోర్టు తీర్పు చెప్పకుండా నిర్బంధించే హక్కు ప్రభుత్వానికి సంక్రమించింది. బ్రిటన్‌లో పౌర స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పునాది అయిన హెబియస్ కార్పస్ హక్కును నిలుపుదల చేయటానికి ఈ చట్టం ద్వారా ప్రభుత్వానికి అవకాశం కలిగింది.

4. మొదటి ప్రపంచ యుద్ధంలో బ్రిటన్ దాని మిత్ర రాజ్యాలు కల్సి టర్కీపైన జరిపిన అవమానాన్ని రాజకీయ చైతన్యవంతులైన ముస్లింలంతా గర్హించారు. టర్కీ సుల్తాను తన పదవిని కోల్పోయాడు. "ఖలీఫా" వ్యవస్థ ముగిసి పోయింది. బ్రిటిషువాళ్ళు టర్కీ సామ్రాజ్యాన్ని ముక్కలు ముక్కలుచేసి టర్కీ భూభాగంనుంచి థ్రేస్‌నీ కాజేశారు. బ్రిటిషు ప్రధాని లాయర్ జార్జి లోగడ యిచ్చినహామీకి యిదిపూర్తిగా విరుద్ధం. ముస్లిం ప్రపంచం 'ఖలీఫాగా' (మత పెద్దగా) భావించే టర్కీ సుల్తాను ప్రతిష్టను

బ్రిటిషు ఆ విధంగా కించ పర్చటం ముస్లింలకు బాధ కలిగించింది. దానికి నిరసనగా భారతదేశంలో అలీ సోదరులు హకీంమౌలానా ఆజాద్ అధ్వర్యంలో 'ఖిలాఫత్' కమిటి 1919 లో నిర్మాణమైంది. ఖిలాఫత్ ఆందోళన సహాయ నిరాకరణోద్యమానికి గొప్ప మేలు చేసింది.

5. భారత స్వాతంత్ర్య సమర చరిత్ర విప్లవ మహాయుగం(1857—1947) ఆంధ్ర శ్రీ పబ్లికేషన్స్— రాజమండ్రి. 1970.

6. జాతి నిర్మాతలు. పేజి. 45. దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, హైదరాబాద్. 1981.

7. త్యాగానికి సిద్ధం కావటం ముస్లిం ఐక్యతకు పాటు పడటం నూలు వడకటం అస్పృశ్యతా నివారణకు కృషి చేయటం మున్నగు నియమాలకు బద్ధుడైనవాడే సత్యాగ్రహి. ఈ విధమైన శిక్షణ పొందిన వారికే ఉద్యమంలో విశిష్టస్థానమున్నది.

8. ఒకటి ప్రజలు పన్నుల నిరాకరణను కొనసాగిస్తూ దాని ఫలితంగా వారికి కలుగబోయే సాధక బాధకాలన్నింటికి ఓర్చుకొనటం. రెండవది గ్రామాన్ని ఖాళీచేసి వెళ్ళిపోయే పక్షంలో మున్సిపాలిటీ దానంతట అదే రద్దయి పోవటం.

9. "మాలపల్లి—ఒక పరామర్శ" పేజి 100. జి. ఆంజనేయులు నాయుడు. యం. ఫిల్ పట్టా కోసం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం. 1980.

10 చూడు. 'మాలపల్లి' పేజి. 502, 503.

11. అంబేద్కర్ రంగంలోకి దిగక ముందు బెజవాడలో మొదటి పంచమ సభ జరిగింది. ఈ సమావేశాన్ని ఉన్నవ తన మాలపల్లిలో పేర్కొన్నాడు.

12. చూడు. ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్యపోరాటం. పేజి 71 ఆం ప్ర. సా.తి. హైద్రాబాద్. 1975.

13. చూడు. కలం పట్టిన యోధుడు— ప్రేమ్‌చంద్, అరుణతార. సెప్టెంబర్ & నవంబర్ 1979. పేజి. 22

14. మావో గురించి, ప్రేమ్‌చంద్, అమిత్‌కుమార్‌గుప్తా. అరుణతార, పేజి. 11. అక్టోబర్ 1981.

15. ఈ వాక్యాన్ని ధనియా చేత అనిపిస్తాడు. "యహ్ పంచ్ నహీహై రాక్షస్ హై. పక్కే రాక్షస్." గోదాన్, పేజి. 106 సరస్వతీ ప్రెస్. ఢిల్లీ 1980.

# 3. మాలపల్లి - గోదాన్‌ల వైశిష్ట్యం

నవభారత సాహితీ స్రష్టలు — సంఘ సంస్కర్తలు అయిన ప్రేమ్ చంద్, లక్ష్మీనారాయణుల కలాల నుంచి జాలువారిన మేటి నవలలు "మాలపల్లి—గోదాన్"లు. ఇవి ప్రధానంగా గాంధేయ ఉద్యమాలను ప్రతిబింబించే నవలలు. తెలుగునవలా సాహిత్యంలో మాలపల్లి నిరుపమానమైనది. హిందీ సాహిత్యానికే మణిమకుటం గోదాన్. మాలపల్లి నవలలో కథ హరిజనులకు సంబంధించినది. గోదాన్‌లో ప్రధానకథ హరిజనులకు సంబంధించి లేక పోయినను హరిజన సమస్యను శక్తివంతంగా ప్రదర్శింపబడింది. హరిజనుల ఉద్ధరణకు మార్గాలను అన్వేషించి వారిని అభ్యుదయపథం వైపుకు త్రిప్పటానికి కృషిచేసిన ఉత్తమ సాంస్కృతిక సాధనాలనవచ్చు ఈ నవలలను. అందులో వీరిద్దరు స్వీకరించిన హరిజనోద్యమం సమస్య గాంధీగారికి అతి ప్రీతిపాత్రమైంది. అది జాతీయైక్యతకు దోహదకారి. అభ్యుదయసాహిత్యానికి అవసరమైన వస్తువులను చేపట్టిన ఘనత కూడా ఈ రచయితలకే దక్కింది. అంతటి జీవితాత్మకమైన నవలలను రచించేందుకు ఈ రచయితలు తమ జీవితాలను ఎంతగానో కాచివడబోశారు. రాజా రాంమోహన్‌రాయ్ వీరేశలింగంగార్ల సంఘసంస్కరణలకు సన్నిహితంగా నవలల్లోని పాత్రల ద్వారా అంటరానితనాన్నే సమూలంగా నాశనంచేయాలని, వితంతు వివాహాలను ప్రోత్సహించాలని ఉద్దేశపూర్వకంగాచేసిన బృహత్తర ప్రయత్నాలు ఈ నవలలు. జమీందార్లు, పెత్తందార్లు సామాన్యరైతులను ఏ విధంగా హింసిస్తున్నారో ఎత్తిచూపారు తమనవలల్లో.

ఆనాటి సామాజిక చైతన్యానికి ప్రతిబింబాలు కావటం మాత్రమేకాదు ఈ నవలల విశిష్టత. ఆ చైతన్యానికి నూతన దృక్పథాన్ని పరిణామ మార్గాన్ని నిర్దేశించటం కూడా అవి చేశాయి. మౌలికమైన హైందవ ధర్మం సంస్కృతీ సజీవంగా ఉన్నాయని "గోదాన్-మాలపల్లి" నవలలు ఋజువుచేశాయి.

ఈ నవలలు ఆద్యంతం సమాజంలోని దాదాపు అన్ని సమస్యలను గూర్చి నిజాయితీతో తమ అభిప్రాయాలను వ్యక్తంచేశాయి. ఒక్కమాటలో

చెప్పాలంటే సమాజాన్ని ఈ నవలలు దర్శించినంత సమగ్రంగా, సంపూర్ణంగా దర్శించిన నవలలు విశ్వనవలా సాహిత్యంలో అరుదు.

## అ) మాలపల్లి

ఇరవయ్యో శతాబ్ది రాజకీయాల్లో గాంధీజీ ఎలా విశిష్టవ్యక్తో అలాగే తెలుగు నవ్యసాహిత్యంలో 'మాలపల్లి' ఒక విశిష్టరచన. బ్రిటిషు ప్రభుత్వాన్ని కలవరపరచి దేశంలో పెద్దదుమారం లేపి కొత్త సంచలనం సృష్టించిన ఈ 'మాలపల్లి' రాయవెల్లూరు జైలులో ఉన్నప్ప నిర్బంధించబడ్డకాలంలో వెలువడింది![1] దీనిలో గాంధీజీ జాతీయోద్యమానికి సంబంధించిన సంస్కారణలు ప్రాధాన్యం వహించాయి 'మాలపల్లి' ధ్యేయం గాంధీజీ ధ్యేయమే. దేశానికి రాజకీయంగా విముక్తి కలిగించడమేకాదు మహాత్ముని ధ్యేయం. సమాజంలో ఆర్థికమైన సమానత్వాన్ని నెలకొల్పాలనేది ముఖ్యఆశయం.

హరిజనోద్ధరణ తద్వారా మానవధర్మపరిణామమూ, కార్మిక సమ్మెలు మాలపల్లిలో చిత్రించబడ్డాయి. గ్రామీణ వ్యవస్థలో బ్రహ్మణ్యం ఎలా దిగజారిపోయిందో మాలపల్లిలో వ్యక్తమయింది. ఈ నవలలోని యదార్థ చిత్రణం సామాజిక విప్లవ శక్తి ఆంగ్లేయ ప్రభుత్వానికి భయం కల్గించింది. వచ్చీరావటంతోనే 'మాలపల్లి' నిషేధింపబడింది. నిషేధం ఎత్తి వేయబడిన తర్వాత (రెండవ కూర్పులో) ఈ నవలలో కొన్ని సంభాషణలు నిషేధించబడ్డాయి.[2] ఆనాటి ప్రభుత్వానికి సోషలిస్టు అన్నా, కమ్యూనిస్టుఅన్నా గిట్టేదికాదు.

'మాలపల్లి' నవల నాలుగుభాగాలుగా విభజింపబడి మొదటి భాగంలో 25 అధ్యాయాలు, రెండవ భాగంలో 21 అధ్యాయాలు, మూడవ భాగంలో 24 అధ్యాయాలు, నాలుగోభాగంలో 21 అధ్యాయాలుగా రాయబడింది. ఇతివృత్తానికి తగిన రీతిలో సన్నివేశ కల్పనం, సంభాషణ రచనరీతి, కథాకథన నైపుణ్యం, పాత్రశీల వర్తనం, సామాజిక స్పృహతోసహా వాడుక భాషా బలాన్ని తెలుపుతూ రమ్యంగా ఈ నవలా నిర్మాణం చేశాడు ఉన్నవ. రామదాసు చరిత్ర 'మాలపల్లి'. రామదాసు జీవిత పరిణామం మాలపల్లిలోని కథాగమనం, రామదాసును అనుసరించి చేయబడ్డ

నానా జీవిత చిత్రణం మానవధర్మ పరిణామ చిత్రణం అవుతుంది. ఈ నవల రామదాసు చేనుపని సన్నివేశంతో ప్రారంభమై మాలపల్లె మునిపల్లెగామారి రామ దాసు మహర్షి అయి విజయ కళాశాల గురుకులానికి కులపతిగా నియమితుడు అవటంతో ముగుస్తుంది.

## i) కథా సంగ్రహం

రామదాసు నివసించేది మాలపల్లిలో. ఈపల్లెచుట్టూ మాదిగపల్లె, మాలకొండ, వూరకొండలనే చిన్నపల్లెలున్నాయి. ఆ పల్లెలనడుమ ఉన్నది మంగళాపురం. రామదాసు ప్రత్యర్థి చౌదరయ్యది ఆ మంగళాపురమే. రామదాసు కుటుంబ గాథ చౌదరయ్య కుటుంబంతో పెనవేసుకొనివుంది. ఈ రెండు కుటుంబాల ననుసరించి ఎన్నోపాత్రలు ప్రవేశించి సందర్భోచితంగా తమ ప్రాధాన్యాన్ని నిర్వర్తిస్తాయి.

రామదాసు భార్య మాలక్ష్మి. వెంకటదాసు, సంగదాసు, జోతి, రంగడు వీరి సంతానం. అప్పదాసు మేనల్లుడు. సంగదాసు చౌదరయ్యవద్ద పనికి కుదురు తాడు. చౌదరయ్యకొడుకు రామానాయుడు సంగదాసుతో స్నేహంగా ఉంటాడు. వారి స్నేహంలో ధనిక పేద తనంగాని, కులాల అడ్డుగోడలుగాని లేవు. వారు స్నేహంతో పరమ పవిత్రంగా ఉంటారు. రామానాయుడు జీవితం కార్మికో ద్యమానికి, పంచమోద్యమానికి అర్పిస్తాడు. రామనాయుడు భార్య కమల రామానాయుడి తమ్ముని (పినతల్లి కొడుకు) ప్రలోభానికి లోనై అతడితో లేచి పోతుంది. సంగదాసు రామానాయుడు బెజవాడలో జరిగిన పంచముల సభలో పాల్గొని వస్తారు. మంగళాపురంలో భూస్వాములకు కూలీలకు కూలి విషయంలో తగాదా లేర్పడుతాయి. భూస్వాములు కూలీల శ్రమను దోస్తున్నారని కూలీలను కూడగడతాడు సంగదాసు. కూలీలసమ్మె తీవ్రతరం అవుతుంది. సంగ దాసుకూలీలకు బాసటై సమ్మె కట్టిస్తున్నాడని, కుమారున్ని పంచమోద్ధరణకు లాగి చెడగొడుతున్నాడనే పిచ్చి కోపం పెంచుకొని చౌదరయ్య రాగోలతో సంగ దాసు తలపై కొట్టి చంపేస్తాడు. డబ్బుసంచులు తగలేసి కేసుమాఫీ చేయించు కొన్నచౌదరయ్య రామదాసు కుటుంబంమీద పగబూనుతాడు. మెల్లగా రామదాసు ఆస్తినంతా స్వాధీనం చేసుకుంటాడు. అప్పాదాసు ఉద్యోగాన్ని ఊడగొట్టిస్తాడు.

మాలపోడును పూర్తిగా తొలగించుకొనేందుకు ఊళ్ళోనుంచి రామదాసును తరిమేసే ప్రయత్నంచేస్తాడు. సెటిల్మెంటు పాలయిన రామదాసుకుకష్టాలు ప్రారంభమైనాయి. సెటిల్మెంటు నుంచి జైలులోతోస్తారు. ఆయన్ను, తర్వాత జోతి అప్పాదాసుల మరణం వెంకటదాసు చెప్పగావిని మాలక్ష్మి మరణిస్తుంది. బంధాలు ఒక్కొక్కటే తెగుతుంది. కొన్నాళ్ళకు వెంకటదాసు రామదాసు కళ్ళముందే చనిపోతాడు. తన వారందరినీ రామదాసు కోల్పోతాడు. సంగదాసు ఘోరమరణానికి వెంకటదాసు హృదయం ముక్కలవుతుంది భూస్వాముల దౌర్జన్యాన్ని ఎదుర్కోవాలనే సంకల్పంతో సంతానోద్యమాన్ని చేపట్టుతాడు. ధర్మకన్నాలువేసి ధనికులదోచి పేదలను ఆదుకుంటాడు. ధనిక వర్గానికి రక్షణ కల్పించే ప్రభుత్వం జగ్గన్ని బంధించేందుకు ప్రయత్నిస్తుంది. సర్వాంతర్యామి జగ్గడు ఆంగ్లేయ ప్రభుత్వానికి సింహస్వప్నమవుతాడు. ఆంధ్రలో ఉన్న పోలీసు బలగం చిత్తవుతుంది. జగ్గని జాడలను పట్టేందుకు అమాయకులను ఊళ్ళల్లో హింసించే చర్యలను పోలీసులు అవలంభించారు. పోలీసులు అమాయకులను హింసించటం, సంతానుల భార్యలను భర్తలనుజాడలను తెలుపమని వేధించటంచూసి జగ్గనికి కంపరమెత్తింది. పోలీసు వారికి హెచ్చరిక చేస్తాడు. అబలలను వేధిస్తే తన చట్టం ప్రకారం శిక్షిస్తానం టాడు. తన సిద్ధాంతాల ప్రకారం ఉద్యమం సాగిస్తానంటాడు. జగ్గని శాఖలు నైజాం వరకు వ్యాపించాయి. మైసూరు, మద్రాసు, హైదరాబాద్ మూడు గవర్న మెంట్లువారు కల్సిపోలీసు బలగాలను అధిక సంఖ్యలో దించారు. అయినా జగ్గడు వారిపై యుద్ధం ప్రకటిస్తాడు. వీరకిశోరంలా పోరాడి క్షతగాత్రుడై వారికి చిక్కుతాడు. రెండు బంధిపోట్లు, ఒక దారి దోపిడి, ఒక ధర్మకన్నంనేరాలు రుజువైనాయి. ఆయన్ను విచారించిన న్యాయమూర్తులు జగ్గడుచేసే దోపిడి విధానం 'ఒక రకంగా' సబబేఅయినా మా రాజ్యాంగం ఆయన్నిదోషిని చేస్తుందని తీర్పుయిచ్చారు.

సంగదాసు అనంతరం రామానాయుడు హరిజనాభ్యుదయానికి నడుంకట్టి తీవ్రంగా కృషి చేస్తాడు. వెంకటయ్య రామానాయుడుకు బాసటగా నిలుస్తాడు. కార్మిక పంచమోద్యమాలు రెండూ రాజకీయ ఉద్యమానికి పునాది వేశాయి. రామానాయుడు జైలు జీవితం అనుభవించటం అంతలో తిలక్ గాంధీ నాయకుల త్యాగం వల్ల స్వరాజ్యం సాధించబడింది. ఆ సందర్భంలో జైలునుంచి రామదాసు

విడుదలయి రామానాయుడు వెంకటయ్యల త్యాగంవల్ల స్థాపించబడ్డ విజయకళా శాలకు కులపతిగా నియుక్తుడవుతాడు.

## ii) పాత్రల ప్రాతినిధ్యం

చారిత్రక బాధ్యతతో చక్కని ఇతివృత్తాన్ని ఎన్నుకొని సజీవ పాత్ర చిత్రణం గావించి వివిధ వ్యక్తుల, వివిధ చిత్తవృత్తులతో ఆనాటి సమాజాన్ని కన్నులకు కట్టేట్లుగా చిత్రించాడు ఉన్నవ. ఈయన లోకవృత్త పరిశీలనకి జీవితానుభవాల్ని, ఉద్యమ స్ఫూర్తినీ జోడించి సమాజంలోని అనివార్యమైన ఆటుపోట్లను సహజ రీతిలో చిత్రించాడు. అంతేగాదు ఆయా సన్నివేశాలలో, సందర్భాలలో పాత్రల సంభాషణ ద్వారా వారి మనః ప్రవృత్తులను, దృక్పథాలను, వైరుధ్యాలను స్పష్టపరిచాడు. ఎంతో నేర్పుతో వాస్తవిక పద్ధతిలో జీవం పోశాడు. ప్రతి పాత్ర సమకాలీన పరిస్థితులకు ఏదో ఒక విధంగా ప్రాతినిధ్యం వహిస్తుంది.

### రామదాసు

నవలలో ప్రధాన పాత్ర మాలదాసరి రామదాసు శాంతి మార్గంలో పంచముల అభ్యున్నతి కోరినవాడు. అచలబోధ అతని ఊపిరి.* చౌదరయ్య దౌర్జన్యంగా సంగని చంపినా అతని మీద నింద మోపటంగాని ప్రతీకార చర్య తీసుకోవటంగానీ చేయలేదు. తన ఆస్తినంతా కాజేసినా చౌదరయ్య మీద ద్వేషం పెంచుకోలేదు. అకారణంగా సెటిల్మెంటుకు పంపించినా బాధపడలేదు. సెటిల్మెంటు నుంచి పిల్లలను వేరుచేసి జైలుకు పంపించినా చింతించలేదు. పోలు దౌష్ట్యానికి జోతి బలి కావటం, ఆ వార్తవిని మాలక్ష్మి మరణించటం చూచి వెరవలేదు. తన కళ్ళముందే వెంకటదాసు మరణించినా కూడా ఆయన చలించలేదు. సంగదాసు మరణంతో ఒక్కొక్క బంధం తెంచుకుంటూ చివరకు ఏకాకి అయి స్వర్గారోహణ పర్వంలో ధర్మరాజు లాగా జీవన్ముక్తుడుగా మిగిలి పోతాడు రామదాసు.

రామదాసు జైల్లో ఉన్నా సర్వమానవ శ్రేయస్సుకై పాటుపడ్డాడు. అహింస, అసహాయోగం, శత్రువును ప్రేమించటం, కష్టాలను ఓర్చుకోటం, దయా సత్య శౌచాలనే ఉత్తమ గుణాలను రామదాసులో చిత్రించి అపర గాంధీగా పాఠకుల ముందునిలిపాడు రామదాసును మాలదాసరిగా చేయటం ఉన్నవ అభి

లాష. ఆనాడు హరిజనులను ఉద్ధరించేవారు, హరిజనులు ఉద్ధరింపబడేవారు అనే భావన ఉంది. ఆ హద్దులను చెరిపి వెయ్యటానికే ఆ పాత్రను ఆకులం నుంచి ఎన్నుకున్నాడు. ఆత్మోద్ధరణ తద్వారా సంఘోద్ధరణ పరమపద సోపానమైన దేశోద్ధరణను కాంక్షించినాడు ఉన్నవ. అందుకే కేవల కల్పిత పాత్రా ప్రయోగం కాకుండా సహజ రమ్యంగా, వాస్తవిక ఆదర్శంగా మాలపల్లిలో మహాత్ముని సృజించగలిగి గాంధీజీ వర్తనలు అన్వయించ గలిగాడు. రామదాసు సెటిల్మెంటులో, జైలుల్లో అనుభవించిన కష్టాలు ఉన్నవ జైల్లో అనుభవించాడు. పాకీ దగ్గరనుంచి దేన్నీ ఆయన అసహ్యించుకోలేదు. అచల యోగ కుండలినీ నిత్య సాధకుడయిన తండ్రి ద్వారా ఆ సంస్కారం సంక్రమించటంవల్ల ఉన్నవ రామదాసు పాత్రే అనటానికి ఎట్టి సందేహంలేదు. "మంచి యన్నది మాలయైతే మాలనే అగుదున్" అన్న గురజాడ గారి సూక్తిని అన్వయించు కున్నాడు. రామదాసు విజయకళాశాలకు కులపతి అయితే ఉన్నవ శారదానికేతనానికి కుల పతి అయ్యారు.

## చౌదరయ్య

ధనిక భూస్వామ్య వర్గాల ప్రతినిధి. స్వార్థ గుణం, లోభం ఈయనలో ఎక్కువున్నాయి. తనకు ఎదురు తిరిగిన వ్యవహారాన్ని, మనుషుల్ని అణగ గొట్టాలనే ఆవేశం ఉన్న మనస్తత్వం చౌదరయ్యది. ఆనాటి జమీందారుల లోని దౌర్జన్యానికి ధన కాంక్షకు చక్కటి రూప కల్పన చౌదరయ్య. అగ్రవర్ణాల వారికి కూడా కొంత వరకు ప్రతినిధి. పంచముల మీద పగబట్టి తన కక్షను ధన బలంతో తీర్చుకున్నాడు. మాలపోడు వదిలించు కునేందుకు హంతకునిగా మారి, వారి అంతు చూశాడు వెంకటదాసు మాటల్లో "సంగని మింగిన పులి యింకా స్వేచ్ఛగా విహరిస్తున్నది. అది మనుష్య రక్తం రుచిగన్నది" అని ఉన్నవ స్పష్టపరిచాడు. పాత పెత్తందారీ పద్ధతుల భూస్వామి అయిన చౌదరయ్య చేతి బడితె కర్రలో భూస్వామ్య వ్యవస్థ తాలూకు దర్ప దుర్మార్గాలను చూపటం ఉన్నవ సూక్ష్మ శక్తికి నిదర్శనం.

## సంగదాసు

రామదాసులోని శాంతి అహింసలు అనే ఆదర్శాలకు ఒక రకంగా యువక ప్రతినిధి సంగదాసు. తండ్రి గుణాలు పుణికి పుచ్చుకొని ఒక తరం ముందుకు వచ్చిన వ్యక్తి. తన వారిని ఆర్థిక అగాధాల నుంచీ లేవదీయాలనే ధ్యేయమున్న వాడు. అగ్రవర్ణాల వారంటే ఆతనికి విద్వేషం కలుగక పోవటానికి ఆధ్యాత్మిక విద్యాగంధం అబ్బటం కారణం కావచ్చు. సోషలిస్టు భావాలున్న సంగదాసు గాంధీజీ ప్రవచించిన ధర్మ కర్తృత్వ సిద్ధాంత ప్రయోగాన్ని ఆచరణ మార్గంగా ఎన్నుకున్నాడు. గాంధేయ మార్గానికి ప్రతినిధి అయిన ఈ సంగదాసు విప్లవ మార్గానికి వ్యతిరేకి, సదాశయ సాధనం కోసం శాంత్యహింసల మూలంగా ఆత్మ బలిదానం చేశాడు. గాంధీగారి అంతిమ త్యాగం లోని పరమార్థం యిదే కదా !

చౌదరయ్యకు కూడా సంగదాసు మీద ప్రత్యక్షమైన వ్యక్తిగత ద్వేషం లేదు.[6] సంగదాసు హత్యకు చౌదరయ్య దౌర్జన్యం బలమైన కారణమైనా రామదాసు సౌజన్యం కూడా సహకరించింది.

19 శతాబ్ది చివరి భాగంలో మార్క్సియన్ సోషలిస్టు భావాలు మన దేశంలోకి నెమ్మదిగా చొచ్చుకొచ్చాయి. బ్రహ్మ సమాజికుల్లో వేళ్ళూని మెల్లగా రాజకీయనాయకుల్లో అవి ప్రవేశిస్తున్నాయి పండిన పంటలో కొంత భాగం కూలీ లకు ఇవ్వాలని, పోరంబోకులు దిగువ జాతుల వారికి యివ్వాలని సంగదాసు కోరటం, వ్యవసాయం ఆసాముల మీద కంటే కూలీల మీదనే ఎక్కువగా వుందని స్పష్టం చేయటం సామ్యవాద వ్యవస్థా నిర్మాణ దృక్పథంగా చెప్పొచ్చు.[7] ఈ రచనా కాలం నాటికి నెహ్రూజీ సోషలిస్టుభావాలతో పనిచేస్తున్నాడు. నెహ్రూ గాంధీజీ సిద్ధాంతాలతో ఏకీభవించిన వాడు కాబట్టి ఈ నవలలోని సంగ దాసును నెహ్రూ గారికి ప్రతినిధిగా పేర్కొన వచ్చును.[8]

## వెంకటుదాసు

రామదాసులోని అహింస సిద్ధాంతానికి పూర్తి విరుద్ధ మనస్తత్వం వెంకట దాసుది. తండ్రి ప్రేమరాజ్యం స్థాపిస్తే ఇతను సమతావాద సమాజ (*Egalitarian society*) స్థాపనను కాంక్షించాడు.[9] ఆనాటి తిరుగుబాటుకు ప్రతి

రూపమైన జగ్గడు యుగయుగాల దోపిడికి ఉరితాడు వేయాలని ప్రయత్నించాడు. అందరూ సమానంగా బ్రతకాలని "విప్లవ" స్థాయిలో వీరోచిత పోరాటం సాగించి బ్రిటిష్ సామ్రాజ్య కిరాతకాన్ని కలియుగ రాక్షసులైన ధనస్వాముల క్రూరత్వాన్ని కూటయుద్ధంలో ఎదుర్కొని తన ఆశయాలకు ఆహుతి అయినాడు జగ్గడు. ఆతడు చేసింది ధర్మయుద్ధం. ప్రభుత్వ దృష్టిలో అది అరాచకం. రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే అభిలాష అతనికి లేదు కాబట్టి అస్వాభావిక ద్వేషానికి అతను లోనయ్యాడు.[10] ఆనాటి స్వాతంత్ర్య పోరాట రంగంలో గాంధీ ఉద్యమం కంటే బ్రిటిష్ ప్రభుత్వం దమన నీతికి వ్యతిరేకంగా పోరాడిన విప్లవ వీరుల సాహసిక గాథలు వారి పోరాటాలు ప్రాముఖ్యం వహించాయి. ఆనాటి విప్లవ వీరుల సాహస కృత్యాల ఒరవడి ప్రతిబింబమే జగ్గడి పాత్ర సృజనలో, ఆతని పోరాటాల్లో వ్యక్తం అయింది.

స్వాతంత్ర్యోద్యమంలో ఆయుధం పట్టి బ్రిటిషు వారిని ఎదుర్కొన్న అల్లూరి సీతారామరాజుకు ప్రతినిధి వెంకటదాసు.[11] కథాగతమైన 'సంతానోద్యమం' ఆనాటి(1922) గిరిజన పోరాటమే. జగ్గని చట్టమంతా రామరాజు అమలు చేసిందే. జిల్లా సూపరింటెండెంటు సంతానుల కోవలు వెదికేందుకు వెళ్ళితే ఎదురు కాల్పులు కాల్చి ఆయన్ను బంధించటం డిప్టీ సూపరింటెండెంటును చితక బాది పంపించటంలోని సన్నివేశం, ఆనాడు గిరిజనులు పోలీసులపై కాల్పులు జరపటం, లొంగిన వారిని క్షమించి వదిలి వేయటం లాంటివి స్ఫురింప చేస్తాయి. జగ్గని విడిపించేందుకు సంతానులు జైలు మీద దాడి జరపాలని మందుగుండునంతా చేర్పించటం. మొదటి రోజు సంతానులు కావలి సైన్యాన్ని ముట్టడించి నష్టం కలిగించటం, అల్లూరి అనుచరులు పోలీసు స్టేషన్‌లను ముట్టడి చేసిన విధానాన్ని నిరూపిస్తుంది.[12] రామరాజు అనివార్య కారణాలవల్ల లూటీలు చేశాడని వదంతి వ్యాపించినట్లే జగ్గని ధర్మకన్నాలు ప్రచారంలోకి వచ్చాయి. జగ్గని ఎదుర్కొనేందుకు మూడు ప్రభుత్వాలు తర్ఫీదు అయిన సైన్యాన్ని దింపింది. ఆనాడు రాజును పట్టుకొనేందుకు రిజర్వు పోలీసులు తగరని కొండ యుద్ధాలలో శిక్షణ పొందిన మలబారు పోలీసులను ప్రభుత్వం రంగంలోకి దించింది. ఇంతవరకు ఆంధ్రలోని పరిస్థితులను చూచిన ఉన్నవ అల్లూరి సీతారామరాజు కథ ముగింపు ఆలోచించి జగ్గని కథను తోచినట్లు ముగించి వేశాడు. అందువల్ల రాసిన కథకు జరిగిన

కథకు స్వల్ప భేదం ఏర్పడ్డది. ఇద్దరివి కూడా వీరోచిత మరణాలే. జగ్గడు ముమ్మూర్తుల అల్లూరికి ప్రతినిధి.

## iii) రచనా శిల్పం

### కథా సంవిధానం

ఉన్నవ కథ చెప్పటానికి ఎన్నుకొన్న పద్ధతి ప్రధాన పాత్రధారి చుట్టు తిరిగేదే. ఉన్నవ చెప్పదలచుకొన్న కథను సాధ్యమయినంత వరకు పాత్రల ద్వారా నడిపిస్తూ అవసరమని తోచిన చోట తాను ప్రవేశించి వ్యాఖ్యానాలు చేస్తాడు. అధ్యాయాల విభజన పథా కథనానికి అనుగుణంగా, లక్ష్యానికి ఉన్ముఖంగా ఉన్నది. ప్రతి అధ్యాయానికి పేరుపెట్టటం ఈ నవలలో ఓ ప్రత్యేకత.

కథా క్రమాన్ని ఒక ప్రణాళిక ప్రకారం నడిపించినా కొన్ని ఘట్టాలలో వర్ణన యెక్కువై కథకు స్తబ్దత ఏర్పడినట్టు అనిపిస్తుంది. అయినా చదివించే గుణం కొరవడదు. ఆ ఘట్టాలు మినహాయిస్తే కథ ఎంతో ఉత్కంఠతో సాగుతుంది. ఆయన సృష్టించిన పాత్రలు ఆయన విభజించుకొన్న సంపుటాల్లో ఒక్కొక్కరినే అంత మొందించుకుంటూ వచ్చారు. ప్రథమ సంపుటిలో సంగదాసు చంపబడ్డప్పుడు సానుభూతి స్రవంతి అవుతుంది. రచయిత పాఠకున్ని కథా పాశంతో బిగిస్తాడు. సుబ్బలక్ష్మి మరణం ప్రథమ సంపుటిలోనే. రెండవ సంపుటిలో సాహు మరణం. వెంటనే కమల మరణం. మూడవ సంపుటంలో చౌదరయ్య, లక్ష్మమ్మ, జోతి, అప్పాదాసుల మరణం. నాలుగో సంపుటంలో మాలక్ష్మి-వెంకటదాసు మరణం.ఇవన్నీ ఒక ప్రణాళికప్రకారంగా ముగించుకుంటూ వచ్చాడని తోస్తుంది.

రచయిత కథారంభం చేనుపనితో ప్రారంభిస్తాడు. వ్యవసాయం పంట కాలం వర్ణించి మెట్ట ప్రాంతం రైతుగా రామదాసుని పరిచయం చేస్తాడు. చేనుపని ముగించుకొని యింటికి వచ్చిన రామదాసు వద్దకు ఆయన చెల్లెలు సుబ్బలక్ష్మి ఆయాసంగా వచ్చేసి చేనుగట్టు మీద నడిచినందుకు బసివిరెడ్డి కొట్టాడని చెప్తుంది. గ్రామ మున్నబు కొడుకు కొట్టిన దెబ్బలో ధనిక వర్గం స్పష్టంగా కనబడేట్లుగా

చిత్రిస్తాడు వైద్యం చేయించినా ఆమె మరణిస్తుంది. అగ్రవర్ణాల ఆగడాలకు తొలి సమిధ సుబ్బలక్ష్మి. ఇక కథ ఊపునందుకుంటుంది

రామదాసు కుటుంబ వ్యవహారంతో ప్రారంభమైన కథ క్రమంగా కూలీలకు భూస్వాములకు నడుమ పెరిగే పోరాటంగా నవలలో పరివ్యాప్తమౌతుంది. సంగదాసు రామనాయుడు ఒక పక్షం. చౌదరయ్య మున్సబు వేరొక పక్షం. మంగళాపురంలో చౌదరయ్య మున్సబు మొదలైన భూస్వాములు కూడి కూలి విషయం గురించి మాట్లాడు కుంటారు. కూలీల అలజడికి సంగదాసే కారణమని వారిని వెనుకేసుకు వస్తున్నాడని మున్సబు గట్టిగా వాదిస్తాడు. మంగళాపురానికి సమీపంలోని పాలెంలో కూలీలకు గింజలు గాక డబ్బివ్వాలని చౌదరయ్య, చిన్నప రెడ్డి యిద్దరు నిర్ణయిస్తారు. ఒక వైపు ఆసాముల నిర్ణయాలు జరుగుతున్న పరిస్థితులలో కోతలకు కూలీలు తరళి వెళ్తారు. రామానాయుడు కోతల పనికి వెళ్ళటం వల్ల కూలీల కష్టాలంటే ఏమిటో అనుభవంలోకి రావటమే గాక ఆకలంటే ఏమిటో ఆతనికి బోధపడుతుంది. కూలీలు సమ్మెకడితే ఆ రోజుల్లో వారికి భోజన మెట్లాగా అని బాధపడతాడు. వస్తులుంటారని సంగదాసు సమాధానం. ఈ సంభాషణ ద్వారా రచయిత కూలీల నవీన జాగృతిని స్పష్టంగా వ్యక్త పరుస్తాడు.

చౌదరయ్య సంగదాసు కూలీల విషయంలో మాట్లాడుకోవటం, కూలీల స్థితిగతులు సంగదాసు వివరించటం, ఆ తర్వాత కూలీలకు కూళ్ళు యివ్వటం జరుగుతుంది. సంగదాసు యజమానికి ఎంత లొంగి ఉన్నా కూలీలతో "రేపు ఎవరికైనా కూళ్ళు మాట్లాడు కోమంటాడు. చౌదరయ్య కూలి తగ్గిస్తాననటంలో పక్షపాతవైఖరి స్పష్టంగా కనబడుతుంది.

తర్వాతి కథ సంస్కరణోద్యమానికి తిరుగుతుంది. విజయవాడ ఆదిమాంధ్ర మహాసభకు రామానాయుడు సంగదాసు వెళ్తూ యిద్దరు కల్సి అన్నం తినటం, సభకు వెళ్లి సంఘ నిర్మాణం గూర్చి పాటుపడటం, సంగదాసు తీర్మాణాలు చేయటం అవన్ని హరిజనాభ్యుదయానికి ఉపయోగపడేవి. ఆ పాత్రల ద్వారా దాన్ని నిర్వహిస్తాడు రచయిత.[18]

మంగళాపురంలో రామనాయుడు సంగదాసు కలిసి సభకు వెళ్లినట్లు తెలుస్తుంది. ఈలోగా కూలీలు చౌదరయ్య చేను పనికని బయలుదేరి వస్తున్నట్లే

వచ్చి వెళ్లిపోతారు. చౌదరయ్య కూలీలతో భంగపడినట్లుగా భావిస్తాడు. ఆయనలో ద్వేషం చోటు చేసుకుంటుంది. సంగదాసు వచ్చిన తెల్లారి కూలీల సమస్య గూర్చి తెల్సుకొని వారందరితో మాట్లాడుతుండగా చౌదరయ్య రాగోల తీసుకొని వచ్చి సంగదాసు తలపై కసిదీరకొడతాడు. ఈ ఘట్టంలో కథ చకచక సాగించి సంగదాసు మరణంతో మొదటి భాగాన్ని సమాప్తి చేస్తాడు. ఉన్నవ ఇంత వరకు బాగా పోషించినట్టి ఈ ముఖ్యపాత్రను ముగించాడని పాఠకులనుకునేంతలో (100 పేజీల) తర్వాత కథ పరాకాష్ఠనందుకుంది.

ఇక రెండవ సంపుటం ప్రారంభంలో కథకు స్తబ్దత ఏర్పడింది. రామానాయుడు సంగదాసు చావు ఉత్తరం అందగానే ఇల్లు చేరటం తండ్రి తాత్కాలిక ఆవేశం సంగదాసు ప్రాణం తీసిందని విచార పడటం సంగని గూర్చిన ఆలోచనం తోనే కాలం గడుపటం జరుగుతుంది.

ఇక్కడ కూలీల సంగతి పేర్కొనేందుకు ప్రస్తావన పూర్వకంగా కథను అతుకుతాడు. కూలీల సమ్మె అలాగే సాగుతుందని పంతులుకూలీల కోసం పాలెం పోయినా కూలీలు తాము రామన్నారని ఆ పరిస్థితిని ఉన్నవ వివరించాడు. కూలీ నాయకుడు మాత్రం ఐదు రోజుల కూలీని ముబాదలాగా యిస్తే వస్తామనటం అది కూడా చౌదరయ్య దగ్గరే వసూలు చేస్తామనటం దానికి కారణం చౌదరయ్య రైతులను కూడగట్టి కూలీ ధాన్యంగాక డబ్బు యిస్తామన్నందుకు అని స్పష్టంగా వ్యక్తపరుస్తాడు. కూలీల కోర్కెలను కాదనే అదను కాదది. కూలీలు లేకుంటే పంట చేను పాడైపోతుంది. భూస్వాములు కూలీల కోర్కెలు ఒప్పుకున్నారు. కథకు బలంగా ఉన్నట్టి అంశాలు కూలీలకు భూస్వాములు లొంగటం, బెజవాడ సభలోని తీర్మాణాలు ప్రచారం కావటం ముఖ్యమైనవి.

కూలివాండ్లకు లోబడి ముందుగా కూలి యివ్వటం చౌదరయ్యకు తలగొట్టినట్టుగా ఉంది. మోతుబరి ఆసామిని లెక్కచేయక కూలీలు తమ పంతాలు చెల్లించుకోవటం ఆయనకు మంట పుట్టిస్తుంది. తగిన శాస్తి చేస్తానని ప్రతిజ్ఞ పడతాడు చౌదరయ్య. పంతులును వినియోగించి వారసత్వపు వ్యాజ్యం వేసి రామదాసు యావదాస్తిని స్వాధీనం చేసుకోవాలని పన్నాగం పన్నటం, వెంటనే ఆ ప్రయత్నాలలో నిమగ్నమవటం జరుగుతుంది.

ఇక్కడ కథను మలుపు తిప్పుతాడు కమల మోహనుల కథ ప్రధాన కథకు ఉపాంగం లాగా సాగుతుంది. ఇది కథకు అవాంతరంగాదు. మరో కోణంలో అధిక్యత కూర్చే వాస్తవిక చిత్రణం. దీనిలో జీవితం తాలూకు లక్షణాలు సజీవంగా దాగివున్నాయి. కేవల కాల్పనిక ధోరణి మాత్రం గాదు.

మోహనరావు చౌదరయ్య యింటికి రావటం, కమల అతని ఆకర్షణకు లోను కావటం, క్షణికావేశానికి ఇద్దరు వశులై చల్ మోహనరంగా అని చెక్కేయటం, రంగులమేడలో రంగుల కలలు వెలిసిపోవటం ఈ కథంతా 30 పేజీల గ్రంథంగా నడుస్తుంది.

తర్వాతి అల్ప కథ ప్రధాన కథకు సంబంధించింది. చౌదరయ్య కోర్టులో దావా వేస్తే దానికి సంబంధించిన వారెంట్లు రామదాసుకు చేరటం, ఆ పరిస్థితుల్లో చౌదరయ్య రామదాసు నడుమ జరిగిన రాజీ రాయబారం విఫలం కావటం, రామదాసు గుంటూరు వెళ్లి ప్లీడరు నారాయణరావును కలిసి వ్యాజ్యం విషయం చెప్పటం, ఆయన ఈ దావాలో రామదాసుకు బలం ఏ మాత్రం లేదని చెప్పటం జరుగుతుంది. ఆన్సర్ మాత్రమే దాఖల్ చేసి ఊరుకుంటాడు.

ఇంతకు ముందు దిగవిడిచిన కమల మోహనుల కథ మళ్లీ సాగుతుంది. ఆకర్షణకు లోనై భర్తను, కొడుకును వదిలి వచ్చిన కమల మనస్సులో విచారం మొదలవటం, తెచ్చిన సొమ్ము ఖర్చుకాగానే మోహను వెళ్ళిపోవటం ఆమెను ఎంతగానో క్రుంగ దీస్తాయి. స్ఫోటకానికి గురై జీవచ్ఛవం లాగా శాంతమ్మ పేరుతో కమల చౌదరయ్య ఇల్లు చేరటం ఈ కథంతా 36 పేజీల గ్రంథం నడిపిస్తాడు.

రెండవ భాగం చివరలో చౌదరయ్య వేసిన దావాలో రామదాసు ఆస్తి పోతుందని తెలిసి ధనికుల దౌర్జన్యాలను ధర్మ కన్నాలతో ఎదుర్కోవాలని వెంకటదాసు తీర్మానించుకొని దానికి జనాన్ని సమీకరించే ప్రయత్నం చేయటం, అంతలో వ్యాజ్యం డిక్రీ తీసుకొని చౌదరయ్య రామదాసు ఆస్తిని స్వాధీనం చేసుకోవటం, ఇవన్నీ చూచి హృదయం కరిగి ఇల్లు విడిచి వెంకటదాసు వెళ్ళటం జరుగుతుంది. ఆధ్యాత్మిక కోవిదుల యింట్లో ఆందోళన మిగులుతుంది. 'సాహు' మరణం, వెంటనే కమల మరణంతో రెండవ సంపుటం ముగుస్తుంది. మూడవ

భాగం కథ రామదాసు కష్టాలతో ఆరంభమై మెల్లగా సాగి కోమటింటి కన్నంతో ఎదిగి పాఠకులలో ఉత్కంఠ లేపే జగ్గని కథతో తారాస్థాయినందుకుంటుంది. కేవలం రెండు పేజీ (417&418) ల్లోనే జగ్గని సమర్థత, పాలన యంత్రాంగం బలహీనతను స్ఫురింప చేసి కథను చకచక సాగించాడు. దొంగల కోనలను వెతకటంలో పోలీసు సిబ్బంది పాట్లుపడటం, జగ్గనికి సంబంధించిన ముఠా పోలీసులకు చిక్కినా స్థావరాల వివరాలు బయటపడకపోవటం, సంతానులలో ఎవరు దొరికినా జగ్గడు దొరికాడని రిపోర్టులు రావటం, చివరికి ఎర్రమలలో (కర్నూల్లో) జగ్గడు దొరికాడని నిర్ధారణ కావటం, పట్టుకున్న పోలీసులకు బహుమతులు ప్రదానం చేయటం జరుగుతుంది. జగ్గని అనుచరులను పట్టి రూపుమాపాలని పోలీసు సిబ్బంది శ్రీగిరిపాడులో తిరుగుతుంటే సంతానులు వారిని పట్టి బంధించి కఠిన శిక్షలు విధిస్తారు. పోలీసు పరిపాలనా దౌర్బల్యాన్ని, అసమర్థతను ఖండిస్తూ పత్రికలు వ్యాసాలు రాశాయి. జగ్గనిని ఎదుర్కొనేందుకు హైదారాబాదు, మదరాసు, మైసూరు ప్రభుత్వాల వారు తమ పోలీసు సిబ్బందిని రెండు రెట్లధికం చేసి సమర్థత గల ఉద్యోగులను అన్వేషణ శాఖాధికారులుగా నియమిస్తారు. అయినా జగ్గడి కార్యక్రమాలు యధేచ్ఛగా సాగుతూనే ఉన్నాయి.

ఈ కథ యిలా సాగుతూనే ఉంటుంది. ఇంతలో చౌదరయ్య లక్ష్మమ్మల మరణం, జామీను కేసును ఉన్నవ వివరిస్తాడు. ఇందులోనే రామదాసు కుటుంబ విషయాలు, జోతి అప్పాదాసుల ప్రేమ, సెటిల్మెంటులో రామదాసు మాలక్ష్మి, జోతిలను యిరికించటం జరుగుతుంది. రామదాసు జైలు పాలైనప్పుడు సెటిల్మెంటులోని లోపాలు వివరించబడుతాయి. తర్వాత జోతి పోలు దౌర్జన్యానికి బలికావటం, వెంకటదాసు మూడు రాజ్యాల (హైదరాబాదు, మదరాసు, మైసూరు) సైన్యాన్ని ఎదుర్కొని వీరోచితంగా పోరాడి కాళ్ళు చేతులు తెగి చిక్కటం కేసు విచారణ జైలుశిక్ష అమలుతో మూడవ భాగం ముగుస్తుంది.

వెంకటదాసుకు ఐదుసంవత్సరాల జైలుశిక్ష విధించి నిడదవోలు జైలులోకి పంపింది బ్రిటిషు ప్రభుత్వం. జైల్లోకి వెళ్లిన తర్వాత అక్కడ తల్లిదండ్రులకు జోతి అప్పాదాసుల మరణాల్ని జగ్గడు చెప్పటం, ఆ వార్తవిని మాలక్ష్మి మరణించటంతో కథ ముగింపుకు వస్తుంది. కాని ఇక ఇక్కడ కథ విపరీతంగా పెంచబడుతుంది. రామదాసు జైలు జీవితం గడుపుతూ సర్వసంగ పరిత్యాగి

అయి స్వరాజ్యం వచ్చిన తర్వాత విడుదలవుతాడు. 'మాలపల్లి'లో రామానాయుడు వెంకయ్యల త్యాగం వల్ల సంగదాసు సంకల్పానుసారంగా స్థాపించ బడిన విజయ కళాశాల అనే గురుకులానికి రామదాసు కులపతిగా నియమించబడుతాడు.

ఆ నాటి ఆర్థిక, సామాజిక, మత, నైతిక రాజకీయ పరిణామాలన్నింటిని ప్రతిపాదించదలచి పెద్ద కాన్వాసునే తీసుకున్న రచనా సంవిధానంలో ఉన్నవ నిరుపమానమైన ప్రజ్ఞనే చూపాడు.

# ఆ) గోదాన్

## ఇతివృత్తం

హిందీ, ఉర్దూ సాహిత్యంలో అగ్రశ్రేణికి చెందిన రచయిత ప్రేమ్‌చంద్. ఆయన 'గోదాన్' నవల భారతీయ సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానాన్ని పొందు పర్చుకుంది గోదాన్ గ్రామీణ జీవిత చిత్రణలో పరకాష్ఠనొందింది. సాంఘిక యితివృత్తాన్ని ఎన్నుకొని గోదాన్ నవలను 36 అధ్యాయాల గ్రంథంగా రాశాడు.

ఇందులో ప్రధాన పాత్ర హోరీ, ఆవుని కొని అప్పుపాలవటం, మర్యాద కోసం అప్పులు చేయటం, వితంతువును కోడలుగా చేసుకోవటం, కన్న కూతురును డబ్బుకోసం ముసలివానికి పెళ్లిచెయ్యటం ఇందులోని సంఘటనలు. సంఘం కట్టు బాట్లకు దరిద్రరైతు జీవితానికి నడుమ కలిగిన సంఘర్షణ ప్రధానమైన యితి వృత్తం గోదాన్ లోని ఇతివృత్తం.

ఇతివృత్తానికి తగిన సన్నివేశాలు, పాత్రల సంభాషణలు కలిసి రచనా వైభవాన్ని యినుమడింపచేశాయి. హోరీ కుటుంబ చరిత్ర 'గోదాన్'. ఆయన జీవిత పరిణామం యావత్తు కథ హోరీని అనుసరించి చేయబడ్డ జీవిత చిత్రణం. అనాటి రైతు జీవిత పరిణామమౌతుంది. అన్యాయాలకు, అక్రమాలకు గురయి హోరీ అతని భార్యా పిల్లలు కూలీలుగా మారారు. ఈ నవల కథ హోరీ ఆవును కొనాలనే తలంపుతో ఆరంభమై ఆవును సంపాదించి తానేమి అనుభవించక పోయి నందున చివరికి ఆవును కొనాలనే చిరకాల కోరికతో ప్రయత్నించి అది నిష్ఫలం

కాపటంతో ముగుస్తుంది. హిందూమతంలో గోవుకున్న వైశిష్ట్యాన్ని తెలుపుతూ కథను హోరీ పాత్రను హృదయ విదారకంగా చిత్రించిన ప్రేమ్‌చంద్ రైతు లోకంపట్ల పల్లె జీవితం పట్ల తనకున్న సానుభూతిని పరోక్షంగా వ్యక్తీకరించాడు.

## కథా సంవిధానం

ఈ నవలలో హోరీ ఒక సామాన్యరైతు. గోవును భోలా నుంచి ఎలా సంపాదించటమా ? అన్న సమస్యతో కథ ప్రారంభమౌతుంది. లౌకికుడైన హోరీ ఆవును తనకిచ్చేట్లుగా ఒప్పిస్తాడు. ఆవును తోలుకొచ్చేందుకు గోబర్ భోలా యిల్లు చేరుతాడు ఇక్కడ గోవుకథ అంతర్థానమైపోయి వితంతువు ఝునియా కథ ఆరంభమౌతుంది. ఇందులో ఒక విధవరాలును ఒక యువకుడు ప్రేమించి యిల్లాలుగా చేసుకొన బోయే విధానం చక్కగా చిత్రితమైంది. సంఘ సంస్కరణలో ఒక భాగమైన వితంతు వివాహాన్ని ప్రోత్సహించే నిమిత్తం ఈ పాత్రల కల్పన చేశారు.

గోబర్ ఒక చేత్తో ఆవు పలుపును మరోచేత్తో ఝునియా చేయి పుచ్చుకొని నడుస్తున్నాడు. ఆ ప్రథమ స్పర్శలో వాళ్ళ బంధం ముడిపడింది. వియోగానికి తావీయకుండా యిద్దరు సంయోగమైనారు.

శిస్తు చెల్లించే రోజుల్లో రైతులు పొందే బాధలు, శిస్తు కట్టేందుకు రైతులు చేసే యత్నాలు యిందు వివరిస్తుంటే, ఆ వివరణ ప్రేమ్‌చంద్ గుండెలోతుల్ని తడవి చూపుతుంది. ఆషాఢ మాసం చివరిలో ఒక పెద్ద వర్షం కురిసింది. రైతులు రెండో పంటకు సన్నాహాలు చేసుకుంటుంటే జమీందారు నుండి పాత అప్పులు చెల్లించకపోతే రెండో సాగు చెయ్యడానికి వీలు లేదని ఉత్తర్వు అందింది. రైతు జనం కలవరపడ్డది. హోరీకి అప్పులున్నందున మళ్ళీ అప్పు పుట్టదని విచారిస్తున్నాడు. చివరికి ఝింగురసింగ్ వద్దకు వెళ్ళి దండం పెట్టి కష్టాలు చెప్పుకుంటాడు. ఆవును దక్కించుకోడానికి అవకాశమొచ్చిందని సింగు అప్పు కంటే ఆవును అమ్మివేస్తే నజరానాలు లేకుండా రొక్కం వస్తుందని అంటాడు. హోరీ ఆవును అమ్మేందుకు మనసొప్పక యింటికి వెళ్ళి మాట్లాడి వచ్చింతర్వాత చెప్తానంటాడు ఇంటికి వస్తాడు హోరీ.

పాపం ఆ రాత్రే ఆవు చచ్చిపోతుంది. మున్సబ్ రిపోర్టు మీద ఇన్స్పెక్టర్ వచ్చి ఎవరిమీద అనుమానమని హోరీని అడుగుతాడు. ధనియా ఆవేశంతో హీరాయే మందు పెట్టి చంపాడంటుంది. తమ్ముని గౌరవం కాపాడమని హోరీ శాస్త్రిని వేడుకుంటాడు. గ్రామ పెద్దలంత ముప్పై రూపాయల లంచం ఇచ్చి పంపిద్దామని సింగును అప్పుగా హోరీకి ఇచ్చేట్లుగా ఏర్పాట్లు చేస్తారు. సింగు ఇచ్చినడబ్బుతెచ్చి ఇన్స్పెక్టర్ వద్దకు చేరిన హోరీని చూచి ధనియా ఆవు చచ్చింది చాలదా ? ఇంకా యీ డబ్బు కూడా తగలెయ్యడమెందుకు ? అని క్రాధురాలై లేచింది. మనకెవళ్ళ అప్పు యివ్వనవసరంలేదు, కావలసినప్పుడు అప్పిచ్చేదాతలు కనబడలేదు గాని యిప్పుడెక్కడనుంచి డబ్బు వచ్చిందో అంతా తెలుసు నాకు. వాటా లేసుకుందామని గ్రామ పెద్దలిచ్చారు. "పేదల నెత్తురు తాగే వారందరూ ఊరిపెద్దలే" అని ధనియా వాళ్ళ నిజరూపాలు బయట పెట్టింది [14] ఊరి పెత్తందార్లు పెదవి కదపలేదు. ఇన్స్పెక్టర్ ముఖం ఎర్రబడింది.

రెండవ భాగం కథ ప్రేమ్‌చంద్ సామాజిక స్పృహను సంఘ సంస్కరణను తెలియపరుస్తుంది. గోబర్ ఝునియాను వెంటపెట్టుకొని ఇంటికి బయలుదేరుతాడు. తానుచేసిన ఈ పనికి తల్లి దండ్రులు తిట్టినా తర్వాత చేరదీస్తారుకాని సంఘం ఊరుకోదుగదా? కులంగాని పిల్ల అందులో విధవరాలు పైగా వట్టిమనిషి కాదు ఇదంతా ఆలోచించేసరికి తలదిరిగింది గోబర్‌కు. ఝునియాను ముందు తన ఇంటికి వెళ్ళమని తాను తర్వాత వస్తానంటాడు. ఇంట్లోకి చేరిన ఝునియాను చూచి ధనియా చివాట్లు పెట్టి గెంటివేయబోయింది. కాని చచ్చినా కదలనంది ఝునియా తర్వాత హోరీ వచ్చి ఆప్యాయతచూపిస్తాడు. ధనియా ఝునియాను ఆదరిస్తుంది. దీనితో కథ విచిత్రరూపం చూపిస్తుంది. ధనియా విధవరాలునుతెచ్చి ఇంట్లో పెట్టుకున్నదని ఊరిపెద్దలు హోరీని వెలివేస్తారు. సంఘమర్యాద పాడుచేసే వాళ్ళని, కాపాడని వాళ్ళని ఏం చెయ్యాలో సంఘానికి తెలుసు. వందరూపాయలు, ముప్పైమణుగుల ధాన్యం తప్పువేశామని పంచాయితీచెప్పివేసింది. అయినా హోరీ ఈ విషయంలో జంకలేదు. ఇంట్లోఉన్న ధాన్యం యిచ్చుకోగా యింకా ఎనభై రూపాయలు కట్టవలసి ఉండి ఇల్లుతాకట్టుపెట్టి ఆ "తప్పు"ఘా_ర్తిగాచెల్లించుకుంటాడు. భోలా ఆవును యిచ్చిన బాకి అయినా చెల్లించమంటాడు. లేదా ఝునియాను యింట్లో నుండి వెళ్ళగొట్ట మంటాడు హోరీతో. కాని కొడుకుకోసం

హోరీ దుక్కి టెడ్లను వదలుకుంటాడు. నాగటి ఎద్దులు కోల్పోయిన కారణంగా పొలం శాస్త్రి (దాతాదీన్)కి పాలిక్రింద యిచ్చివేసి కూలికి కుదురుతాడు హోరీ. ఈ కూలికూడా వెనుక ఎప్పుడో యిచ్చిన రూపాయల వడ్డీక్రింద చేయించు కుంటాడు శాస్త్రి. పొలంలో పనిచేస్తూ స్పృహతప్పిపడిపోతాడు హోరీ. ఆ రోజే గోబర్ పట్నంనుంచి యింటికి వస్తాడు. పూర్తిగా కోలుకోకముందే పనికి రమ్మని హోరీని శాస్త్రిబలవంత పెడతాడు. ఇది సహించక గోబర్ ఒక వంద అప్పివ్వటం వడ్డీక్రింద బ్రతికినంతకాలం కూలినాలి లేకుండా చాకిరీ చేయించు కోవటం ఇది వడ్డీ వ్యాపారమా? నెత్తురు తాగటంగాని అని ఉద్రేకంలో లేచి ఇట్లాగే కదా మీరు రైతుల్ని దోచుకొని చివరికి కూలాళ్ళను చేసింది. అప్పులుంటేచెల్లిస్తాంకాని నీకేమీ బానిసలం కాదంటాడు. శాస్త్రి కిమ్మనకుండా వెళ్ళిపోతాడు[15] గోబర్ తల్లి దండ్రులతో కీచులాడి పట్నం వెళ్తాడు పంచదార మిల్లులో పనికికుదురుతాడు.

ఇక్కడ ప్రధానకథను తెరవెనుక్కి నెట్టి ఉపాంగ కథను పోషిస్తాడు ప్రేమ్‌చంద్. సిలియా ఒక మాలెత. మాతాదీన్ (బ్రాహ్మణుడు) ఈ సిలియాను మనస్ఫూర్తిగా ప్రేమిస్తాడు. సిలియా త్రికరణ శుద్ధిగా ఆతనికి అంకిత మౌతుంది.

శాస్త్రి వరికుప్ప నూరుస్తున్నాడు. అతనికొడుకు మాతాదీన్ ప్రేమించిన సిలియా ఆ కళ్ళంలో పనిచేస్తుంటే ఆమె తల్లిదండ్రులువచ్చి ఆమెను రమ్మం టారు. కాని ఆమె తాను నమ్ముకున్న వాని నీడనే ఉంటానంటుంది. చివరికి మాలలు మేము మీ కులంలో ఎట్లా కలపం. నిన్నే మాకులంలో కలుపుకుంటామని మాతాదీన్‌ను కులం చెరుస్తారు. మాతాదీన్ మాలలుచేసిన పనికి కోపం తెచ్చుకొని సిలియాతో బంధాన్ని తెంచుకోచూస్తాడు వెంటబడి వస్తున్నా సిలియాను త్రోసి వేస్తాడు. అటుగా వచ్చిన హోరీదంపతులు సిలియా దీనస్థితిని చూచి ఆమెను చేర దీస్తారు. అస్పృశ్యతాభావం మానవతావాదియైన హోరీకి లేదనే విషయం యిందులో రచయిత నొక్కిచెప్పాడు. సిలియా సామాన్య స్త్రీ కావచ్చు కాని ఆమెకు మంచి మనస్సుంది. హోరీ కూతురు సోనాకు సంబంధం కుదిర్చింది. రాయబారిగా మధు దగ్గరికి వెళ్ళి కట్నం లేకుండా పెళ్ళికి ఆమె ఒప్పించింది. ఈ ఉదంతంద్వారా ఆదర్శంగా జరిగే పెళ్లిళ్ళు జరగాలనే రచయిత ఆశయం బయట పడుతుంది.

సిలియా కొడుకు రాముడు రెండేళ్ల వాడౌతాడు. మాతాదీన్ బాలుణ్ని లాలించాలని సిలియా యింటి వైపు వస్తాడుకాని సంఘానికి వెఱచి వెనక్కి వెళ్తుంటాడు. రాము చనిపోయాడనితెలిసిన మాతాదీన్ సంఘాన్ని లెక్కచేయ కుండా తన కొడుకును స్వయంగా తీసుకువెళ్ళి ఖననం చేస్తాడు. తన కర్తవ్యం పూర్తి చేసేవాడే బ్రాహ్మణుడు చెయ్యనివాడు మాదిగ అని సిలియాను అనుస రించి ఆమె యింటోనే ఉండిపోతాడు మాతాదీన్.

చివరి భాగంలో సాంఘిక దురాచారాన్ని ఎత్తిచూపాలనే ఉద్దేశంతో కథను మలుపు తిప్పాడు ప్రేమ్‌చంద్. మనిషి దురాచారానికి పాలుపడేందుకుగల పరిస్థితులు వానివల్ల ఆత్మ విశ్వాసం కోల్పోయే విధానాన్ని ఆయన బాగా చిత్రించుతాడు. ఈ దశలో హోరీ స్థితి చాలా అధ్వాన్నంగా ఉంటుంది. హోరీ చేసిన అప్పులేవీ తిండికోసం గాదు కేవలం మర్యాదకోసమే. నొఖేరాంబాకీ చెల్లిం పుకు హోరీమీద బెదఖలా దావావేస్తాడు. పొలందక్కించు కోవటానికి శాస్త్రి సలహామీద హోరీ తనంత వయస్సున్న రాంసేవక్ నకు రూపాను యిచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటాడు. ఇది సాంఘిక నేరమౌతుంది. కాని గత్యం తరంలేదు. జీవితంలో జరిగే సంఘటనల్లో అపజయమే పొందుతున్నాడుహోరీ. ఈ కార్యం వల్ల పిల్లకు పెళ్లి తనకు తాతలనాటి స్థిరాస్తి దక్కుతుంది. ముహూర్త నిశ్చయంతరువాత పెళ్లికూడా అయిపోయింది.

హోరీ చిరకాలకోరిక ఆవును యింటిముందుకట్టటం, ఆవును కొనాలనే కోరికతో రోడ్డులేసేపనిలో కూలికి కుదురుతాడుహోరీ. పనిలో ఒకనాడు చేతగాక చెట్టుకింద నడుంవాలుస్తాడు. తలంతా తిరుగుతుందనటం, వాంతి చేసుకోవటం ప్రారంభమవుతుంది. ఇంతలో యింటికి కబురందగానే ధనియా వస్తుంది. ధనియాతో "బ్రతికుండగా ఆవును కొనుక్కోలేకపోయాను. — — ఏడవబోకు ధనియా" అంటుండగా కళ్ళు మూతలు పడినాయి. కొనఊపిరితో ఇల్లుచేరు స్తారు.[16] గోదానం చేయించాలి. ఇంటో ఆవులేదు. ఇంట్లో ఉన్న రూపాయి పావలే (20 అణాలు) గోదానంగా చేయించుతారు

ఈ నవలలో జమిందార్ల అధికారాలు, పెత్తందార్ల అత్యాచారాలు విపులంగా వివరించబడ్డాయి. అసలు న్యాయం, ధర్మం వారిలో ఉన్నట్లు కనిపించనే కన

పించదు. దయాదాక్షిణ్యాలు లేని కసాయి వారుగా కనిపిస్తారు. వీళ్ళకు నీతంటూ లేకుండాపోయింది. వెట్టిచాకిరి చేయించుకుంటారు. లంచాలు తీసుకుంటారు. ఏదో మడత పేచీ పెట్టి డబ్బులు గుంజుతుంటారు. అయినా వీళ్ళ దాహం తీరదు. చివరికి స్థిరాస్తులు కాజేసి రైతులను కూలీలుగా చేసి భూములకు కామందులై కూర్చుంటారు ఈ నవలలో హోరీ వంటి బీదరైతులలో న్యాయం, దయ ఏవిధంగా చోటు చేసుకున్నాయో స్పష్టంగా కనబడుతుంది. అన్యాయంగా సంఘం కట్లు బొట్లంటూ హోరీ మీద జుల్మానా వేసిన గ్రామ పెద్దలకు అక్రమంగా దావా వేసి డిక్రీ పొంది పంటంతా కైవసం చేసుకున్న మంగ్రూ శావుకారి బేదఖలి దావాను వేసి డబ్బురాబట్టుకొన్న నోఖేరాంలను వారి అవినీతిని ఎత్తిచూపాడు-ప్రేమ్‌చంద్. కులమతాల అడ్డుగోడలు కూలి ఝునియాను హోరీరాం చేరదీయడం సిలియా ఇంటికేవెళ్ళి బ్రాహ్మణత్వాన్నే మాతాదీన్ త్యజించటం వంటి విషయాలు అందరికి సమ్మతమయ్యేట్లుగా చిత్రించాడు. భారతనారికి సాహిత్యంలో సముచితమైన స్థానం కల్పించాడు ప్రేమ్‌చంద్.

సామాన్య జీవితానికి కొలతబద్ధ రైతు జీవితం. ఆ రైతు జీవితం ఎట్లా మారిందో, ఆరైతు జీవితం యొక్క భూతభవిష్యద్వర్తమానాలు ఎలాంటివో "గోదాన్" నవలలో సాక్షాత్కరిస్తాయి. అంతటి జీవితాత్మకమైన నవలను రచించేందుకు జీవితాన్ని ఎంతగానో కాచి తరిచాడు ప్రేమ్‌చంద్. భూస్వామ్య వ్యవస్థలో పడి సాలెగూళ్ళలో వలె చిక్కి చివరికి కూలిబ్రతుకే వెళ్ళబోయవలసి వచ్చినరైతు స్థితిని వాస్తవంగా చిత్రీకరించాడు.

మాలపల్లి గోదాన్ నవలల ఇతివృత్తం, పాత్రలు, కథాసంవిధానం, భాషా శైలులు మొదలైన అంశాల పరిశీలనప్రయత్నం ఈ ప్రకరణంలో జరిగింది.

## పాద సూచికలు

1. దేశంలో 'మాలపల్లి' కలిగించిన సంచలనం బంగొరె "మాలపల్లి పై ప్రభుత్వ నిషేధాలు" అనే పరిశోధన గ్రంథంలో సపాక్ష్యంగా ప్రదర్శింపబడింది.

2. (ధనికులే కలియుగరాక్షసులు) ఈ రాక్షసత్వం బీదల హింసించటంవల్ల వాండ్లకు కలిగింది. ధన భారమే వాండ్లను కుర్రంగదీస్తుంది. వాండ్ల ఆత్మలు, దేహాలు కూడా దుష్కర్మలవల్ల వికృపమును పొందుచున్నది....శవం కనబడంగానే పోలీసు గద్దలు వాల్తావిగా వాటిని వెళ్లగొట్టే ఏర్పాటుచేస్తాం....ఈ మాటలను బ్రిటిషు ప్రభుత్వం ఈ నవలలో ఉండకూడదని నిషేధించింది. "మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు" పేజీలు—66—68.

3. శిక్షవేసిన తర్వాత నౌకరీ వదలు కొంటామంటారు న్యాయమూర్తులు. చూడు. "మాలపల్లి ఒక సమీక్ష". యం. వై. రెడ్డి. స్రవంతి 1972.

4. సామాన్యులకు భక్తియోగం అలవడినట్లు జ్ఞానయోగం అలవడదు. ప్రజా సామాన్య స్థాయికి దిగిన వేదాంతం అచలబోధ.

5. 'మాలపల్లి' పేజి. 355

6. "చంపాలెనని ఉద్దేశం లేకపోయినా చచ్చేటట్లుగొట్టాను" 'మాలపల్లి' పేజి 233

7. అప్పటి కాలంలో గుంటూరు ప్రాంతంలో బంజరుభూముల కోసం దిగువ జాతులు పోరాడాయి.

8. చూడు "సాహిత్యంలో దృక్పథాలు" పేజి 66 ఆర్.ఎస్. సుదర్శనం. నవోదయ పబ్లిషర్స్. విజయవాడ 1968.

9. "మాలపల్లి-జగ్గడి పాత్ర" సంజీవమ్మ.అభ్యుదయ. పేజి 19మార్చి1980

10. కొరకొరలాడే స్వభావం కాకపోయినా తమ్ముడి దుర్మరణం, దానికి ప్రతి క్రియలేకపోవడం అతని మనస్సులో నాటి అస్వభావికమైన ద్వేషమును పురిగొల్పినవి. 'మాలపల్లి' పేజి 357.

కె.వి. రమణారెడ్డిగారు జగ్గడు రాబిన్‌హుడ్‌ను జ్ఞప్తికి తెస్తున్నాడని చెప్తూ అప్పటికి కమ్యూనిస్టు మన దేశంలో వేళ్ళూనలేదన్నారు. అతను కమ్యూనిస్టు కాదన్నాడు. నిజమే నాటి పరిస్థితులలో స్పష్టాస్పష్ట కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని నమ్మి ఆయుధం పట్టి పోరాడిన ఉగ్రవాది అనవచ్చు.

11. ఆర్. ఎస్. సుదర్శనంగారు సుభాసుకు ప్రతినిధి అన్నాడు. పోల్చుకోవటం కష్టం. జగ్గని చేష్టలు అల్లూరివి. అన్ని స్థావరాలు ఆంధ్రలోనివిగా గుర్తిస్తే చారిత్రక బలం ఉంటుంది.

12. 'మాలపల్లి' పేజి 609.

13. ఇదంతా సమాజాన్ని ముందుకు తీసుకొని పోవటానికి తాత్త్విక దృక్పథాన్ని ఏర్పరచటానికి ప్రయత్నం. చూడు "తాత్త్వికత" యం వీరభద్రయ్య 'మననవల-పరిశీలన' పేజి. 47 చైతన్య సాహితి, వరంగల్. 1979

14. 'గోదాన్' (తెలుగు) పేజి 88. అట్లూరి పిచ్చేశ్వరరావు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్—విజయవాడ. 1981

15. చూడు. గోదాన్ (తెలుగు) పేజి 230.

16. చూడు. గోదాన్ (తెలుగు) పేజి 380.

# 4. తులనాత్మక పరిశీలనం

మాలపల్లి—గోదాన్ నవలల కథలు వేరైనా పాత్రలు స్వభావానుభవాలు, ఎదుర్కొన్న పరిస్థితులు రెండింటిలో ఒకే తీరులో ఉన్నాయి. ఇందలి కథా వస్తువులను, పాత్ర చిత్రణలను సాంఘికార్థిక, రాజకీయాలను, తులనాత్మక దృష్టితో పరిశీలించటం ప్రకృతాంశం.

ఈ నవలల రచనాకాలం నాటికి దేశంలో సాంఘికంగా, రాజకీయంగా కొత్త మార్పులు రాసాగాయి అటు ఆర్థిక రంగంలో ఇటు మత పరంగానూ నూతన పరిణామాలు కనిపించసాగాయి. గొప్ప, బీద, ఎక్కువ, తక్కువా తేడాల గురించి చర్చలు మొదలైనాయి. విప్లవాత్మకమైన మార్పులకి కావల్సిన లక్షణాలు కనిపించసాగాయి. సాంఘికంగా విభిన్న శక్తుల మధ్య ఘర్షణ మొదలై విప్లవాత్మకమైన భావాలు పొడసూపుతున్నప్పుడు ఆశక్తిని మరింత ప్రస్ఫుటం చేస్తూ ప్రజలందరికి అవగాహన అయ్యేట్లు చేసే మార్గదర్శులు ఆ సంఘం నుంచే ఉద్భవిస్తారు. ప్రేమ్‌చంద్ ఉన్నవలు అలాంటివారే అని చెప్పాలి.

మున్షీ ప్రేమ్‌చంద్ ఉత్తరప్రదేశ్‌లో, ఉన్నవ లక్ష్మీనారాయణ ఆంధ్ర దేశంలో పుట్టిపెరిగారు. వీరిద్దరి రాష్ట్రాలు వేరైనా ఒకరిని ఒకరు ఎరుగక పోయినప్పటికి తమనవలల్లో వారవలంభించిన దృక్పథం, వారు దర్శించిన చిత్రం ఒక్కటే. భారత రైతాంగాన్ని ప్రేమ్‌చంద్, ఉన్నవలు చక్కగా అవగాహన చేసుకున్నారు. వారిద్దరు గ్రామంలోని సామాన్యుల బ్రతుకులను, వారి ఆలోచనా రీతుల్ని, భావధోరణులను, వైరుధ్యాల్ని నిశితంగా పరిశీలించి అవగతం చేసుకున్నారు. గ్రామాన్ని పట్టణాన్ని ఒకవాస్తవిక పద్ధతిలో వర్ణించే, అపూర్వ పద్ధతిని అవలంభించారు. అదేమంటే రైతుల జీవితాల్ని, కార్మికుల జీవితాల్ని, వారిపోరాటాల్ని భావసంచయాన్ని సాహిత్య వస్తువులుగా ఎంచుకున్నారు. ప్రతో

ధాత్మకమైన తాత్విక సంబంధమైన వచన సాహిత్యాన్ని ఆధారంగా తీసుకొని ప్రజలకత్యంత సన్నిహితమైన ఆధునిక రూపాల్ని ఇతివృత్తాలను ఎన్నుకొని చాలావరకు విజయం సాధించారు. ఉన్నవ తెలుగు సాహిత్యంలో మొదటి సారిగా వ్యావహారికంలో స్పష్టమైన, సులభమైన శైలిని రూపొందించుకొని తన పంథాను తొక్కితే, మున్షీ ప్రేమ్‌చంద్ వాడుక భాషలో అతిసులభమైన శైలిని రూపొందించారు[1] సామాన్యుని నిత్య వ్యవహారంలోని భాష ఎంతశక్తివంతమైందో వీరి రచనల ద్వారా తెలియచేశారు. ముఖ్యంగా వీరు అందరికి అర్థమయ్యేరీతిలో రాయాలనే పట్టుదలతో నవలలు రాయటం విశేషం. తర్వాతి తరం రచయితలు ఈ పద్ధతిని నమూనాగా తీసుకొని నవలలు రాశారు.

సాహిత్యం సమకాలీన పరిస్థితులకు దర్పణంగా ఉండాలి. హిందీ తెలుగు సాహిత్యాల్లో ఎవరైనా ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించారా అని మనం అనుకుంటే అందుకు ముందు ఉన్నవ, ప్రేమ్‌చంద్‌లను చెప్పవలసి ఉంటుంది. వారు తమ రచనల్లో నాటి క్రౌర్యాన్ని, కులద్వేషాల్ని, భూస్వాముల జమీందార్ల అమానుషత్వాన్ని వర్ణించారు. 1922 లో వెలువడ్డ 'మాలపల్లి' 1936 లో వెలువడ్డ 'గోదాన్'లు ఈ కారణంగానే ప్రజలను ఆకర్షించాయి. 1921 ప్రాంతాల్లో మార్క్స్ సిద్ధాంతాలవల్ల రష్యా విప్లవ ప్రభావంవల్ల ఆకర్షితులై రచనలు చేసిన వారు మనదేశంలో అప్పటికి ఉన్నవ, ప్రేమ్‌చంద్‌లు మాత్రమే. ఆనాటికి మనదేశం మొత్తంమీద రష్యా విప్లవ ప్రభావాన్ని మార్క్స్ సిద్ధాంతాలను ప్రస్తావన మాత్రంగా వర్ణించిన మొదటి నవల 'మాలపల్లి'. గోదాన్‌పై కూడా బోల్షివిజం ప్రభావం ఉంది. అక్టోబర్ విప్లవం నుంచి మన స్వాతంత్ర్య సాధనకు అవసరమైన స్ఫూర్తిని ఈ రచయితలు గ్రహించి తమ రచనల్లో చొప్పించారు. మానవ జీవితానికి సంబంధించిన సకల సమస్యల్ని తమరచనల్లో చూపించారు. గ్రామ జీవితం ద్వారా మానవ సంబంధాలన్నింటిని కళాత్మకంగాను, వాస్తవికంగాను చిత్రించారు. యూరపు నాగరికతలో అభివృద్ధి పొంది 20వ శతాబ్దారంభములో వలస రాజ్యాల్లో ప్రవేశించి ఆయా దేశభాషల్లో బలపడుతున్న నవలా ప్రక్రియను దాని కాల్పనిక (*Romantic*) లక్షణం నుంచి తప్పించి వాస్తవిక దృష్టితో పీడిత ప్రజల సాంఘికార్థిక, రాజకీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల అభ్యున్నతికి ప్రేరకంగాను, నూతన సోషలిస్టు ప్రపంచ దృక్పథ ప్రదర్శకంగాను విలక్షణంగా ఒకపెద్ద మలుపు తిప్పిన భారతీయ నవలా రచయితల్లో ప్రేమ్‌చంద్

ఉన్నవలను, వారినవలలను ప్రక్క-ప్రక్కనే చెప్పాలి. హిందీ, తెలుగు నవలా వాఙ్మయానికి సామాజిక స్పృహ కలిగించారు. హృదయాన్ని స్పందించే చైతన్య స్వరూపమైన దేశభక్తి కథలను వెలయించి నిద్రాణమైన జాతిని మేల్కొలిపి దేశ దాస్య శృంఖలాల నుంచి విముక్తి చేయడానికి కంకణం కట్టుకున్నారు.

గోర్కి-లెనిన్ యుగాన్ని నడిపిస్తే వీరు గాంధీశకాన్ని ముందుకు నడిపిస్తారు. భౌతిక వాదాన్ని ఆధారం చేసుకొని గాంధీవాదాన్ని రెక్కలుగా చేసుకుని భావ జగత్తులో వారు విహరిస్తారు.

గాంధీజీ ఒక సందర్భంలో ప్రేమ్‌చంద్‌ను గూర్చి ఇలా అన్నారు.

"మనదేశం స్వాతంత్ర్యం సంపాదించుకొని గ్రామాల్లోని బాధలు, దారిద్ర్యం, అవమానం, అవిద్య, సమసిపోయిననాడు భారతదేశంలో ఒకప్పుడురైతు ఇలాంటి జీవితం గడిపేవాడంటే ఎవరూ నమ్మరు. వారు ప్రేమ్‌చంద్ ప్రఖ్యాత నవలల్ని కథానికల్ని చదివినట్లయితే ఆనాటి సమాజం ఎలాఉండేదో తెల్సుకో గలుగుతారు."[2]సత్యవాక్యం యిది.

ప్రేమ్‌చంద్ ఉన్నవలు మానవతామూర్తులు. వారు మతాలకు కులాలకు అతీతులు. వారివి ఎక్సరే కళ్ళు. సమాజాన్ని సహేతుకంగా పరిశీలించగలిగారు.

అందుకే నాటికి నేటికి సమాజాన్ని క్షుణ్ణంగానూ, సంపూర్ణంగానూ పరిశీలించిన నవలలు మాలపల్లి,గోదాన్‌లుమాత్రమే. ఇద్దరిరచనల్లో కథావస్తువుగ్రామ జీవితం. వీరి ఔన్నత్యం వీరువాడినభాషలోవుంది. పీడిత ప్రజానీకానికి సాహిత్యంలో చోటుకల్పించిన ఆద్యులు. హరిజనున్ని నాయకున్ని చేసి ఉన్నవ, సామాన్య రైతును నాయకున్ని చేసి ప్రేమ్‌చంద్ వాడుకభాషలో నవలలువ్రాసి సాహిత్య చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించారు. మూఢ విశ్వాసాలతోను, వెర్రి నమ్మకాలతోనూ కుళ్ళిపోయిన సమాజాన్ని మరమ్మత్తు చేయ డానికినవలలను ఆయుధంగా ఉపయోగించారు సంస్కర్తలయిన ఈ రచయితలు. సంస్కరణాన్నే గాదు సమాజానికి అవసరమైన ధర్మాన్ని ప్రతిపాదించాయి ఈ నవలలు. సామాజిక వాస్తవాలను సంపూర్ణంగా అధ్యయనంచేసి అపూర్వ కళాకౌశలంతో రచన చేసిన కారణంగా భారతీయ సాహిత్యంలో ఈ నవలలకు

సముచిత స్థాన మివ్వాలి రాజకీయ స్వాతంత్ర్యంకన్నా సామాజిక స్వాతంత్ర్యం కలగాలనే కోరికతో సంస్కరణోద్యమాన్ని తలపెట్టారు ఈ రచయితలు.

ఇద్దరూ తీవ్ర జాతీయవాదులు రచనల ద్వారా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని తమదేశభక్తిని వెల్లడిచేసారు. వీరి రచనలలోని పాత్రలద్వారా వ్యక్తం చేసిన దృక్పథాలు పరిశీలిస్తే గాంధీజీ ప్రభావానికి లోనై నెహ్రూ సోషలిస్టు వైపు తొంగిచూచి, బోల్షివిజం వైపుకు వారు పయనించారని దృఢ పడుతుంది. ఆనాటి విప్లవ వీరుల సాహసకృత్యాలను వీరు కొనియాడేవారు. ఖుదేరాంబోసు, ఫోటోను ప్రేమ్‌చంద్ తన యింటిలో పెట్టుకొంటే అన్నప్రగడ కామేశ్వరరావు హింసావాదాన్ని ఉన్నవ సమర్థించారు.[3]

ప్రేమ్‌చంద్ ఆదర్శవాది అనే అప్రథ ఉంది. ఉన్నవలో అది పూర్తిగా లేదు అనలేం కాని ప్రధానంగా ఆయన వాస్తవికవాది. అతను వరించింది సామాజిక వాస్తవం. ప్రేమ్‌చంద్ ఉన్నవల వ్యక్తిత్వం వారికళ రెంటికి చాలా దగ్గర సంబంధం ఉంది. వారు మానవత్వం మూర్తీభవించిన మేథావులు. కేవలం దళితవర్గాల గురించి నవలలురాయడమేగాక నిజ జీవితంలో అనేకమందిని ఆదుకున్నారు. ధనికులన్నా, ధనికజీవితమన్నా వీరికిగిట్టదు. గ్రామప్రజల దారిద్ర్యాన్ని, ఆకల్ని, అజ్ఞానాన్ని, మూఢనమ్మకాల్ని చిత్రించుటలోవడితిరిగిన చేతులివి. వీరు ఈ నవలలు వ్రాసేందుకు తమజీవితాల్నే ఎంతగానోకాచి తరచారు. బ్రిటిషు ప్రభుత్వ ఆనాడు ఈ నవలాకారులపై కన్నెర్రచేసిందంటే వారి రచనలు ఎంతశక్తివంతాలయినాయో, చైతన్యవంతాలయినాయో మనకు అర్థమవుతుంది. మాలపల్లిలో సెటిల్మెంట్లు, గోదాన్‌తో రైతులపాట్లు చారిత్రక వాస్తవాలుగా చిత్రితమయ్యాయి. పాఠకులు గతచరిత్రను తెలుసుకున్నవారౌతారు.

# 1. రైత్వారీ జమిందారీ వ్యవస్థలు[4]

భారత దేశాన్ని ఆంగ్లేయులు తమ ఆధీనంలోకి తీసుకున్న తర్వాత బ్రిటిషు ప్రభుత్వం కొన్ని రెవెన్యూ చట్టాలను ప్రవేశపెట్టింది. వారన్‌హేస్టింగ్స్ కాలంలో శిస్తు నేరుగా వసూలుచేయాలని వేలంపాట పెట్టించిపాడిన వారికి

రెవెన్యూ అధికారాన్ని కట్టబెట్టింది. ఈ పద్ధతివల్ల పోటీ ఎక్కువై రెవెన్యూ శిస్తులు అధికమయ్యాయి. ఈ భారం రైతు భరించవలసి వచ్చింది. దీనివల్ల రైతుకు సాగువిషయంలో ఆసక్తిలేకపోయింది. ఈ దశలో భూమిశిస్తును శాశ్వతంగా నిర్ణయించాలనే ఆలోచన బ్రిటిష్ప్రభుత్వానికి తట్టింది. వెంటనే శాశ్వత శిస్తు పద్ధతిని ప్రవేశపెట్టటానికి జమిందారీ, రైత్వారీ మున్నగుపద్ధతులను ప్రవేశపెట్టి, నియమనిబంధనలను ఏర్పరచి కచ్చితంగా అమలుచేసింది. ఈ నవలల రచనా కాలానికి ఉత్తరప్రదేశ్‌లో జమిందారీ, మద్రాసు ప్రెసిడెన్సి(ఆంధ్ర)లో రైత్వారీ పద్ధతి అమలుచేయబడింది.

## రైత్వారీ పద్ధతి

ఉత్తర భారతదేశంలోవలె దక్షిణ భారతదేశంలో పెద్దపెద్ద ఎస్టేట్లున్న జమిందార్లు లేరని భావించి బ్రిటిష అధికారులు జమిందారీ పద్ధతిని తప్పించుకోటానికి ఎత్తువేశారు. లీడ్, సర్‌థామస్‌మన్రోల సారథ్యంలో మద్రాసు అధికారులు వ్యవసాయదారులకే నేరుగా భూమి మీద హక్కు యిచ్చే పద్ధతిని సిఫార్సుచేశారు.[5] అంతేకాదు ఆ ప్రాంతం రైతుజమీందార్ల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉండాల్సిరావటంలో జమీందారు రైతుని పీడించేందుకు వీలయిందని అభిప్రాయపడ్డారు. వారు ప్రతిపాదించిన రైత్వారీ పద్ధతికింద రైతు సక్రమంగా భూమి శిస్తుచెల్లించినమేరకు అతనికి తాను సాగుచేసే భూమి మీద హక్కు ఏర్పడుతుంది.

182. వ సంవత్సరంలో శాశ్వత రెవెన్యూ సెటిల్మెంటు రైతుకు ఎంతో నష్టదాయకమని మద్రాసు ప్రెసిడెన్సీలో బ్రిటిష ప్రభుత్వం చట్టబద్ధంగా రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టింది.[6] రైత్వారీ పద్ధతి రైతాంగభూయజమాన్య వ్యవస్థని రూపొందించలేదు. ఇక్కడ జమీందార్ల స్థానంలో ప్రభుత్వంతూర్చొని భూమి శిస్తుని అక్రమంగా, అపరిమితంగా పెంచి వేసింది. రైత్వారీ పద్ధతి అమలుకాక పూర్వం భూమిశిస్తు వసూళ్ళను వేలం వేసేవారు. ఆయా ప్రాంతాలలో బలంగల వాళ్ళు "కౌలు"ను పొందగలిగేవారు. రైత్వారీ విధానంలో శిస్తును పంటలో మూడవవంతు, తర్వాత సగానికి పెంచి వేసింది. సైన్యంలో చేరాలనే వత్తిడి ఆనాటి రైతులమీద బాగా ఉండింది. అందుకే శిస్తు అధికంగా పెంచట

ప్రభుత్వం. భూమి శిస్తు అంటే భూమిని వాడుకున్నందుకు 'కౌలు' పైకమేకాని 'పన్ను'కాదని ప్రభుత్వం బాహాటంగానే ప్రకటించింది. శిస్తురేటు పెంచినందువల్ల కలిగిన దుష్ఫలితాలు వాటిని వసూలు చేసే కసాయి పద్ధతులవల్ల రైతులకు మరిన్ని కష్టాలు తెచ్చిపెట్టాయి.

రైత్వారీ పద్ధతి ప్రవేశ పెట్టినా కూడా ప్రధానంగా భూస్వామ్య విధానమే చలామణి అయ్యేది. ప్రభుత్వం రైత్వారీ ప్రవేశ పెట్టినప్పుడు ఫ్యూడల్ అధిపతులు తాము ప్రభుత్వానికి ఎంత శిస్తు కట్టగలరో అంత భూమిని పొందటానికి అనుమతింపబడ్డారు. బలం ఉన్నవారు 100 ఎకరాలు సంపాదించి ఫ్యూడల్ భూస్వాములు గానే ఉండిపోయారు. వాస్తవంగా దున్నే రైతు కౌలుదారు స్థితికి దిగజార్చ పడ్డాడు. రైత్వారీ పద్ధతులు సాగిన ప్రాంతాలలో రైతు మెరుగ్గా లేని కారణాలు—

(1) పండిన పంటలో 45% నుంచి 55% శిస్తుగా ఉండడం.

(2) భూమి శిస్తును పెంచే హక్కు ప్రభుత్వానికి ఉండడం.

(3) కరువులో కూడ పన్ను చెల్లించ వలసి ఉండడం.[7]

రైత్వారీ పద్ధతి అమలులో ఉన్న ప్రాంతాలలో భూస్వామి కౌల్దారు సంబంధాలు క్రమేణా వ్యాప్తి చెందాయి. శిస్తు భారమవడం మూలాన రైతు పొలం వదిలితే ఆ భూమి ధనిక రైతుల చేతిలోకి పోయేది. అంటే రైతు అప్పులుపాలై సంపన్న రైతులకు తమ భూములను కట్టబెట్టాడు. ఉన్న భూమి కాస్తా ఊడ్చుకు పోవడం వల్ల జమిందార్ల క్రింద కౌల్దారుగానో, భూకామందుల కింద చాకిరి చేసే కూలీలుగానో చేరారు.[8] కాలక్రమేణ ఈ క్రొత్త భూస్వామ్య విధానం రైత్వారీ ప్రాంతాల్లో వ్యావసాయ సంబంధాల్లో ప్రధానాంశం అయింది.

'మాలపల్లి' రచనా కాలం నాటికి ఆంధ్రలో వ్యవసాయిక సంబంధాలలో ధనిక రైతులదే పై చేయిగా ఉండేది. రైతును జమీందారు దోపిడి నుంచి నివారించడానికి రైత్వారీ పద్ధతి ప్రవేశపెట్టి ప్రభుత్వం దోచుకోవటం తమకు అండనిచ్చే ధనిక రైతులను దోచుకోనివ్వటం చేసింది.

అటువంటి రైత్వారీ వ్యవస్థలోని చౌదరయ్య తండ్రి సంపాదించిన భూమి రెండొందల ఎకరాల పల్లం, నూరు ఎకరాల మెట్ట పోను ఇంకా 500 ఎకరాల భూమిని అదనంగా సంపాదించాడు. ఆనాటి చిన్న రైతుల ఆర్థిక స్థితి క్షీణించటం వల్ల ధనిక రైతులకు తమ భూములను కట్ట పెట్టారు. బాకీల కింద కొన్ని, చౌక ధరలో కొన్ని భూములను కొని ఈ విధంగా చౌదరయ్య భూకామందు అయి 3 లక్షల కవిలె పెంచాడు. బ్రిటిషు చట్టాలు ధనిక రైతులకు మాత్రమే లాభించాయి.

కూలీల కూలి క్రొత్త పద్ధతుల్లో తగ్గించివేసి అధిక లాభాలను ఆశించటం ధనస్వామ్య లక్షణం. మాలపల్లిలో 'కూలీ' (17) అధ్యాయంలో చౌదరయ్య సంగదాసుల మధ్య 'కూలి'ని గూర్చి జరిగిన చర్చ రైత్వారీ వ్యవస్థ స్వభావాన్ని విశదంగా ప్రస్ఫుటీకరిస్తుంది. భూస్వామ్య వ్యవస్థ ధనస్వామ్యంగా మారుతున్న సంధి దశలో పెద్ద రైతు ధనదాహాన్ని, మరింత దోపిడికేర్పడుతున్న వినూత్న పద్ధతుల్ని ఇది సూచిస్తుంది. అయితే ఈ పద్ధతులు పుడుతున్నప్పుడే చైతన్యవంతులైన కొద్దిమంది నుంచి కొంత ప్రతిఘటన కూడ జాగృతమయింది.

తనకు తెలిసినంత వరకు ఎన్నడైనా డబ్బు కూలి యివ్వలేదని సంగదాసు అంటే, చౌదరయ్య. "డబ్బు యివ్వడం మనకు లాభమనుకో" అంటాడు[9]. దానికి వివరణగా అడ్డెడు జొన్నలు ఒక తవ్వెడు గింజలు నాలుగు కట్టలకు చొప్పకు మొత్తం కూలి రోజుకి పదకొండణాలు మదింపు వేయవచ్చునని చెప్తాడు. దేనిని బట్టి డబ్బు కూలి నిర్ధారణ చేస్తారని సంగదాసు అడిగితే, ఆరోజు ధరను బట్టి అని చౌదరయ్య చెప్తాడు. ధాన్యం యిస్తే ధరలను బట్టి కూలిని మార్చే అవసరం ఉండదని సంగదాసు అంటాడు. అన్ని ధాన్యాలు కూడా అడ్డడే తీసుకుంటారా? అని చౌదరయ్య తిరకాసు పెట్టబోతే సంగదాసు పొట్టు ధాన్యాలయితే అడ్డెడు తవ్వెడు కూలి వాళ్ళు తీసుకుంటారని అంటాడు వారిద్దరి చర్చ చాలా దూరం పోతుంది. ఆసామీలకు భూమిపై ఉన్నది జిరాయితీ హక్కేనని సంగదాసు అనగానే న్యాయంగా ఎంత ఇవ్వమంటావని చౌదరయ్య అడిగితే సంగదాసు కూలి తగ్గించి ఇస్తే కూలి వాడు ఎట్లా బ్రతుకుతాడని ప్రశ్నిస్తాడు. తప్పుకోటానికి చౌదరయ్య "కూలి వాడ్లంతా యెట్లా జీవిస్తారో మాకవసరం లేదు'' అని నిర్మొహమాటంగా చెప్తాడు. భూకామందు లాభాలు తప్ప కూలీల శ్రేయస్సు పట్టించుకోడని

టానికి ఈ మాట చాలు. శ్రమను దోచుకోటానికి కూలీని డబ్బు రూపంలో మార్చే ఎత్తు కాకుండా కడుపు నిండా అన్నం ఉంటే పనిచేస్తాడటోయి? వొక పక్క కాస్త కాలుతుంటే పనికోసం దేవులాడుతాడు. కడుపు నిండితే పని మట్టే అంటాడు చౌదరయ్య[10]. కాలే కడుపులను సృజించి ఉత్పత్తులను మరీ పెంచుకునె బాపతు చౌదరయ్య. 88% కూలీలు ఈ ధనిక రైతు వల్ల బ్రతుకుతున్నారంటే ఎంత తీవ్రంగా శ్రమ దోపిడి జరుగుతుందో తెలుస్తూనే ఉంది.

జమీందారీలో వలెనే రైత్వారీలో కూడా ధనికులు కోర్టులను తమ గుప్పిట్లో పెట్టుకున్నారు. డబ్బు బలంతో ధనిక రైతు చౌదరయ్య ఖరీదైన కోర్టు లావాదేవీల్ని తనకు అనుకూలంగా తిప్పుకునే సౌకర్యం కలిగింది. సునాయాసంగా డిక్రీని పొంది రామదాసు ఏడు ఎకరాల మాగాణిని, ఆరు ఎకరాల సావరమును యింకా యిల్లు చరాస్తులను కాజేస్తాడు. బ్రిటిషు వారు భూమి బదలాయింపుని ప్రవేశ పెట్టి ధనిక రైతుకి ఈ విధంగా మేలు చేసింది. రైతుల ఆర్థికాభావం ఉపయోగించుకొని చౌదరయ్య తేలికగా కొరుకుడు బడిని చట్టాన్ని మెలికలు తిప్పి తనకనుకూలంగా న్యాయ నిర్ణయం జరిగేట్లు చేసుకోగలిగిగాడు.

## జమీందారీ పద్ధతి

మొగల్ చక్రవర్తుల కాలంనుంచి మన దేశంలోని ఉత్తరప్రదేశ్, ఆంధ్రలో సర్కారు ప్రాంతాలు జమీందార్ల పాలనలో ఉండిపోయాయి. ప్రతి జమీందారుకు జమీభూములమీద శిస్తువసూలు అధికారమే గాక వారి సర్వాధికారం కలిగిన హవేలీ భూములు కూడా ఉండేవి అయితే 1802 లో కంపెనీవారు జమీందారీ ప్రాంతాలలో పర్మినెంటు రెవెన్యూ సిటిల్మెంటును అమలు చేశారు. భూమిక్ని సంబంధించిన హక్కు ప్రభుత్వానికి శిస్తు వసూలు చేసి పెట్టే జమీందారుకు కల్పించారు అసలు ఈ జమీందారీ వర్గాన్ని సృష్టించింది ఆనాటి ప్రజావిప్లవాన్ని ఎదుర్కొనేందుకనేది మనకు స్పష్టపడుతుంది. ఈ పద్ధతి వల్ల జమీందార్లు అమాంతం పెద్ద భూకామందులుగా మారారు.

అంతేగాదు జమీందారీ వర్గాన్ని సృష్టించటం వంశ పారపర్యంగా హక్కులు కల్గించటం లాంటి శాశ్వత ఏర్పాట్లు చేసారు. మరోప్రక్క భూమిని సాగు చేసే రైతులు కౌలుదార్ల స్థాయికి దిగజారి పోయారు. భూమి మీద వాళ్లకు

దీర్ఘకాలిక హక్కు అనాదిగా వస్తున్న ఇతర సాంప్రదాయిక హక్కులు చెల్లి పోయాయి, భూస్వామ్యమంతా ఆసామీలకు గాక మధ్యవర్తులకు అంటే జమీం దార్లకు హస్తగతమయినాయి. జమీందారీలో రైతుకు ఉన్నదల్లా నామమాత్రం కౌలు హక్కు. కౌలుదార్లు జమిందార్ల దయాదాక్షిణ్యాలకు లోబడి పోయారు. వందల కొలది ఎకరాలకు కౌళ్ళు పొందిన ఈ పట్టాదార్లు కేవలం తనఖీ దార్లయి నారు. వ్యవసాయంవల్ల వచ్చేలాభం విశేషంగా ఈ తనఖీదార్ల ఖజానాలోకి పోతుంది. భూమి దున్నే ఆసామీ జనానికి గింజలు చేసే యంత్రమయినాడు. మొత్తం ఫలసాయం 100 అనుకుంటే అందులో ప్రభుత్వంవాటా 15. నిజంగా రైతుకు మిగిలింది 40. బ్రిటిషు వారు ప్రత్యేక హక్కులనుభవించే సంపన్న జమీందారీ వర్గానికి ప్రాణప్రతిష్ఠ చేశారు. ఈ శాశ్వత శిస్తువిధానం స్థిరమైన రాబడిని గ్యారంటీ చేసింది. కొత్తగా సృష్టించిన జమీందారీ ఆస్తి దీనికి హామీగా నిలబడింది. జమీందార్లను అడ్డు పెట్టుకొని శిస్తు జుర్రుకోవటం బ్రిటిషు వారికి తేలికగా కనిపించింది.

జమీందార్లు విపరీతంగా శిస్తు పెంచేశారు. అక్రమ వసూళ్ళకు పాల్పడి రైతుల్ని తిప్పలు పెట్టారు. రైతులచేత వెట్టిచాకిరీ చేయించుకున్నారు. ఇంకా అనేక రకాలుగా రైతుల్ని పీడించుకుతిన్నారు.

శిస్తు కట్టలేని అశక్తత వల్ల రైతు ఎప్పుడూ వడ్డీ వ్యాపారస్తున్ని ఆశ్ర యించేవాడు. ఒకసారి అప్పుల్లో పడ్డాడంటే బైటపడటం కల్ల. నూతన న్యాయ విధానం, నూతన శిస్తు విధానం వడ్డీ వ్యాపారస్తులకు గొప్పలాభం చేకూర్చి పెట్టాయి. చట్టం వడ్డీ వ్యాపారి చేతుల్లో అపరిమితమైన హక్కులుంచింది. ఇల్లు జరగాలంటే కూడా రైతు వడ్డీ వ్యాపారినే ఆశ్రయించాడు.

'గోదాన్' రచనా కాలం నాటికి ఉత్తర భారతంలో జమీందారీ వ్యవస్థ పటిష్ఠంగా ఉంది. రాయ్‌సాహెబ్ (జమీందారు) కు యాజమాన్య హక్కు బదిలీ చేసే అధికారం లభించటంవల్ల హోరీ లాంటిరైతులు కౌల్దారు స్థాయికి దిగజారి పోయారు. హోరీ జమీందారు దయాదాక్షిణ్యాలమీద ఆధారపడక తప్పని పరి స్థితి, గ్రామపంచాల అదుపాజ్ఞలో కూడ హోరీ నడుచుకోకతప్పలేదు. జమీందారీని కాదంటే భూమి దక్కదని, పంచులను కాదంటే పుట్టగతులుండవనే నమ్మకం

జీర్ణించు కొన్న వ్యక్తి హోరీ. ఈ పంచుల మీద అజమాయిషీ జమీందారుదే. అందుకే జమీందారు నుంచి పంచ్ వరకున్న సమస్త వ్యక్తుల చేత ఆర్థిక దోపిడి పాలౌతాడు హోరీ. పట్వారీకి నజరానా, జమీందార్ల ఏంజట్లకు మామూళ్లు, జమీందారుకు నాగటికి 2 రూపాయిలు చందా ఈ విధంగా హోరీ ఎన్నో ముదుపులు చెల్లించుకోవలసి వచ్చేది. హోరీ తన నాలుగు కుంటల భూమికి రు. 25లు శిస్తు కట్టేవాడు. శిస్తు కట్టలేక పోతే రెండో పంట కాలానికి వడ్డీతో సహా వసూలు చేసుకునేవాడు (నొఖేరాం) మునసబు. వడ్డీ వ్యాపారులు జమీందారీలో కీలకమైన పాత్రను వహించారు. హోరీశిస్తు కట్టటానికి, ఇల్లు గడ్వటానికి వడ్డీ వ్యాపారి ఝింగురాసింగును, మంగ్రూ శావుకారును ఆశ్రయించేవాడు.

పంట పండక పోయినా రెండో సాగుచేయాలంటే శిస్తుబకాయి ఉండొద్దు. రెండో పంటకాలంలో హోరీ అప్పులకు పరుగెత్తాడు. శిస్తు కోసం ఝింగురాసింగువద్ద అప్పు చేస్తాడు. ఇన్స్పెక్టర్‌కు లంచం యివ్వటానికి, తప్పు చేసినప్పుడు ఇల్లు తాకట్టు పెట్టి ఝుంగురాసింగు వద్ద అప్పు తేస్తాడు. నాగటి ఎద్దను కొనటానికి దాతాదీన్ వద్ద ఇల్లు జరగటానికి దులారి వద్ద, ఆవుకోసం భోలా వద్ద, శిస్తుకోసం మంగ్రూవద్ద, సోనాపెళ్లి కోసం నోహరి వద్ద అప్పు చేస్తాడు హోరీ. అప్పుడు వడ్డీ రేటు ఎంత లేదన్నా 100కు పది రూపాయిలు ఉండేది.

హోరీ చెఱకు పంట అమ్మగా ఆ డబ్బంతా ఝుంగురాసింగు కాజేస్తాడు. మంగ్రూ డిక్రీ పొంది పంటను (వరి) కాజేస్తాడు. శాస్త్రి తన అప్పు క్రింద పొలం ఉంచుకుంటాడు. విశేషమైన అధికారాలు వడ్డీ వ్యాపారులచేతిలో పెట్టింది ప్రభుత్వం.

పై కారణాల వల్ల భూమి కోల్పోయిన హోరీ వ్యవసాయ కూలీగా మారి వడ్డీ వ్యాపారి (శాస్త్రి) వద్ద చాలీ చాలని జీతానికి చాకిరీ చేయక తప్పలేదు. వ్యవసాయపరంగా ఆలోచిస్తే జమీందారు, వడ్డీ వ్యాపారస్తులు ఆర్థిక దోపిడికి తెగబడి రైతాంగాన్ని పీల్చి పిప్పిచేశారు. జమీందారీ వ్యవస్థలోని పరిస్థితులు 'గోదాన్' నవలలో ఉన్నదున్నట్లుగా చిత్రితమైనవి.

రైత్వారీ, జమీందారీ విధానాలు రెండూ కూడా దేశంలో పూర్వం నుంచి అమలులో ఉన్న సాంప్రదాయిక భూ వవ్యస్థలతో ప్రాథమికంగా విభేదించాయి.

భూమి పైన స్వంత ఆస్తి హక్కు అనే కొత్త రూపాన్ని బ్రిటిషువారు సృష్టించిన దాని వల్ల రైతుకు ఒనగూడే లాభం ఏ మాత్రం లేదు. ధనిక రైతు చేతిలో నలిగిన చిన్న రైతును 'మాలపల్లి' లో, జమీందారీ లోని రైతుల బడుగు జీవితాన్ని 'గోదాన్' లో మనం చూస్తాం.

# 2. ఇతివృత్త సామ్యం

సామాజికమైన ఇతివృత్తాలను స్వీకరించటంలో ఈ రచయితల స్వాతంత్ర్యం నిరుపమానమైంది. వీరి రచనల్లో కథావస్తువు గ్రామ జీవితం. భారతదేశంలో సామాన్య వ్యక్తి రైతు. సామాన్య జీవితానికి కొలబద్ద రైతు జీవితమే. రామదాసు- హోరీలు మనదేశపు రైతు జనానికి ప్రతినిధులు. గోదాన్ మాలపల్లి నవలలకు బేలారి—మంగళాపురాలు రంగభూములు. అవి స్వగ్రామాలైన "లమ్హీ," "వేములూరు''లు కావటం చేత సహజంగా వారిద్దరు తమ ప్రాంతాలకే ప్రాధాన్యం యిచ్చారు. రైతులు భూకామందుల చేతిలో పీడింపబడి కష్టాలకు గురికావటం, కుల వ్యవస్థచేత, లంచగొండితనం చేత ఆ రైతు జీవితాలు దుర్భరం కావటం వంటి ఆనాటి స్థితిగతులను నవలలో యధా తధంగా ఆవిష్కరించారు. అట్టడుగు జీవితాలకు అడ్డుకట్టలు కట్టి నిరోధించాలని ప్రయత్నించే ఊరి పెద్దలు మనకీ నవలల్లో కనిపిస్తారు. సాంఘిక, రాజకీయ, మత సిద్ధాంతాల ప్రభావాలు మానవునిపై ఉంటాయని వీటికి ఆర్థిక వ్యవస్థ పునాది వంటిదని నవలల్లో ఉన్న పరిస్థితుల మూలంగా మనకు స్పష్టపడుతుంది. సనాతన సంప్రదాయానికి సంఘ బహిష్కరణకు వ్యతిరేకంగా పోరాడవలసిన ఆవశ్యకత ఆనాడు ఎంతగానో ఉన్నట్లు సూచించారు. వ్యాపసాయిక జీవిత ప్రభావాన్ని తమ చైతన్యంలో బలంగా నింపుకున్నారు.

బూజు పట్టిన భూస్వామ్య వ్యవస్థలో పడి రైతు క్రమేణా భూమిని కోల్పోయి కూలివాడు కావటం 'గోదాన్'లో, పెత్తందారీ వ్యవస్థలో రైతు భూమినే కోల్పోవటం 'మాలపల్లి'లో కనబడుతుంది. దారిద్ర్యాన్ని అనుభవిస్తూ పోరాడ లేని స్థితిలో ఉంటారు రామదాసు, హోరీలు. అస్పృశ్యతా నివారణ, కులాంతర వివాహం, విధవా వివాహం, సమ్మెలు, తిరుగుబాట్లు ఇవన్నీ ఈ నవలలోని

సంఘటనలు. మౌలికమైన రాజకీయార్థిక వ్యవస్థాత్మకమైన సమకాలీన సమస్యల్ని స్పృశించి దర్పణంపట్టి వాటి వికృత రూపాల్ని సమాజానికి తెల్సేట్టు చేసినారు. ఆనాటి దోపిడి వ్యవస్థ మారాలని కాంక్షించి అందుకు తమ కలాలను శక్తివంతమైన సాధనాలుగా ఉపయోగించిన సాహితీ వేత్తలు ఈ నవలాకారులు.

బ్రిటిషు వారి దౌష్ట్యాల ఫలితంగా శిధిలమైపోయిన జీవితాలు రైతాంగంలోనే నగ్నంగానూ, అతి తీవ్రంగానూ కనిపిస్తాయి. భూమిదున్ని పంటలు పండించే రైతులు ఆ పంటలమీద అధికారం లేకపోవటం ప్రేమ్‌చంద్ కళ్లార చూచి కరిగి పోతాడు. భూస్వామ్య వ్యవస్థలో ఆ రైతులు ఆస్తులను కోల్పోవటాన్ని ఉన్నవ చూచి ఉద్విగ్నుడయ్యాడు. వీరు గ్రామీణ జీవితాన్ని వస్తువులుగా స్వీకరించటం ద్వారా అనైక్యంగా ఉన్న ఆ కాలపు బుద్ధి జీవుల కళ్ళముందు విశాలమైన వాకిళ్ళు తెరిచారు. వీరు గ్రామ ప్రజల్ని రెండు వర్గాలుగా చిత్రిస్తారు పీడక వర్గం, పీడిత వర్గం. జమీందార్లు, భూస్వాములు, పెట్టుబడి దారులు, వడ్డీ వ్యాపారులు, ప్రభుత్వోద్యోగులు మొదలైన వారు దోపిడి వర్గంలోకి వస్తారు. హరిజనులు, రైతులు, కూలీలు, వితంతువులు మొదలగు వారు పీడిత వర్గంలోకి వస్తారు. ధన మదం, అధికార దాహం, మానవత్వం, ప్రజాసేవ, త్యాగం, ఆత్మాభిమానం (సంప్రదాయాలపై తిరుగుబాటు) మతం పేరిట మోసాలు, ప్రేమికుల ప్రేమ, మానవత్వపు మాధుర్యం ఎన్నో విషయాలను వారు వర్ణించారు. వారు యధార్థ ఘటనల్ని ఆధారం చేసుకొని ఏదో ఒక సందేశాన్ని స్ఫురించే నవలలు రాశారు. కష్టించి పనిచేసే రైతులు కూలీలుగామారి పనిచేసే దుర్భర అవస్థలు ఒక వైపు, భూములన్నీ సంపదలన్నీ ఒక చోట ప్రోగుపడేస్థితి మరొక వైపు ఈ వ్యవస్థలో కనబడుతుంది. ఈ వ్యత్యాసాలు తొలగి సమసమాజం ఏర్పడాలన్నదే ఈ నవలల సందేశం ఆదర్శం లేని యధార్థ వర్ణన జుగుప్సాకరంగా తయారవుతుంది. యధార్థ జీవిత వైరుధ్యాల నుంచి ఆదర్శం ఉద్భవిస్తుంది. ఈ పరస్పర సంబంధాన్ని ఈ రచయితలు గుర్తించారు. వీరుసృజించిన పాత్రలు అసలు సిసలైన భారతీయ పాత్రలు. వీరు చిత్రించిన జీవితం, వర్ణించిన వాతావరణం నూటికి నూరుపాళ్ళ అక్కడిది.

# 3. సజీవపాత్రలు

## చౌదరయ్య రాయ్‌సాహబ్

గుంటూరు జిల్లాలో ప్రసస్తమైన నల్లమోతు వారి కుటుంబంలోని వాడు చౌదరయ్య,మాలపల్లి నవలలోనే ఇది కీలకమైన పాత్ర. మంగళాపురంలో ఆయన నివాసం. మంచి వ్యవహర్త.

భూస్వామ్య, ధన సామ్య వర్గానికి ప్రతినిధి చౌదరయ్య. ఆ కాలంలో కమతగాండ్లుగా ఉన్న వాండ్లు చాలా మంది తర్వాతి కాలంలో భూస్వాములయి నారు. చౌదరయ్య ఆ కోవకు చెందిన వాడే.

ఉన్నత కులస్థుడు చౌదరయ్యకు పంచము లంటే ద్వేషం ఉన్నా, సంగ దాసును తన పనులకు వినుయోగించుకోవటం గమనిస్తే చౌదరయ్య యుక్తి మంతుడని తెలుస్తుంది. కూలీలను సమ్మెకు ప్రోత్సహించి తన ఆదాయానికి గండి పెట్టాడని సంగదాసును చంపటంలో భూస్వామ్య వ్యవస్థలోని క్రౌర్యం చౌదరయ్యలో కనబడుతుంది.

ధనిక రైతు చౌదరయ్య సంగదాసు హత్యానేరం నుంచి బయట పడటానికి డబ్బు సంచులు తగిలేశాడు. గ్రామాధికారులను గుప్పిట్లో పెట్టుకొన్నాడు భూమి సంబంధ విషయాలలో, కూలీ సమస్యలలో తనదే పెత్తనం.[11] ఊళ్లో ఎదురులేని అధికారం చలాయించాడు.

గోదాన్ నవలలో వివరించిన ఆవధి ప్రాంతానికి జమీందారు రాయ్‌సాహబ్. సెమ్రీలోకాపురం. గోముఖ వ్యాఘ్రం. దేశభక్తి ముసుగులో దౌర్జన్యం, ధర్మ పన్నాల చాయలో దోపిడి యీయన పని. తన ప్రాంతంలోని రైతులమీద సర్వాధికారాలు చలాయిస్తాడు. భూమి సంబంధాల విషయాలలోనే గాదు, రైతు జీవితాలలో కూడా జోక్యం చేసుకుంటాడు. తాను నియమించిన మున్సబును, ప్రభుత్వోద్యోగి పట్వారీని ఇంకా పంచాయితీ దారులను గుప్పిట్లో ఉంచుకుంటాడు. తన ఆధీనంలో ఉన్న రైతులనుంచి గ్రామాధికారులు జరిమానా విధించినా,

లంచాలు రాబట్టినా ఆ వసూలు సొమ్ము యావత్తు తన ఖజానాకు జమకట్టించుకొనే వాడు. మానవతా వాదిగా మాట్లాడినా రైతులచేత వెట్టిచాకిరి చేయించుకోవటం మానలేదు. అన్నిటికన్నా మిన్నా ఇమానిదారుగా కనిపించటం.

ఆయన స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొంటాడు. అది కేవలం తన జమీందారీ వ్యవస్థను నిలుపుకొనేందుకేనని ఆయన పనుల ద్వారా స్పష్టమౌతుంది. అన్యాయంగా రైతులను పీడించి డబ్బును రాబాట్టుకొనే రాయ్‌సాహెబ్‌అమర్పాల్‌సింహు అప్రతిష్టపాలు కాకుండా తెలివిగా అందరిని బుట్టలో వేసుకొంటాడు. పత్రికా సంపాదకునికి చందా ఆశ చూపి, రైతులను మంచి మాటలతో మభ్యపెట్టి తన ఆధీనంలో ఉంచుకుంటాడు. తన రైతులనుంచి వసూలు చేసే జరిమానాలు మినహా తన బ్రతుక్కు వేరే విధమైన ఆదాయంలేదు. నా చావు బ్రతుకులు రైతులమీద ఆధారపడి ఉన్నాయని బల్లగుద్ది చెప్తాడు. తన రాక్షసత్వాన్ని గుప్తంగా ఉంచుతాడు. "మా వర్గంఎలాగో యిక నిలువదనిపిస్తుంది. ఇప్పటి లక్షణాలు చూస్తుంటే" అని రానున్న పరిణామాన్ని దర్శించి రాయ్‌సాహెబ్ మాట్లాడుతాడు.[12] దేశంకోసం కౌన్సిల్ సభ్యత్వం వదులుకున్నా, జైలుకు వెళ్ళినా కూడా సహజ జమీందారీ ధోరణిని మార్చుకోలేకపోయినాడు. విలాస జీవితానికి అలవాటుపడ్డ వాడైనందున పట్టణంలో ఎక్కువ కాలాన్ని వెల్లబుచ్చుతాడు. వంశ పారంపర్యంగా హక్కులు సంపాదించిన జమీందారీ వర్గం విలాస జీవితానికి అర్రులు చాచింది.

## గ్రామాధికారులు

### మున్సబ్

మంగళాపురం గ్రామాధికారి, సివిల్ మెజిస్ట్రేట్ అధికారం ఉన్నందున గ్రామంలో పలుకుబడి బాగా పెంచుకున్నాడు. ఊళ్ళో ఏమైనా గల్లంతు జరిగితే తన పంట పండుతుందని ఆరా తీసేవాడు. రామానాయుడు సంగదాసు ఇద్దరు స్టేషన్‌లో కల్సి అన్నంతింటుంటే చూచి వారిని మందలించాడు మున్సబు. వారు ఆయన్ని లెక్కచెయ్యలేదు. ఆ కోపంతో ఊళ్లో నాలుగు కులాలవారిని కూడగట్టి మాలవాడితో అన్నంతిన్నాడని రామనాయుడిని వెలివేయాలని ప్రయత్నించాడు. సంగదాసు మరణించినపుడు మున్సబు మన వేవిలి చేను పండిందని ఇన్స్పెక్టరుకు

కబురుచేస్తాడు. డబ్బులుచేతిలో పడేదాక పంచనామా పత్రం మీద సంతకం చేయడు ఈ మున్సబు.

## పంతులు (కంఠం రాజు)

చౌదరయ్య కవిలె లెక్కలు, కోర్టు వ్యవహారాలు అన్నీ చూచే నమ్మకస్తుడు పంతులు. ఈయన కొంచెం పెటుకు మనిషి. డబ్బుకు ఆశపడ్డా యజమానిని మాత్రం చెడగొట్టడు. పంచాయితీ సభ్యుడు. పంతులు పాత్ర నమ్మలేనిది. ఎటు వీలయితే అటు తిరిగే బాపతు అయినందునే మున్సబు ''కేపుమారి ముండా కొడుకని''అంటాడు. సంగదాసు మరణించిన సందర్భంలో రాయబారిగా మసలి నాడు. పోలీసులతో అన్నీ మాట్లాడింది తానే. మాలలను సంగదాసు శవాన్ని పోస్టుమార్టం చేస్తారని చెప్పి బెదిరిస్తాడు. అంతే గాదు యిటు వంటి వ్యవహారాలు చూసానని వారిని హడలకొడతాడు. రామదాసును కట్టుకోటానికి డబ్బు ఆశ చూపుతాడు. చౌదరయ్యను కేసునుంచి తప్పించేందుకు పెద్ద మొత్తంలో డబ్బు లాగుతాడు. మున్సబు దగ్గఱ నుంచి డిప్టిసూపరింటిండెంటు దాకా అందరి నోళ్ళు డబ్బుచూపి మూయిస్తాడు.

## పటేశ్వరీలాల్

గోదాన్ లోని హోరీ నివసించే బేలారి గ్రామం పట్వారీ పటేశ్వరీలాల్. ప్రభుత్వోద్యోగి. తన ఊడ్పులు, కలుపు తీతలు, నూర్పిళ్ళు కూలీలు లేకుండా జరిపించుకొంటాడు. గ్రామరైతుల పరిస్థితి క్షుణ్ణంగా తెల్సు కాబట్టి వారిని దోచేందుకు ఏమాత్రం వెనుకాడేవాడు కాదు. ఇన్స్పెక్టర్ వచ్చినప్పుడు, ఝునియా విషయంలో జరిమానా విధించేప్పుడు హోరీని వెనుకేసుకు వచ్చినట్లు నటించాడు. తనింట్లో నీళ్లుమోసే మాలవిధవాడ పడుచును ఉంచుకుంటాడు.

## నోఖేరాం

జమీందారు సంస్థానంలోని నౌకరు నోఖేరాం. కొంపలు నిలువునా కూల్చే రకం. అమాయక రైతుల రక్తం పీల్చే జలగ. జమీందారుతో చనువెక్కువ కాబట్టి గ్రామంలో తప్పు చేసిన వారిమీద జరిమానా విధించినా, కేసుల్లో, చిక్కినా,

వారి నుంచి లంచాలు రాబట్టుకున్నా, ఆ సంగతి జమీందారుదాకా పోనిచ్చేవాడు కాదు. అంతా తానే దక్కించుకునేవాడు. అంత ఆస్తి సంపాదించాడంటే జమీందారు యిచ్చే జీతం (నెలకి 12 రూపాయలు)తో కాదుగదా? నలుగురు బంట్లు తనింట్లో వెట్టి చేయించు కోవటమే కాకుండా తన వ్యవసాయ పనులు రైతుల చేత చేయించు కుంటాడు. కేవల శిస్తు వసులు అధికారమున్నా రైతుల మీద తన అధికారం చలాయిస్తాడు.

పటేశ్వరీకి సరిబంటు కాబట్టి అన్నింటిలో అతనితో తులతూగాలని తపన ఉన్నవాడు. మాలదాన్ని పటేశ్వరీ ఉంచుకుంటే గొల్లదాన్ని (నొహరిని) నొఖేరాం ఉంచుకుంటాడు. గ్రామమున్సబు కాబట్టి సివిల్ మెజిస్ట్రేట్ ఆధికారం ఉందని ఝింగురాసింగులను బెదిరిస్తాడు. ఒక్కసారి కట్టె తీసుకొని పట్వారిని కొట్టేందుకు పోతే ఆయన ఉరుకు పుచ్చుకున్నాడు.

## ఝింగురాసింగ్

వడ్డీ వ్యాపారం ప్రధాన వృత్తి గలవాడు ఝింగురాసింగ్. పంచాతీ సభ్యుడు అయినందున ఊళ్లో పలుకుబడి బాగా ఉన్నవాడు. ఎంగిలి కూడు తినే రకం. దురాశ పరుడు. ఊళ్లో ఏదైనా గల్లంతు జరిగితే తన పంట పండుతుందని లొట్టలేసుకు చూసేవాడు. ఇన్స్పెక్టర్ వచ్చినపుడు వడ్డీకి అప్పు, జరిమానా వేసి నప్పుడు డబ్బు హోరీకి యిచ్చింది ఈయనే. వడ్డీకి వందరూపాయిలకు పది రూపాయల చొప్పున తీసుకుంటాడు.

## దాతాదీన్ (పంతులు)

అనేక విధాల ఆదాయం శాస్త్రిది. వ్యవసాయం, వడ్డీ వ్యాపారం కమీషన్ వ్యాపారం ఇవేగాక దలారీల ద్వారా బాగా సంపాదిస్తాడు పంచాయితీ సభ్యుడు అయినందున జరిమానాల ద్వారా వచ్చే డబ్బు కూడా ఎక్కువే. తన కొడుకు మాలదాన్ని ఉంచుకున్నా తన వ్యవసాయ పనులు ఖర్చులేకుండా జరుగుతున్నా యని మిన్నకుంటాడు. మాతాదీన్‌ను మాల వారు కులంచెరిస్తే దాతాదీన్ ప్రాయ

శ్చిత్తం చేయిస్తాడు. జిరాయితీ పన్ను ఎన్నడూ చెల్లించి ఎరుగడు. హోరీకి అప్పు యిచ్చి పొలాన్ని కాజేసి ఆతన్ని కూలీగా కుదిరించు కుంటాడు.

'మాలపల్లి'లోని మున్సబ్, పంతులిద్దరూ చౌదరయ్య కుడి ఎడమ భుజాలు. మున్సబ్ ఒక్కోసారి చౌదరయ్య మీద కక్ష కట్టినా చౌదరయ్యకొమ్మే కాసే వాడు. సంగదాసు హత్య సందర్భంలో మున్సబ్ పోలీసు వారిని, పంతులు మాలవారిని చేతిలోకి తెచ్చుకొని చౌదరయ్య గండాన్ని గడతేర్చారు పంతులు చౌదరయ్యకే నమ్మకస్తుడు రామదాసు ఆస్తి డిక్రీ పని అంతా పంతులు చేసిందే. కూలీల సమ్మెలో తలదూర్చి చౌదరయ్యను రెచ్చగొడతాడు. అయినా వాళ్ళంతా పీడక వర్గానికి చెందిన వారే.

'గోదాన్' లోని పటేశ్వరీ, నొఖేరాం, ఝింగురాసింగ్, దాతాదీన్‌లు దుష్టచతుష్టయం. బ్రిటిషు ప్రభుత్వోద్యోగి పటేశ్వరీ అయితే జమీందారు నౌకరు నొఖేరాం. ప్రభుత్వ, ప్రజాధికారాలకు తోడు పంచాయితీ సభ్యులు. ఝింగురా సింగ్, దాతాదీన్‌లు బేలారి గ్రామానికి మొత్తం అధికారులు—గ్రామదేవతలము తామే అనుకుంటారు. గురివింద తన నలుపు ఎరుగనట్లు వారి తప్పులు తప్పులు కావు. పటేశ్వరీ విధవాడపడుచు (మాలదాన్ని)ఉంచుకొన్నా, నొఖేరాం గొల్లదాన్ని (నొహరిని) ఉంచుకొన్నా, మాతాదీన్ సిలియాను (మాలదాన్ని) ఉంచుకున్నా, ఝింగురాసింగ్ భార్యలు చెతునడతలు నడిచినా గ్రామాధికారులు కాబట్టి అవి తప్పుడు పనులు గావు. వారు తప్ప మిగిలిన వారు ఏ చిన్న తప్పు చేసినా పెద్దగా శిక్షను విధిస్తారు ఈ పంచులు. ఝునియాను కోడలుగా చేసుకొన్నందుకు 'తప్పు' వేసిన పంచాయితీ వ్యవస్థను గమనిస్తే సాంఘిక అసమానతను సులువుగా గుర్తించ వచ్చు.

గ్రామాధికారుల్లో కూడా ఒకరంటే ఒకరికి గిట్టదు. పోటీల వల్లే పటేశ్వరీ, నొఖేరాంలు అన్య స్త్రీలతో అక్రమ సంబంధాలు పెట్టుకుంటారు. ఒకరు ఉంచు కున్న దాని కోసం యింకొకరు బలప్రయోగానికి కూడా సిద్ధ పడతారు. బడాయి తనమేగానీ జీవితాలు బజారు పాలవుతాయనే రంది వారిలో లేదు నొఖేరాం శిస్తు వసూలు చేసి రశీదు యివ్వకుండానే రైతు వద్ద మళ్ళి శిస్తు వసూలు చేస్తే, పటేశ్వరీ వడ్డీ వ్యాపారులను ఎక్కించి (పురిగొల్పి) బాకీ పడిన రైతులమీద డిక్రీని సంపాదిస్తాడు. ఆర్థికంగా క్రుంగిన రైతుల పొలాలు కేవలం ఊడ్పులు

చేసి సగభాగం పంటను వశపర్చుకుంటాడు శాస్త్రి. కరువు కాటకాలలో హెచ్చు వడ్డీతో రైతులకు అప్పు యిచ్చి జలగలా రక్తం పీల్చి పిప్పి చేసి చివరికి కౌళ్ళ వాళ్ళను జప్తి చేయించి భూములను వశపర్చుకొని రైతుల్ని కూలీవాళ్ళను చేశారు. ఇన్ని దుర్మార్గాలున్న వీరు పంచులు ఎలా అవుతారు? పరమ పిశాచి గణం గాక.

గ్రామ రైతులనే పీడించటంలో తృప్తి చెందిన ఈ గ్రామ పెత్తందార్లు జమీందారుకు కూడా టోపి వెయ్యాలని యుక్తి పన్నారు. హోరీ నుంచి వసూలు చేసిన డబ్బును జమీందారుకు జమకట్టటానికి యిష్టంలేక ఆ డబ్బును దక్కించుకొనేందుకు వీరు జమీందారు దౌర్జన్యాన్ని గురించి 'బిజిలి' పత్రికకు ఒక లేఖ రాశారు. అయినా వాళ్ళ పథకం పారలేదు. రాయ్‌సాబ్ అమర్పాల్‌సింహుడు ఎత్తుకు పై ఎత్తు వేసి పత్రికా సంపాదకున్ని చిత్తు చేసి జమీందారీని కాపాడుకుంటాడు.

ఈ నవలల ద్వారా ఆనాటి గ్రామాల్లోని ప్రజలు గ్రామాధి కారుల పీడనకు ఎలా బలయినారో తెలుసుకోగలుగుతున్నాం. సాంఘిక కట్టుబాట్లు విస్మరించిన వారిని సంఘ బహిష్కరణ ఎలా చేసే వారో వీనిలో విపులంగా చిత్రితమైంది

## రామదాసు - హోరీ

రామదాసు ఉన్నవకు ఆదర్శమైనపాత్ర. ఈ ప్రధాన పాత్రలో సాను భూతి, క్షమా, దయా, ఔదార్యం నిండి ఉన్నాయి. 'మాలపల్లి'లోని ప్రధానకథ రామదాసు కుటుంబ గాథే. చౌదరయ్య కుటుంబంతో ఇతని కుటుంబాన్ని ముడి పెట్టి కథనం నడిపాడు ఉన్నవ. చౌదరయ్య దౌర్జన్యం, ఆతని నమ్మినబంటు పంతులుపన్నాగం, మున్సబు కరణాల మోసాలు రామదాసును భ్రష్టుపట్టిస్తాయి. రామదాసు చౌదరయ్యల వివాదం ఖర్చులతో గూడిన కోర్టువ్యవహారం కావటంవల్ల ధనవంతుడైన చౌదరయ్యకే విజయంకలుగుతుంది. చౌదరయ్య కోర్టు ఉత్తర్వు సంపాదించి రామదాసు స్థిరచరాస్తులను జప్తు చేయించి వశపర్చుకుంటాడు రామదాసు కుటుంబం నిరాశ్రయమౌతుంది ఆస్తినంతా కోల్పోయిన రామదాసుకు ఆదాయంలేనికారణంగా కుటుంబంపస్తులతో సాగుతుంది. కుటుంబపోషనార్థం ఆయన కూలికి కుదురుతాడు. స్వయంఉపాధికై వ్యాపారాన్ని చేపట్టి కృషకకృత్యుడు కాకుం

డానే సెటిల్మెంటు పాలవుతాడు. పెత్తందారు ఆగడానికి కన్నకొడుకును, వారసత్వం వ్యాజ్యంవల్ల ఆస్తినీ కోల్పోయిన రామదాసుకు సెటిల్మెంటు పుణ్యానఉన్న ఊరును వదలవలసి వస్తుంది. పరప్రభుత్వ దుర్నీతికి ఆయన సతి సంతానం బలి అవుతుంది. పెత్తందారీ వ్యవస్థ, ఆంగ్లప్రభుత్వం అమాయక జీవితాలతో ఎలా చెలగాటమాడిందో చారిత్రిక వాస్తవంగా నిలిచిన దృష్టాంతం రామదాసు కుటుంబగాథ.

హోరి ప్రేమ్‌చంద్‌కు ఆదర్శమైన పాత్ర. హోరీలోకూడా రామదాసు లక్షణాలన్నీ ఉన్నాయి. గోదాన్‌లో హోరీ కుటుంబగాథే ప్రధానమయింది. శాస్త్రి కుటుంబంతో హోరీ కుటుంబం ముడివడి ఉంది. శాస్త్రి దౌర్జన్యం, మున్సబు తదితరుల మోసాలు హోరీని భ్రష్టు పట్టిస్తాయి. అధికమైన శిస్తులు, లాభసాటి కాని చిన్న కమతాలు సన్నకారు రైతుల్ని కుంగదీస్తాయి. హోరీకుటుంబంలోని ఏగురు కష్టపడుతున్నా ఏమీ మిగలటంలేదు. హోరీ శిస్తుబకాయిపడతాడు. కరువు కాటకాలవల్ల అప్పులపాలవుతాడు. ఝునియా కారణంగా "పంచాయతీ" తప్పు వేసి డబ్బుకట్టించుకుంటుంది. ఆ తప్పుకింద కష్టించి పండించిన పంటంతా పోతుంది. హీరా కేసులో అవమానం జరగవద్దని లంచం ఇచ్చేందుకు అప్పు తెస్తాడు. అన్యాయాల కారణంగా హోరీ ఇల్లు కుదువబడి ఉంది. భోలా అప్పు కింద దుక్కిటెడ్లను తోలుకెళ్తాడు. వ్యవసాయం శాస్త్రి పాలవుతుంది. అప్పు క్రింద పొలం యిచ్చి శాస్త్రికి కూలికి కుదురుతాడు హోరీ. కార్తీక మాసం గడచిన రోజుల్లో కూలిదొరకటం కష్టమయిపోయి హోరీ కుటుంబం పస్తులతో కాలం వెళ్ళబుచ్చుతుంది. జమిందారీ వ్యవస్థలో రైతుకూలీగా మారటం యధార్థంగా చిత్రించటంవల్ల ఆనాటి రైతు దుర్భరజీవితానికి దర్పణం పట్టాడు ప్రేమ్‌చంద్.

సామాన్యరైతు రామదాసు సర్వస్వం కోల్పోయి కడుపుచేత్తో పట్టుకు బ్రతికితే, ధనికరైతు చౌదరయ్య తన ఆస్తిని ఇంకా పెంచుకుంటాడు. చౌదరయ్య పెత్తనానికి వచ్చినప్పుడు 300 ఎకరాల ఆసామిగా ఉండి తర్వాత చౌక ధరలోగాని, బాకి క్రిందగాని, కోర్టులో గెలిచిగాని 500 ఎకరాలంపల్లం 300 ఎకరాల మెట్ట సంపాదించాడు. ఆ కాలంలో పేద రైతులు కూలీలుగా ఆసాములు భూస్వాములుగామారారు. రైత్వారీ పద్ధతిలో జరిగింది ఇదే.

సన్నకారురైతు హోరీ కూడా సర్వస్వం కోల్పోయి, బడుగు బ్రతుకును వెళ్లదీస్తాడు. శాస్త్రి మాత్రం స్థిరాస్తులను పెంచుకుంటాడు. జరిమానాలు విధించి మెనుకేసుకున్న డబ్బు, వాళ్ళ వీళ్ళ నోళ్లు కొట్టి సంపాదించిన డబ్బు అప్పుఇచ్చి ఆ బాకీల క్రింద భూములను సంపాదించి ధనికుడు అవుతాడు. వడ్డీ వ్యాపారులు జమీందారీలో కీలకపాత్రవహించారనేందుకు ఇది చక్కని దృష్టాంతం.

సంగదాసును చౌదరయ్య హత్యచేసినప్పుడు రామదాసు అతన్ని ఏ మాత్రం ద్వేషించలేదు. "సద్గురూ నీదయ ఇట్లా వచ్చిందా" అన్న రామదాసు నోరు గుటగుటలాడి టక్కున మూతపడ్డది మున్సబ్ రిపోర్టుమీద ఆ హత్యాకేసు దర్యాప్తునిమిత్తం వచ్చిన పోలీసు ఇన్‌స్పెక్టర్ "రామదాసు నీ కొడుకు ఎట్లా చచ్చాడో తెల్సా" అని అడిగితే "ఆయువుమూడి చచ్చాడు ఇంకో విధమే ముంటుంది." అనితడుముకోకుండా చెప్తాడు రామదాసు.[13] నీ కెవరిమీదనైనా అను మానమున్నదా అని అడిగిన ఇన్‌స్పెక్టర్ మాటలకు "నాకు ఎవరి మీద లేదని పోయేరోజొచ్చింది పోయాడ"ని రామదాసు చెప్తాడు.[14] పంచాయితీ వారు ఆత్మ రోగం వల్ల సంగదాసు మరణించాడని పంచనామా రాస్తారు. కన్నకడుపు కోతను సహించుకొన్నాడే కాని హంతకుని మీదికి ప్రతిక్రియకు పూనుకో లేదు. తన ఏడుపునంతా ఒక 'సంగన్నా' అనే కేక వేసి మిగతా దుఃఖం గుండెలో దాచుకున్నాడు. అట్టడుగువాడైనా ఆక్రోశించక శత్రువుని క్షమించి ఆదర్శంగా నిలుస్తాడు. కన్నకూతురు నదిలో దూకి ఆత్మార్పణం చేసు కుందని తెల్సి "మమ్ములను వదిలి పోవల్సిన అవసరం వచ్చిందా"అని ఊరు కుంటాడు. కూతురు మరణం విని గుండాగి మరణించిన మాలక్ష్మినిచూచి "నెన్ను నేను బంధమనుకోవటం నాబుద్ధి జాడ్యమే" అంటాడు రామదాసు. వృద్ధాప్యం వచ్చిన కొద్దీ జీవుడికి పంచేంద్రియాలతో సంబంధం ఒక్కొక్కటి తెగిపోతుంది. ఇది తెలిసి మెదులుకుంటూ పోతాడు రామదాసు.

హీరాలాల్ ప్రాణప్రదమైన గోవును హత్యచేసినప్పుడు హోరీ అతనిని ద్వేషించలేదు. నిండుమనస్సుతో తాను చూచింది ధనియాకు చెప్తాడు గ్రామ మున్సిఫ్ లంచాలు రాబట్టుకునేందుకు పోలీసు ఇన్స్‌పెక్టర్‌కు కబురు చేస్తాడు. గోవు హత్యాకేసు సందర్భంగా దర్యాప్తుకై వచ్చిన ఇన్స్‌పెక్టర్ "ఎవరంటే నీకు అనుమానమని" హోరీని అడుగగా "నాకు ఎవరిమీద అనుమానం లేదు బాబు

చచ్చిపోయే రోజొచ్చింది చచ్చిపోయింది" అన్నాడు[15] డబ్బులు రాబట్టు కోవాలనే నెపంతో ఇన్స్పెక్టర్ హీరా ఇల్లు సోదా చేయాలంటాడు. హోరీ ప్రాణాలు పైనే పోయాయి. తమ్ముడు లేనప్పుడు ఇల్లుసోదా చేస్తారా? తాను బ్రతికి ఉండగా ఈసోదా జరిగేందుకు వీలు లేదంటాడు. తనను అవమానం చెయ్యోద్దని ఇన్స్పెక్టరును వేడుకుందామని అనుకుంటాడుకాని చేతిలో డబ్బులేదు. పటేశ్వర్ లాల్ సంహామీద ఝింగురాసింగ్ 30 రూపాయలిస్తే సంతోషంతో ఇన్స్పెక్ట రుకు యివ్వబోతాడు హోరీ.

రామదాసు హోరీ భావాల్లో, కార్యాల్లోనూ సహనమే ప్రధానంగా కనబడు తుంది. ఎట్టి పరిస్థితులలో కూడా వీరు ద్వేషాన్ని ప్రదర్శించరు. అహింస ప్రేమరాజ్యంగానే రామదాసు హోరీలు తమ జీవితాలను వెళ్ళదీస్తారు. వాస్తవిక రచనల్లో యిలాంటి శాంతికాముకులు కనిపించటం అరుదు. ద్వేషానికి తావీయకుండా పాత్రలను తీర్చిదిద్దటం రచనాపటిమకు తార్కాణం.

రామదాసులో కర్మ సిద్ధాంతంపట్ల విశ్వాసం, ధర్మమార్గానుసరణం, స్థిత ప్రజ్ఞత కనబడుతుంది. సర్కారువారు తనను నిర్బంధించగా ఆయన "విచార పడితే తీరుతుందా" అంటాడు. రామానాయుడుజమీనిచ్చి వదిలిస్తానంటే ఒప్పు కోడు. "కారాగార ప్రాప్తిఉంటే నాయుడుగారు తప్పిస్తే పోతుందా?" అంటాడు.[16] సెటిల్మెంట్లులో ఉన్నప్పుడు చేయని నేరానికి శిక్షపడుతుంటే మాలక్ష్మి "మనమేం తప్పుచేసామని కేసుపెడతారు" అని ఆమె ప్రశ్నిస్తే "ఇప్పుడు చెయ్యాలా? ఎప్పుడు చేసిందో" అంటాడు రామదాసు.[17] ఆర్థికంగా చితికి పోయినా, భౌతికమైన ఇబ్బందులకు లోనైనా తన వారిని కోల్పోయినా, మానసికమైన వ్యథకు గురైనా, యథాప్రకారంగానే తన జీవితాన్ని కొనసాగిస్తాడు. సెటిల్మెంటు నిర్బంధంలో ఉన్నాకూడా తన దేహానికి మాత్రమే పారతంత్ర్యం కలిగింది కాని ఆత్మ సర్వ స్వతంత్రంగానే ఉందని అంటాడు రామదాసు.

హోరీ పాత్రలో మాత్రం కొంత బలహీనత కనిపిస్తుంది. వెదురు అమ్మే విషయంలో తమ్ములను మోసం చేయటానికి హోరీ అబద్ధమాడుతాడు. తన ఆవుకు తమ్ముడు విషం పెడితే అది చూచిన హోరీ ధనియాకు చెప్తాడు. పోలీసు నేరం తమ్మునిపై పడుతుందని తెలిసినప్పుడు తన కొడుకు గోవర్ మీద

ప్రమాణం చేస్తాడు. ఇన్స్‌పెక్టర్ బెదిరిస్తే లంచం యివ్వబోతాడు. ఝునియా విషయంలో 'తప్పు' చెల్లించకపోతే అప్పుల పాలయ్యేవాడు కాడుకాని కట్టుబాట్లకు తలవంచక ఆయనకు తప్పలేదు[18]. ధర్మం కోసం పడిచచ్చే హోరీ తన కూతురు రూపాను అమ్ముకుంటాడు. వీటి అన్నింటికి కారణం ఒక్కటే. బతుకు పోరాటంలో హోరీకి ఎప్పుడూ ఓటమే; కన్నీళ్లే. అతని ఆశలన్నీ అడియాశలౌతాయి. అయినా ధైర్యాన్ని కోల్పోడు ఈ పరిస్థితుల నడుమ నుంచి అతడు తుదకు ధర్మానికి ప్రతిజ్ఞకు కట్టుబడి ఉండలేని స్థితికి చేరుకుంటాడు.

హోరీ రాందాసుల్లో అసలు ప్రతిఘటనే ఉన్నట్లు తోచదు. ఉన్నా అది గుప్తంగా అప్పుడప్పుడు భావాల్లోకి నిశ్శబ్దంగా ప్రసరిస్తుంది. వెంటనే సంప్రదాయం కట్టుబాటు కర్మ సిద్ధాంతం దానిని శుష్కింపచేస్తాయి. తమ పిల్లల్లోనో భార్యల్లోనో అటువంటి ప్రతిఘటన ప్రకాశమైనప్పుడు వెంటనే దానిని ఆర్పెయ్యటానికి వెనుదీయరు. ఇది వారి అచంచలమైన శాంతి కాముకతకు నిదర్శనంగా చెప్పుకోవలసి వస్తున్నది.

## మాలక్ష్మి - ధనియా

'మాలపల్లి'లోని మాలక్ష్మి అమాయకత్వానికి, ఆత్మీయతకు జీవం పోసిన పాత్ర. తలలో నాలుకలా సంసారంలో మెలగి భర్త అడుగుజాడల్లో నడుచుకొని ఆదరాభిమానాలు పొందిన ఉత్తమురాలు. వ్యావసాయిక జీవితం గడిపినా వేదాంత దృష్టితో సంసారం సాగించింది. సుఖాల్లోనూ, దుఃఖాల్లోనూ ప్రేమానురాగాలతో జీవించింది. పరుల సొమ్మును ఆశించలేదు. పరులను దూషించలేదు. న్యాయం ఆమె ఊపిరి. తిరుగుబాటుతనం ఎరుగదు భర్తతో ఎప్పుడూ పోరాడలేదు. గౌరవంగా బ్రతకాలనే ఆశించేది.

'గోదాన్'లోని ధనియాకు కూడా అంత ప్రాధాన్యం ఉంది. మర్యాద కోసం చచ్చే మనిషికాదు. వాస్తవికతకు ప్రాణం పోసినపాత్రఆమె. వ్యవహారాల్లో కచ్చితమైన వైఖరి ఉన్న మనిషి. అమాయకత్వం కంటే అనురాగమే ఆమెలో హెచ్చుగా కనబడుతుంది. నిత్య సంసారిక విషయాలలో ఆమెదే పెత్తనం. భర్త మాటను ఆదరించదు సరిగదా ఆయనలో ఉన్న అమాయకత్వాన్ని చీల్చి

వెండాడుతుంది. తనకు న్యాయంకాదని తోస్తే ఎవరినైనా ఎదిరించేందుకు వెనుకా డదు. ఆమెలో క్షమాగుణం మెండు ఆడది అబలకాదు సబలని నిరూపించు కొంది. తన దుర్భర జీవితానికి కారకులు గ్రామపెద్దలని అర్థం చేసుకొని ఆమె నిర్ద్వంద్వంగా వాదిస్తుంది. కష్టాల్లోనూ ప్రేమానురాగాలతో జీవించింది. ఆమెకు అసంతృప్తి లేదు. భర్త తన్నినా ఓర్పు వహిస్తుంది. అయినా భర్తమీద ఈగ వాలితే సహించదు పరధనం ఆశించలేదు. తన పద్ధతిలో జమీందారీ వ్యవస్థను విమర్శిస్తుంది. తిరుగుబాటు లక్షణం పూర్తిగా పుణికి పుచ్చుకున్న పాత్ర ధనియా. పర్యవసానంగా ఆమె ఆదర్శభార్య. తాను నమ్మినదాన్ని ఆచరించింది.

మాలక్ష్మి అంటరానిదైనా తానూ సంఘం గూర్చి బాధ పడలేదు. అగ్ర వర్ణాల వారి మీద ద్వేషంలేదు. కులాలప్రసక్తి వచ్చినప్పుడు "మనం మాలల్లో బ్రహ్మలంట" అని సుబ్బలక్ష్మి అంటే కులాల పట్టింపు గురించి చెప్తూ "తప్పు ఒక్క కులపు వాళ్ళ దగ్గర ఉన్నదనటానికి వీలులేదం"టుంది.[19] అందరూ కులా చారాలను ఆచరిస్తున్నారు. కులాలు అన్ని కలవాలనీ ఎవరికుండదని చెప్తుంది మాలక్ష్మి. అస్పృశ్యులం అనే దృష్టితో కూతురు "ఆలయంలోకి మనలను రాని స్తారా ?" అంటే మనను రానియ్యరు నిజమే తామే ఆలయం కట్టించినా అందులోకి దేవుడొస్తాడని అంటుంది.[20]

ధనియా శూద్రురాలైన సంఘంలో అందరితో కలసి ఉంటుంది. సంఘం కట్టు బాట్లను లెక్కచేయక ఝునియాకు ఇంట్లో స్థానం కల్పిస్తుంది. అందుకు పంచాయితీని ఆమె బహిష్కరిస్తుంది. అయినా ఆమె చింతించదు. ఆమెలో మానవతా వాదం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఝునియా విషయంలో పంచాయతీ 'తప్పు' వేస్తే ఆమెలో తిరుగుబాటు తలెత్తింది. "మాకు కులంతో పనిలేదు. మోక్షం ప్రసాదిస్తారు గామాలె మాకు అవి అక్కరలేదు." అంటుంది ధనియా [21] జరిమానా కట్టేందుకు పంటను సొంతం పట్టుకెళ్లియిచ్చే హోరీని అడ్డు కుంటుంది. ఆర్థిక స్థితిగతుల దృష్ట్యా కూతురును అమ్ముకోవటానికి ధనియాను లొంగదీసు కుంటుంది అప్పటి వ్యవస్థ.

సంగదాసు చనిపోయినప్పుడు మాలక్ష్మి ఒక్కపరుష వాక్కుకూడా మాట్లాడలేదు. పూర్వకర్మమే ఆయనను చంపిందని తమ హీనజన్మను నిందించు

కొంది. సంగన్నను సంబోధిస్తూ "నీతల పదిచెక్కలైతే చూచి నాగుండె వ్రయ్యలు కాలేదు" అని కన్నీరు మున్నీరుగా విలపించింది [22] ఆమె ఆత్మ గౌరవం కాపాడుకోవాలని ప్రయత్నించేది. వ్యాజ్యంతో ఆస్తిపోయింతర్వాత బాగా బ్రతికిన మాలక్ష్మి ఊరు విడిచిపోయి కూలిచేసుకు బ్రతుకుదామని భర్తతో అంటుంది. సెటిల్మెంటుకు వెళ్లేప్పుడు కూలి చేయాల్సిఉంటుందని బిడ్డ (జోతి) కూలిచేయవలసి వస్తుందని దుఃఖిస్తుంది. ఆదాయం బొత్తిగా లేని రోజుల్లోతాను ఉపవాసముండి తన వాళ్ళ ఆకలి తీరుస్తుంది. తనకు తానుగానే దాచేయకుండా ఆమె చెప్పినప్పుడు రామదాసు "సద్గురూ ఇప్పటికి మాలక్ష్మికి మూడు పూటలు అన్నం లేకుండా చేశావా?" అని ఆవేదన పడతాడు.[23] "నాగర్భవాసాన పుట్టి బట్టి మీ కెన్ని తిప్పలు వచ్చినవ"ని రామదాసు అంటే "అందరికీ వొక్క వ్రాత ఉండబట్టే అందరు దరిద్రులము వొక్కచోటుచేరాం"అని మాలక్ష్మి అంటుంది [24] మాలక్ష్మి విసిగిపోయి "మనతో సంబంధం లేని భగవంతుడితో మనకు మాత్రం సంబంధం ఎట్లాఉంటుంది"అని కడుపునింపలేని వేదాంతాన్ని నిరసిస్తుంది.[25] జ్యోతి ఆత్మాహుతి చేసుకున్నదని తెలియగానే ఆ బాధ భరించలేక మాలక్ష్మి ప్రాణాలు విడుస్తుంది.

ఆవు చనిపోయినప్పుడు ధనియా ఒక్క మర్యాద మాట కూడ అనలేదు. విప్లవ మూర్తిగా విజృంభించింది"ఇంట్లో రాత్రింబవళ్ళు రెక్కలు ముక్కలు చేసు కున్నా తాగటానికి గంజి నీళ్లు కూడా దొరక లేదు. మర్యాద కావలసివచ్చిందీ. నీ రాజ్యంలో నీతిగా పోవడం కూడా తప్పేనా? ఇంకేం బేడీలు తొడుగు— పద నీతో పాటు జైలుకు వస్తా" అని పోలీసు ఇన్స్పెక్టరును హడలకొట్టింది. పెద్దలను చూచి ధనియా సింహిణిలా లేచి "మనకెవళ్ళు అప్పియ్యనవసరం లేదు మాకక్కవల్సివచ్చినప్పుడు ఎవడాదుకో లేదు గాని ఇప్పుడు ఎక్కడి నుంచి డబ్బు వచ్చిందో అంతా తెలుసు, వాటా లేసుకుందామని అప్పిచ్చారు. బీదాళ్ళ నెత్తురు తాగే వీళ్ళందరూ పూరి పెద్దలే. లంచాలకు మరిగార" ని దుమ్మెత్తి పోసింది.[26] గుండెగల ఆడదనిపించుకుంది. ఆమెకు అన్యాయం మీద తప్ప వ్యక్తుల మీద కోపం లేదు. ఝునియా లాంటి 'పతితను' కోడలుగా స్వీకరిస్తుంది. హరిజన కన్య సిలియాకు ఆశ్రయమిస్తుంది. మాటలో కాఠిన్యం మనసులో కరుణ ఉన్నాయి. గోబర్‌ను తీసుకొని ఝునియా వెళ్ళి పోతుందంటె ఆమె గుండె ముక్కలు అవు

తుంది. కొడుకును వేరు చేస్తున్నందుకు ఆమె ఝునియాను శపిస్తుంది. రెండవసారి ఝునియా వస్తే ఆమెను హృదయ పూర్వకంగా స్వీకరిస్తుంది

ముఖ్యంగా ఈ పాత్రలలోని వ్యత్యాసం జీవిత విధానాన్నిబట్టి వచ్చాయి. పొద్దస్తమానం వెట్టిచాకిరి చేసే ధనియాకు సహజంగానే ఎదురు తిరిగే గుణం వచ్చింది. మాలక్ష్మి చివరి దశలో కష్టాలు పొందుతున్నా మొదటి నుంచి బ్రతికిన విధానాన్నే అనుసరించింది. అయినా వేదాంతాన్ని సరసించటం వల్ల ఆమెలో మార్పు వచ్చింది. సహజ దోపిడి మూలాన వీరిద్దరిలో నిస్పృహలు చోటు చేసుకున్నాయి." గోచి కంటే గొప్ప దరిద్రమా" అన్న మాలక్ష్మి మాటల్లో, "ఊరు ఉంటే నాకేం పోతే నాకేం" అన్న ధనియా మాటల్లో తెగింపు తత్వం ఉంది.

## వెంకటదాసు, సంగదాసు, గోబర్

రామదాసు సంతానంలో సంగదాసు సహనాన్ని వెంకటదాసు ఆగ్రహాన్ని ప్రదర్శించి విభిన్న ఉద్యమాలను చేపట్టారు. ఇద్దరు ఆశయాల కోసం బలై పోతారు. సంగదాసు తండ్రి గుణాలను పొందుపర్చుకుంటే వెంకటదాసు భిన్నమైన గుణాన్ని పొందుతాడు.

సంగదాసు సామాజిక వాది. ఆయన పొందిన ఆధ్యాత్మిక విద్యా విజ్ఞానాలు అగ్ర వర్ణాల వారికంటె మిన్న అయినవి. అగ్రవర్ణాల వారితో సన్నిహితంగా ఉండాలనిగాని, తన చేత నీరు త్రాగించాలనే పట్టుదలగాని లేని వాడు. బట్ట పెట్టించి, చదువు వృత్తులు నేర్పించాలని తన వారిని సాంఘికార్థిక రంగాలలో ఉన్నతులను చేయాలనేది సంగదాసు ధ్యేయం. ముఖ్యంగా అగ్రవర్ణాల— నిమ్న జాతుల మధ్య అంతరాలను తొలగించాలని ప్రయత్నించాడు. తాను హరిజనుడై కూడా హరిజన సమస్యల పరిష్కారానికి నడుంకట్టాడు. సంఘసేవే అతనికి ఆదర్శం. తండ్రి వ్యవసాయ పనులతో సంగదాసుకు సంబంధం లేదు చౌదరయ్య దగ్గర గుమస్తాగా పని చేస్తాడు చౌదరయ్య కుత్సితానికి బలై పోతాడు. సంగదాసు లేకున్నా అతను ప్రారంభించిన ఉద్యమం అతని ఆదర్శాల ప్రభావం అతని సన్నిహితులను ప్రేరేపించి, అతని కంటే అధికోత్సాహంతో కొనసాగించేందుకు

ఉపకరించింది.[27] న్యాయం కోసం మానవత్వపు విలువల కోసం పోరాడాడు. సంగదాసు కర్తవ్య దీక్ష చలించేది కాదు. వచ్చే ప్రమాదం గుర్తెరిగినా అతను కూలీల తరపున పై ఎత్తు వేస్తాడు. ఆత్మ త్యాగం చేస్తాడు.

వెంకటదాసు ముందు అమాయకుడుగా కన్పిస్తాడు. కష్టపడి పనిచేయాలని, దానితో బ్రతుకున్నదని నమ్మిన వ్యక్తి. తమ్ముని మరణం ఈ నమ్మకాన్ని వమ్ము చేసింది. సంగని దుర్మరణం, దానికి ప్రతిక్రియ లేకపోవటం వెంకటదాసు మనస్సులో నాటి అస్వాభావికమైన ద్వేషానికి పురి కొల్పాయి. ధనవంతుల దౌర్జన్యాన్ని ఎదుర్కోవాలనే తలంపుతో విప్లవాత్మకమైన మార్గం అవలంభించి తక్కెళ్ళ జగ్గనిగా అవతరిస్తాడు. ధర్మకన్నాల పద్ధతిని అనుసరిస్తాడు. జగ్గడు "నా ధర్మం జనులవలంభిస్తే, ప్రతి వాళ్లు యథా శక్తిగా పాటుబడి అవసర మైనంత తిని, గుండె నిమ్మళంగా రేపనే చింత లేకుండా విద్యాబుద్ధులభ్యసిస్తూ పస్తులు లేని, భోగాలు లేని, ద్వేషాలు లేని, స్వచ్ఛంద జీవితాలు అనుభవించ టానికి అవకాశముంటుంది." అని తన సామ్యవాద వ్యవస్థా నిర్మాణ లక్ష్యాన్ని స్పష్టం చేశాడు.[28] ఈతని "సంతానుల పోరాటాన్ని" చరిత్రకెక్కిన రంపపితూరి పోరాటానికి ప్రతిబింబంగా భావించాలి. ఆనాటి విప్లవ వీరుల సాహసకృత్యాలు జగ్గనిలో వ్యక్తం అవుతాయి. అతని సిద్ధాంతం పైకి అంగీకార యోగ్యంగా కనిపించకపోయినా అది ఒక ధర్మ మార్గంగానే పలువురికి తోచింది. ఆనాటి ప్రభుత్వ చట్టాలు దోషిగా నిర్ధారిస్తున్నవి కాని జగ్గని పద్ధతి జనానికి కొంత సమ్మతంగానే అనిపించింది.

గోబర్‌హోరీ కుమారుడు పట్టణంలో అడుగు పెట్టక ముందు అమాయకుడు. పొలం పని చేస్తేనే ఇంట్లో అమ్మ అన్నం పెట్టేది. కష్ట పడితేనే కుటుంబం పస్తులు లేకుండా గడిచేది. అది చూచిన గోబర్ పనిచేస్తేనే బ్రతుకున్నదని నమ్మినవాడు. వితంతువు ఝునియాను తన దానిగా చేసుకున్న తర్వాతే ఆతను లక్నో పారి పోతాడు. ఊళ్ళో తాను నిలదొక్కుకోవాలంటే డబ్బును సంపాదించాలి లక్నో చేరిన గోబర్ మిర్జాఖుర్షీద్ దగ్గర కొలువు సంపాదిస్తాడు. తర్వాత టీ దుకాణం పెట్టి డబ్బు సంపాదించాడు – వాడలోని వాళ్ళందరికి తలలో నాలుక అవుతాడు. లోకం పోకడ తెల్సుకున్నాడు గోబర్ పల్లెటూరి మనిషి కాదిప్పుడు. రాజకీయాలు కూడా తెలుసుకో గలిగాడు. వర్గం అంటే ఏమిటో తెలుసుకో గలిగాడు. సంప్ర

దాయ సిద్ధంగా వచ్చే ఆచారాలంటే గౌరవం తగ్గింది. హోరీ పండుగ సందర్భంగా ఇంటికి వస్తాడు. వచ్చిన తర్వాత తెలుస్తుందిఝునియా మూలంగా పెద్దలు 'తప్పు' వేశారని తన పెళ్లికి డబ్బు లేక కుములుతున్న తండ్రి మీద పెళ్ళి ఖర్చుకంటె అధికంగా జరిమాన వేసిన పెద్దల మీద కోపం తెచ్చుకున్నాడు. ఆవేశంతో గోబర్ "ఆడదాన్ని (వితంతువును) తెచ్చుకుంటే యీ పంచాయితీదార్ల అబ్బ సొమ్మేం పోయింది? అసలు ఈ ఒక్క మాటమీద కేసుపెట్టానంటే చాలు ఒక్కొక్కరి చేతికి బేడీలు పడతాయి" అంటాడు [29] ఇంకా కోపం పట్టలేక "కర్రపట్టుకొని పటేశ్వరినీ సింగునీ, శాస్త్రినీ, ఒక్కొక్క ముండా కొడుకుని వీపులు పగిలేటట్లు బాది తప్పు వేసిన సొమ్ము కక్కించాలని" అంటాడు. యువకులంతా అతన్ని హీరోను చేస్తారు. తర్వాత సింగును, శాస్త్రిని భయపెడ్తూ పందన్నర వసూలు చేసుకొన్న మీ మీద దావా వేస్తానని, నన్నెవరు వెలివేస్తారో చూడాలంటాడు. పోట్లాటకు జడిసే ఘటం కాదు గోబర్. పండుగ రాత్రి హోరీ యింటి ముందే సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి. అందులో సింగు, ఠాకూర్, నొఖేరాం, పటేశ్వరీ శాస్త్రిల వేషాలు వేయించి ప్రహసనాల ద్వారా తన కసిని తీర్చుకున్నాడు. తెల్లారి పెద్దలకు బయట అడుగుపెట్టే పారం లేకుండా పోయింది. హోరీ మీద పెద్దలు కక్ష కట్టారు. శాస్త్రి హోరీని బలవంతంగా పనిలోకి రమ్మంటాడు. గోబర్ అడ్డు తగిలి "మేంకూలీలం గాదు, మాపాటు మేం చేసుకుంటాం" అంటాడు. నా అప్పు తీర్చమని శాస్త్రి అడుగుతాడు గోబర్ లెక్క చేసి డెబ్బై రూపాయలు యిస్తానంటాడు. శాస్త్రి రెండు వందల రూపాయలు చెల్లగట్ట మంటాడు. నీవు యిచ్చినవి ముప్పై రూపాయలు. అవి వందఅయి రెండొందలయినాయి. అప్పు ఇవ్వటం, బాకీ వడ్డీ క్రింద బ్రతికినంత కాలం కూలీ నాలీ లేకుండా చాకిరి చేయించు కోవటం, ఇది వడ్డీ వ్యాపారమా? నెత్తురు తాగటంగాని అని శాస్త్రి మీద లేచాడు గోబర్. తర్వాత నొఖేరాం హోరీని శిస్తు కట్టమని అంటాడు. బాకీ లేకుండా శిస్తు కట్టిన హోరీకి ఏమీ పాలుపోలేదు. గోబర్ ఆవేశంతో వెళ్లి "శిస్తు మేము బాకీ ఉన్నట్టుగా కోర్టు కెళ్ళి నీతో ప్రమాణం చేయించి అప్పుడు చెప్తానని, నోరులేని ఆసాముల అందరిని దగా చేస్తున్నావని జమీందారుకు చెప్తానంటాడు. చలి చెమటలు పుట్టిన నొఖేరాం శాంతి వచనాలతో "ఆఁ బాబు మీ నాన్న డబ్బు కట్టినట్లే జ్ఞాపకం వస్తుంది. శిస్తు కట్టేశాడు" అంటాడు. హోరీ గౌరవం కోసం చేయరాని అప్పులు చేశాడని

వాటికి నా పూచీ లేదని ఝునియాని తీసుకొని గోబర్ లక్నో వెళ్లి పోతాడు. ఝునియా రాగానే అతని జీవితం మారిపోతుంది. తాగుబోతు అవుతాడు. చక్కెర ఫ్యాక్టరీ యజమానులు కూలీలకు కూలీ తగ్గిస్తే కూలీలు సమ్మె కట్టారు గోబర్ కూలీల పక్షం వహించి సమ్మెలో పాల్గొని చావు దెబ్బలు తింటాడు.

నవల మొదట్లో గోబర్ మాటలు వింటుంటే గ్రామ పెద్దల మీద తిరగ బడతాడని పిస్తుంది. ఆవేశానికి తగినట్టుగా లిగల్‌గా మాట్లాట్టం మూలానా యావత్తు గ్రామాధికారుల స్వరూప స్వభావాలను బయట పెట్టి ఊళ్ళో తిరుగు బాటు తెస్తాడేమో అనిపిస్తుంది. స్నేహితులను వెంట పెట్టుకొని ఊరి పెద్దలను వణికిస్తాడు. హోలీ నాటి రాత్రి హోరీ యింటిముందు జరిగిన ఉత్సవాలలో ధ్వన్యనుకరణ చేసి పెద్దలందరిని అపహాస్యం పట్టిస్తాడు ఇన్నాళ్ల అన్యాయానికి బలి అవుతున్న కుటుంబాన్ని కాపాడు కుంటాడని పిస్తుంది. అమ్మ ఇక హోరీ కుటుంబానికి మంచి రోజులున్నాయని అనుకున్నంతలోనే మళ్ళి దుఃఖ కూపంలో కూరుకు పోతుంది. ప్రలాపి గోబర్ అనిన మాటలకు చేసిన చేతలకు ఎట్టి సంబంధం లేదు. అస్వాభావిక మార్పుకు లోనై స్వార్థ చింతనతో భార్యతో లక్నో వెళ్తాడు సమ్మెలో పాల్గొనటం కూడా యాదృచ్ఛికమై ఉంటుంది.

కార్మిక వర్గ నియంతృత్వ ఆవశ్యకతను ప్రేమ్‌చంద్ గుర్తించినంతగా ఉన్నవ గుర్తించలేదు. ఉన్నవ 'మాలపల్లి' వ్రాసే నాటికి కార్మిక వర్గం యింకా రూపు దిద్దుకొనలేదు. ఆ కారణంగానే మాలపల్లిలో కార్మికోద్యమాలు తీవ్రంగా మనకు కనిపించవు.

గోబర్‌కు చైతన్యం అప్పుడప్పుడు మెరిసి మాయమవు తూంటుంది. తండ్రి ''అతి నిజాయితి''కి మొదట విసుక్కుంటాడు. కాని కట్టుబాటు అలవాటు వల్ల తండ్రి మీది గౌరవం వల్ల ఎదురు మాట చెప్పడు.

పట్న జీవితం వల్ల అతనికి చాలా విషయాలు తర్కబద్ధంగా మాట్లాడటం తెలుస్తుంది. మాట్లాడటమే కాని పల్లె జీవితంలో ప్రవేశపెట్టే ఓపికా, నిస్వార్థత అతనికి కొరవడుతాయి. పట్న జీవితంలో అలవడిన వ్యష్టి స్వార్థం కూడా అతన్ని పల్లెలో ఉండలేకుండా చేస్తుంది. ఝునియా సంబంధం పల్లెలో అతన్ని భయ

పెడ్తుంది. పట్నం జీవితం అతనికి ఇచ్చింది నిజమైన ధైర్యం కాదు. ఫ్యాక్టరీ సమ్మె సందర్భంగానే అతడు కొంత చైతన్యంతో ముందుకు ఉరుకుతాడు. ఒక్కోసారి సంగదాసు వెంకటదాసుల సమ్మేళనంలా అనిపిస్తాడు కాని అది వారిని గుర్తుకు తెచ్చేంతటి బలహీనమైన పోలిక మాత్రమే.

# 4. సన్నివేశ సాదృశ్యం

మాలపల్లి-గోదాన్ నవలల్లోని ప్రధాన సన్నివేశాలలో కొంత సామ్యాన్ని దర్శించ వచ్చు. రచయితలు గ్రామాల్లో జరిగే నిత్య జీవిత సంఘటనల నన్నింటినీ అనుభవ పూర్వకంగా తెలియ చేశారు. 'మాలపల్లి' సన్నివేశ ప్రధానమైన నవల. గోదాన్ లోని సన్నివేశాలు కథ ఉన్మీలనానికి దోహదంగా, శిల్పానికి పోషకంగా ఏర్పడ్డాయి ఈ నవలల్లో కూలీ సమ్మెలు, ధనికుల డిక్రీలు, దొమ్మి, వెలులు, లంచాలు, నాటకాలు మున్నగు అంశాల్లో రెండింటికీ సాదృశ్యం కనబడుతుంది. ప్రాంతాలు వేరైనా అవి ఒకే తీరులో జరగటం విశేషం.

## కూలి సమ్మెలు

'మాలపల్లి' లో వ్యవసాయ కూలీలు, 'గోదాన్'లో మిల్లు కార్మికులు సమ్మె చేస్తారు. 'మాలపల్లి'లో గ్రామ పెత్తందారు చౌదరయ్య రైతు కూలీల కూలి తగ్గించటం మూలాన కోతల సమయంలో కూలీలుసమ్మె కడతారు. ఈసమ్మె సంగదాసు నేతృత్వంలో నడుస్తుంది. భూకామందుల వలలో చిక్కక కూలీ జనం సమ్మెను తీవ్ర తరం చేస్తారు. భూస్వామ్య వ్యవస్థ ధన స్వామ్యంగా మారే ఆ సంధి యుగంలో గింజలు యివ్వక డబ్బులిస్తామన్న పెత్తందార్లకు సమ్మె కంటకింపయ్యింది. భూస్వామి నష్టం భరించలేడు. అందుకే చౌదరయ్య రాగోలతో సంగదాసు తల బద్దలు కొడతాడు. లోకంలో అక్రమాలు చూచి ఆక్రోశించిన రక్తం కాలువలై పారింది. చివరికి కూలీలకు భూకామందులు లొంగిరాక తప్ప లేదు.

గోదాన్‌లో మిల్లు కార్మికులు సమ్మె చేస్తారు చెక్కెరమిల్లు యజమాని తక్కువ జీతం క్రింద కొత్త కూలీలను నియమించు కుంటాడు నియామకం

వల్ల రాజీ విచ్ఛిన్నమైంది. మిల్లు కార్మికులు సమస్య పరిష్కరణకు గానుకొత్త కూలీలను అడ్డుకోటానికి ప్రయత్నిస్తారు. కార్మికుల గుంపులో గోబర్ ముందు నడుస్తుంటాడు. ఉభయ కార్మికులు రెచ్చిపోయిన కారణంగా రెండు వర్గాల మధ్య పోట్లాటలు జరిగి గోబర్ చేయి విరిగి పోతుంది. తలపై బలమైన గాయాలు తగిలాయి. చావుదెబ్బలు తిన్న కార్మికులు ఆ మిల్లును అగ్నికి ఆహుతి చేస్తారు. అయితే ఈ సమ్మెల స్వరూపాలు వేరు. ఒకటి పల్లెలో మరొకటి పట్టణ ప్రాంతంలో జరుగుతుంది.

## ధనికుల డిక్రీలు

'మాలపల్లి' లో కంఠంరాజు సహాయంతో చౌదరయ్య వారసత్వ వ్యాజ్యం వేస్తాడు. రామదాసు ఆస్తి స్వాధీనానికి అక్రమంగా డిక్రీని పొంది రామదాసు యావదాస్తిని కైవసం చేసుకుంటాడు చౌదరయ్య. డబ్బున్న చౌదరయ్య కోర్టునుంచి అనుకూలమైన తీర్పు తెచ్చుకుంటాడు. నిస్సహాయుడు రామదాసు స్థిర చరాస్తులను దోచుకోనిస్తాడు. కటిక దారిద్ర్యానికి గురవుతాడు.

'గోదాన్'లో పటేశ్వరీలాల్, మంగ్రూశావుకారును ప్రోత్సహించి హోరీమీద దావా వేయించి డిక్రీని పొంది పంట సొంతం స్వాధీనం చేసుకుంటాడు. ఈ అన్యాయాన్ని సహించని హోరీ మంగ్రూశావుకారితో మొర పెట్టుకోబోతాడు కాని ఫలితముండదు. కటిక దారిద్ర్యానికి గురి అవుతాడు. ఆనాటి కోర్టులు ధనికుల వడ్డీ వ్యాపారుల గుప్పిట్లోనే ఉండేవి.[30] అందువల్ల పాక్షిక తీర్పునిచ్చాయి.

## వెలి

సాంఘిక జీవనంలో వర్ణాశ్రమ ధర్మం ప్రవాహంలో కొట్టుకొని పోని వారికి వెలి తప్పదు. నాలుగు పడగల హైందవనాగు వ్రేటు ఈ వెలి. సంఘ ధర్మానికి తలవొగ్గని కారణంగా గోదాన్‌లో హోరీని ఊరి పెద్దలు వెలివేస్తారు. హోరీ చేసిన తప్పు ఝునియా (వితంతువు) ను ఇంట్లో పెట్టుకోవటమే. హోరీ, ధనియాలకు సంఘం కట్టుబాట్లను ఆచరించాలని ఉన్నా ఝునియా దిక్కు లేనిది అవుతుందనే మానవతతో చేరదీస్తారు. వెలికి గురి అయినా ఆ కుటుంబం నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చుతుంది. ఊరి పెద్దలకే ఆందోళన.

'మాలపల్లి'లో రామానాయుడు సంగదాసుతో కలిసి అన్నం తిన్నాడని మున్సబు చౌదరయ్య కుటుంబాన్ని వెలి వేయ ప్రయత్నించాడు. ఊళ్లో నాలుగు కులాల వారిని పోగుచేసి విషయాన్ని కూడా వివరించాడు. ఊళ్లో వాళ్ళు చౌదరయ్య భూకామందయిన కారణంగా నోరు మెదుప లేదు. చౌదరయ్య వెలికి గురికాలేదు. కుల బహిష్కరణ, సంఘ బహిష్కరణలు డబ్బుకు లోబడి ఉన్నట్లు ఈ నవలల ద్వారా మనం తెల్సుకొంటాం.

## లంచాలు

చట్ట విరుద్ధమైన లంచం ఆనాడు విచ్చల విడిగా సాగింది-సంగదాసు హత్య సందర్భంలో పోలీసు ఇన్స్పెక్టర్ చౌదరయ్యకు రక్షగా ఉండి, మున్సబు పంచాయితీ సభ్యులు పంచనామా సాక్షులుగా ఉండి లంచాలు లాగుతారు. హంతకుడెవరో తెలిసినా అతనికి శిక్షపడలేదు. డబ్బు నేరాన్ని కప్పిపుచ్చింది. గోదాన్‌లో నాఖేరాం శాస్త్రి, పటేశ్వరీలాల్ గోవు హత్య సందర్భంలో హోరీ నుంచి లంచం రాబట్టుకోటానికి ప్రయత్నిస్తారు. ఝునియా విషయంలో 'తప్పు' వేసి లంచాలు లాగారు. ఈ లంచాలు ధాన్యం డబ్బు రూపంలో వసూలు చేసుకోవటం ఒక విధం, రైతుల వద్ద మామూళ్ళ పేరుమీద వసూలు చేసుకోవటం రెండో విధం. లంచాలలో ఆ ప్రాంతం జమీందారుకు పాలు ఉండటం విశేషం. పై అధికారుల నుంచి క్రింది అధికారుల వరకు ఈ లంచాలు సాగుతున్నాయంటే ఆనాటి ఏలుకలు సమాజాన్ని అవినీతితో ఎంత కలుషిత పరిచారో ఊహించవచ్చు.

## దొమ్మి

తమ నాయకుడు సంగదాసు హత్యచూచి కులమత విభేదాలు మరచి అతని అనుయాయుల గుంపు "ఏదీ వాడి రక్తం కళ్ళ చూస్తాం", "ఏడీ వాడి పేగులు పీకి జందెం వేసుకుంటాం" అంటూ చౌదరయ్య యింటిమీదికి దొమ్మికి వచ్చింది. 'మాలపల్లి'లో ధనిక రైతు చౌదరయ్య గుండె అదరింది. సిలియా విషయంలో ఉద్రిక్తులయిన మాదిగెలు "మమ్మ మీ కులంలో కలుపుకునే దమ్ములు లేవు. మేమే మీవాణ్ణి మాకులంలో కలుపుకుంటా"మని మాతాదీన్ బ్రాహ్మణత్వాన్ని చెడగొడతారు. గూడెంలో ఉన్నయావత్తు జనంవచ్చి శాస్త్రీ పరినూర్పే కళ్ళం చుట్టూ దేవావేస్తారు. ఏమయిలేనేమి హరిజనులు అగ్రవర్ణాల వారిని

హడలెత్తించారు. ఈ దొమ్మీల ద్వారా ఊరిపెత్తందార్లను ఎదుర్కొన్న ధైర్యాలు, అనుసరించిన విధానాలు బానిసత్వం నుంచి బయటపడేందుకుచేసిన ప్రయత్నాలుగా కనిపిస్తాయి. అగ్రవర్ణాలవారి అహంకారానికి హద్దులు వేసినట్లుకూడా అయింది.

## పిల్లల చావులు

సాహు, రాములపాత్ర చిత్రణంతో యిద్దరు చూపిన ప్రేమవైనం ఒక్క తీరుగానే ఉన్నా పిల్లలు మరణించేది వారి ధ్యేయంకాదు. బాలబిద్దరూ ఒక లక్ష్యం లేకుండా జీవించారు. వ్యవస్థాపరంగా ఆలోచిస్తే కమల (మాలపల్లి) భర్తనిర్లక్ష్యం వల్ల ఏర్పడే పల్లె జీవితంలోని నిస్తబ్దతలో ప్రలోభాలతో పట్టణజీవిత వ్యామోహా నికి గురయిన కారణంగా సాహు జీవితం బలిఅయిపోతుంది. సిలియా (గోదాన్) వ్యక్తి చైతన్యం మాత్రం గలది. సంఘ చైతన్యం శూన్యం కాబట్టి ప్రేమ ముసుగులో మొదట లైంగికంగా దోచుకోబడి తర్వాత శ్రమ దోపిడికి గురిఅయింది. కూలితల్లి కొడుక్కు రక్షణ ఎంతయిస్తుంది పాపం. శ్రద్ధ లేని కారణంగా పసి కందు బలైపోతాడు. సంఘం హీనంగా చూచిన తర్వాతే మాతాదీన్‌లో కొత్త చైతన్యం వచ్చి అప్పుడు త్రికరణశుద్ధిగా సిలియాకు లోబడుతాడు.

## కళా రూపాలు

గ్రామీణ వాతావరణం ఈ నవలల్లో చిత్రించింది. అచ్చంగా పొలం పనుల తోను, శ్రమతోను, సమస్యలతోను సరిపెట్టుకోక గ్రామీణ సంబంధాలయిన పాట లను, భజనలను, నాటకాలను కూడా వివరిస్తారు రచయితలు. పల్లెల్లో పండుగ సందర్భాల్లో, వ్యవసాయ పనులులేని సమయాల్లో నాటకాలు ప్రదర్శించటం నాటి నుంచి వస్తూన్న విషయం. ప్రయోజనం ఎట్లా ఉన్నా పల్లెల్లో చాలా మంది శ్రమను మరిచేందుకు నాటకాన్ని చూడొస్తారు. భక్తి ప్రధానమైన భాగవత రామాయణాది నాటకాలు ఎక్కువగా పల్లెల్లో ప్రదర్శిస్తారు. సాంఘిక నాటకాలు అరుదు. 'మాలపల్లి' నవలలో ప్రదర్శింపబడ్డది ప్రహ్లాద నాటకం. 'గోదాన్'లో హోలీ సందర్భంగా గోబర్ స్నేహితులు కల్సి నాటకం వేస్తారు. సాంఘిక నాటకమది. అందులో ఆపూరి పెత్తందార్ల ఆగడాలకు అద్దం పట్టిన నాటకం. లంచాలకు మరిగిన లంచగొండీల నిజరూపాలు బయటపెట్టిన నాటకం. ప్రహసన మైనా ఆ నాటకం పడుచువాళ్ళను పరుగులు తీయించింది. అర్థదారిన పోయే

పెద్దలకు బుద్ధిచెప్పి వారి ఆగడాలకు అడ్డు గోడకట్టింది అలాగాజనం ఈ కల్పన ద్వారా తమ తమ కసిని తీర్చుకొని సంతోషించింది.

రచయితలు తమ నవలలకు పరిధిగా పల్లెటూరులను ఎన్నుకొని ఆపల్లెల్లో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలను కూడా చిత్రిస్తారు. పల్లెజీవనంలో భాగమైన కళారూపాలను మరుగు పరచక వాస్తవిక చిత్రణంకూడావారుచేశారు. సినిమాలు వచ్చి నందున ఈ రోజుల్లో నాటకాలను ఆదరించలేకపోవచ్చుగాని ఇప్పటికి పల్లె ప్రాంతాలలో వానికి ఆదరణ బాగా వుంది అడపా దడపా ప్రదర్శింపబడే నాటకాల ద్వారానే ప్రజలు చైతన్యవంతులయినారు. గోదాన్‌లో ఈ చైతన్యం తాలూకు లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి

## పాద సూచికలు

1. "ఇదే రోజుల్లో అనేక భారతీయ భాషల్లో క్రొత్త క్రొత్త సాహిత్యోద్యమాలు కూడా తలెత్తాయి. ఈ ఉద్యమాల లక్ష్యం వాడుకభాషకు దగ్గఱగా ఉండే ప్రామాణికమైన భాషను రూపొందించటం. బెంగాల్‌లో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ నాయకత్వం క్రింద జరిగినది యిదే. తెలుగునాట వీరేశలింగం నాయకత్వం క్రింద జరిగిన ఉద్యమ ప్రధాన లక్ష్యం కూడా యిదే. సర్ సయ్యద్ అహమ్మద్‌ఖాన్ నాయకత్వం క్రింద ఉర్దూలోనూ, భరతేందుహరిశ్చంద్ర నాయకత్వం క్రింద హిందీలోనూ సాగిన ఉద్యమాల ముఖ్యలక్ష్యం కూడా యిదే.

చూ. డా॥ రాజబహదూర్‌గౌర్ వ్యాసం "ప్రేమ్‌చంద్ రచనల్లో సందేశం" అభ్యుదయ, నవంబర్ 1979.

2. ప్రేమ్‌చంద్—మోరిజ్, డా॥ ఎవాఅరదీ
అభ్యుదయ — మే, జూన్ — 1980.

3. 1908లో ఖుదిరాంబోసు కింగ్స్‌ఫర్డ్ మీద బాంబు విసిరినందుకు ఉరితీయబడ్డాడు. ఆయనపట్ల అభిమాన సూచకంగా ప్రేమ్‌చంద్ తన ఉద్యోగం ఊడుతుందని తెల్సికూడా ఆతని చిత్రపటాన్ని గదిలో పెట్టుకున్నాడు.

కామేశ్వరరావు కూడా బ్రిటిషు ఉద్యోగిని చంప చూచినప్పుడు హింసా సిద్ధాంతాన్ని బలపర్చాడు. రావుగారు తలపెట్టిన కార్యం నిష్కామకర్మంగా నమ్ముచున్నానని ఉన్నవ అన్నాడు.

చూడు. ఉన్నవ రచనలు కొన్ని కె.వి. రమణారెడ్డి. పేజి *XV*.

4. మాలపల్లి — గోదాన్‌లు వ్యావసాయక ప్రాధాన్యం ఉన్న నవలలు. నవలా రచయితలు అందులోని పాత్రలను ఆనాటి స్థితిగతులను దృష్టిలోపెట్టుకొని పోషించారు. రచనాకాలంనాటి భూమిశిస్తు విధానాన్ని కొంత పరిశీలించనిదే ఆ పరిస్థితి బోధపడదు.

5. సర్‌థామస్‌మన్రో, మద్రాసు గవర్నర్.

6. చూడు. ఆంధ్రదేశ చరిత్ర-ఆధునికయుగం.
జి. వెంకటరామారావు. పేజి 35. దక్షిణ భారత్ప్రెస్. హైద్రాబాద్1982

7. ఆధునిక భారత చరిత్ర. బిపిన్ చంద్ర. తెలుగు-సహవాసి
పేజి. 91 హైదరాబాద్ బుక్ ట్రస్టు – 1983.

8. గోదాన్ రచయిత ఈస్థితిని ఉన్నదున్నట్లు చిత్రించాడు.

9. మాలపల్లి—పేజి. 124

10. మాలపల్లి—పేజి. 130

11. మాలపల్లి—పేజి. 91

12. గోదాన్ (తెలుగు) పేజి. 21

13. మాలపల్లి—పేజి. 195

14. అదే పేజి—197

15. గోదాన్ (తె) పేజి. 83

16. మాలపల్లి—పేజి. 449

17. మాలపల్లి—పేజి. 524

18. గోదాన్ (తె) పేజి. 358

19. మాలపల్లి—పేజి. 40

20 మాలపల్లి—పేజీలు. 25, 26

21. గోదాన్ (తె) పేజి. 105

22. మాలపల్లి—పేజి. 194

23. మాలపల్లి—పేజి. 360

24. అదేపేజి—479

25. ఆకే పేజి—509

26. గోదాన్—పేజి. 96

27. మాలపల్లి లేక సంగ విజయము. పేజి. 10. విమర్శక వ్యాసావళి. పి. జగన్నాథస్వామి, శేషాచలం అండ్ కం., మచిలీపట్నం. 1954

28. మాలపల్లి—పేజి. 689

29. గోదాన్ (తె.) పేజి. 213

30. ఆధునిక భారత చరిత్ర. పేజి 70.

# ముగింపు

ఈ వ్యాసంలో నా పరిశీలన ప్రధానంగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ దృక్కోణాలతో జరిగింది. రైత్వారీ, జమీందారీ వ్యవస్థల పరామర్శ, ఇతివృత్తాల నడుమ పోలికలూ తేడాలూ, పాత్రల సృష్టిలో సజీవస్ఫూర్తి, సన్నివేశాల కల్పనలలో రచయితలు సాధించిన సాంఘిక ప్రయోజనం మొదలైన అంశాలను తులనాత్మక దృష్టితో చూపే ప్రయత్నం చేశాను. తులనాత్మక ప్రకరణం (నాల్గవది) ఒక్కటే అయినా మొదటి మూడు ప్రకరణాలను నేపథ్యప్రాయంగా ఒక క్రమోన్మీలన పద్ధతిలో మలచుకున్నాను. ఎక్కువ సమాచారాన్ని అందించాలనే చాపల్యంతో, సమగ్రంగా చెప్పాలనే తాపత్రయంతో కొన్ని వివరాలను విస్తరించటం జరిగింది.

అయితే నా వ్యాస పరిమితుల్లో ఈ సమగ్రత అనేది అగమ్యం అని తెలుసుకున్నాను. ఇంకా పరిశీలించ వలసిన అంశాలు ఎన్నో ఉన్నాయనీ వదిలేసినవి ఈ అసంపూర్ణతను ఎత్తిచూపిస్తాయని గుర్తించాను.

పాత్రల విషయానికొస్తే ప్రధాన పాత్రల పరిశీలనే జరిగింది. కాని కీలకమైన చిన్న పాత్రలనెన్నింటినో వదిలివేయవలసి వచ్చింది. 'మాలపల్లి'లో కమల, రామానాయుడు, జ్యోతి, అప్పదాసు, మోహన్, లక్ష్మమ్మ, నారాయణరావు మున్నగు పాత్రలు, 'గోదాన్'లో ఝునియా, సిలియా, మాతాదీన్, నోహరి, సోనా మున్నగుపాత్రలు కథాగమనంలో, లక్ష్య వివరణలో ఆయువుపట్లు వంటివి. స్థల విస్తరణ భీతి, ఇప్పటికే రాశిపెరిగిందన్న శంకా, భయ సందేహాలు వీటిని గూర్చి వివరంగా చెప్పలేక పోవటానికి కారణం.

అట్లాగే 'మాలపల్లి'లో కమలా మోహన్‌ల వృత్తాంతం, జ్యోతి అప్పదాసుల వృత్తాంతం, రామదాసు తాత్త్విక చింతన, జైలు జీవితం మొదలయినవి కూడా వ్యాసపరిధిలోకి రావనే ఉద్దేశంతో పరిశీలించలేదు. 'గోదాన్'లో మాతాదీన్, సిలియా వృత్తాంతం స్థల విస్తరణ భీతితో రాయలేదు.

'మాలపల్లి– గోదాన్'లు సజీవ నవలలు. వీటిని గూర్చి అనేక దృక్కోణాల్లో పరిశీలించ వచ్చు. ఒక పరిమిత లక్ష్యంతోనే నా పరిశీలన సాగింది.

# ఉపయుక్త సామాగ్రి
## ( BIBLIOGRAPHY )

దీనిలో ఉన్నవ రచించిన 12 గ్రంథాలు గానీ, రెండు పదులపైన పీఠికలూ వ్యాసాలుగాని చేర్చటంలేదు. మొదటి ప్రకరణంలో వాటి గురించి చర్చించటం జరిగింది. అట్లాగే ప్రేమ్‌చంద్ రచించిన 13 నవలల్లో 8 నవలలు, 3 నాటకాలు, 3 అనువాద గ్రంథాలు, 300 కథల్లో కొన్ని ముఖ్యమైనవి కూడా అక్కడే పేర్కొనటం జరిగింది 'మాలపల్లి' 1957 నాటి తృతీయ (దేశీ కవితామండలి) ముద్రణం, 'గోదాన్' హిందీ నవల (1980 సరస్వతిప్రెస్-న్యూఢిల్లీ ముద్రణం) ముఖ్యంగా శ్రీ.అట్లూరి పిచ్చేశ్వరరావు తెలుగు అనువాదం(విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ 1981) వ్యాస పరిశీలనకు ఉపయోగపడ్డాయి.


అస్పృశ్యతా నివారిణి. — టి. నర్సయ్యాగుప్త, గోల్కొండ పత్రికా ముద్రాక్షరశాల, హైదరాబాద్ 1958.

ఆంధ్రదేశ చరిత్ర-ఆధునిక యుగం. — జి. వెంకట రామారావు, దక్షిణ భారతప్రెస్, హైదరాబాద్ 1982

ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య పోరాటం. — హైమవతి. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, హైదరాబాద్ 1975.

ఆధునిక భారత చరిత్ర. — బిపిన్‌చంద్ర. తెలుగు: సహవాసి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ 1983.

ఉన్నవ — కొన్ని రచనలు. కె.వి. రమణారెడ్డి.
సొసైటి ఫర్ సోషల్ చేంజ్, కావలి,
జవహర్ ప్రెస్, నెల్లూరు 1979.

ఉన్నవ లక్ష్మీనారాయణ శతజయంతి సభా సంచిక. సొసైటి ఫర్ సోషల్ చేంజ్
కావలి 1980.

కులం పునాదులు. కె. పద్మారావు.
నెల్లూరు హేతువాద సంఘం. 1981.

కుల నిర్మూలన ఎలా?. జె. పీరాస్వామి.
కులనిర్మూలన సంఘం,
హైదరాబాద్ 1979.

గుంటూరుజిల్లా స్వరాజ్య ఉద్యమం. నవ ప్రింటర్స్
బెంగుళూరు, 1974.

జాతి నిర్మాతలు. జి. వెంకట సుబ్బయ్య
దేశీ బుక్ డిస్ట్రిబూటర్స్,
హైదరాబాద్ 1981.

దళితజాతుల ప్రైతాళికుడు అంబేడ్కర్. వి. ప్రసాద్‌రావు.
విజయ ప్రసాద్‌రావు పబ్లికేషన్స్,
విజయవాడ 1979.

ప్రేమ్‌చంద్ జీవితం శివరాణీదేవి
అనువాదం - వాసిరెడ్డి సీతాదేవి.
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ 1980.

| | |
|---|---|
| ప్రేమచంద్ జీవితం, సాహిత్యం. | దాశరథి రంగాచార్య<br>యువభారతి ప్రచురణ<br>సాహితీ సంస్కృతిక సంస్థ,<br>సికింద్రాబాద్ 1981. |
| భారత స్వాతంత్ర్య సమర చరిత్ర. | పడాల.<br>ఆంధ్రశ్రీ పబ్లికేషన్స్, రాజమంద్రి 1970 |
| మాలపల్లి — ఒక పరామర్శ.<br>(ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాసం. అముద్రితం) | జి. ఆంజనేయులు నాయుడు<br>శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,<br>తిరుపతి. 1980 |
| మాలపల్లిపై ప్రభుత్వనిషేధాలు. | బంగోరె. నవోదయ పబ్లిషర్స్,<br>విజయవాడ. 1979. |
| మాలపల్లిలో పాత్రా చిత్రణం.<br>(ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాసం,<br>అముద్రితం) | పి. భాగ్యమ్మ.<br>కాకతీయ యూనివర్శిటీ,<br>వరంగల్ — 1981. |
| మాలపల్లి — సామాజిక స్పృహ.<br>(ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం<br>అముద్రితం.) | జె. సుహాసిని పాండె<br>నాగార్జున యూనివర్శిటి<br>గుంటూరు. 1979. |
| రాజారాంమోహన్‌రాయ్. | కె. తారకం.<br>యం. శేషాచలం అండ్ కంపెని<br>సికింద్రాబాద్. 1979. |

లక్ష్మీనారాయణులు. యం. ఉపేంద్రశర్మ. గాంధి సాహిత్య ప్రచురణాలయం హైదరాబాద్. 1974.

సంఘసంస్కర్త - ఉన్నవ. జి. వెంకట సుబ్బయ్య దేశి బుక్ డిస్ట్రిబ్యూటర్స్ హైదరాబాద్. 1977.

సాహిత్యోపన్యాసములు—17. (ఉన్నవశత జయంత్యుత్సవ సందర్భంలో ప్రచురితం) నమశ్శివాయ; గంగప్ప, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి. హైదరాబాద్. 1980

## వ్యాసాలు

అంటరానితనము—ఆంధ్రనారీమణులు. మాగంటి బాపినీడు. గృహలక్ష్మి. 1925.

అంటరానితనం రెండు నవలలు. వై. వెంకటరామయ్య. అభ్యుదయ, అక్టోబర్. 1981.

అనర్థదాయకమైన అంటరానితనం. యం.ఎస్. రాజలింగం. పంచాయత్, జనవరి. 1980.

అసమగ్ర దృష్టి. యస్. రామమోహనరావు. అభ్యుదయ, ఆగస్టు. 1979.

అస్పృశ్యతా నిర్మూలన—స్త్రీల విధి కృత్యము. దేశిరాజు భారతీదేవి. గృహలక్ష్మి. 1925.

| | |
|---|---|
| ఉన్నవ లక్ష్మీనారాయణ. (తెలుగు సంస్కృతి — చరిత్ర) | విజ్ఞాన సర్వస్వం తెలుగుభాషాసమితి. హైదరాబాద్. 1961 |
| ఉన్నవ లక్ష్మీనారాయణ. | సంచారి, అరుణతార. అక్టోబర్, జనవరి. 1978-79 |
| కథకచక్రవర్తి. | దేవగుప్తపు విశ్వేశ్వరరావు. భారతి-అక్టోబర్. 1939. |
| కలంపట్టిన యోధుడు ప్రేమ్‌చంద్. | సంచారి. అరుణతార, సెప్టెంబర్, నవంబర్ 1979 |
| కీ.శే. ఉన్నవలక్ష్మీనారాయణ. | ఏటుకూరి బలరామమూర్తి. అభ్యుదయ, ఫిబ్రవరి 1981 |
| జాతి నిర్మాతలు. | చంద్రశేఖరరెడ్డి సారస్వతపరిషత్, హైదరాబాద్. 1981 |
| జాతీయోద్యమ గర్భంలో సామ్యవాదం కులాల్ని సజీవంగా చూపిన మొట్టమొదటి నవల. | డా॥ కే. రామకోటిశాస్త్రి. అభ్యుదయ, జూలై 1980. |
| తెలుగుభాషలో రాజకీయ నవల. | మహీధర రామమోహనరావు. అభ్యుదయ, జనవరి 1980. |
| నవభారత సాహితీ స్రష్ట ప్రేమ్‌చంద్. | బెహరా. స్రవంతి, ఏప్రిల్. 1980. |
| నవలల్లో భూమి సమస్య. | ఎ. ఎస్. నాగేశ్వరరావు. ప్రజాసాహితి, మే. 1981. |

నేటికీ కోటి కిరణాలచ్యుతులు ప్రేమ్‌చంద్ కృతులు. — అమృత్‌రాయ్. అభ్యుదయ. జూలై 1980

ప్రజాసాహితీ నిర్మాత ప్రేమ్‌చంద్. — పసలభీమన్న. అభ్యుదయ. ఆగస్టు 1979

ప్రేమ్‌చంద్ తాత్విక చింతన. — ఏటుకూరి బలరామ్మూర్తి. అభ్యుదయ. మార్చి. 1980.

ప్రేమదూత—ప్రగతిశీలి ప్రేమ్‌చంద్. — ఎం. సత్యనారాయణ ప్రజాసాహితి. జనవరి. 1980.

ప్రేమ్‌చంద్—మోరిజ్. — డా॥ ఎవా అరది. అభ్యుదయ. మే మరియు జూన్. 1980.

ప్రేమ్‌చంద్ రచనల్లో సందేశం. — డా॥ రాజబహదూర్ గౌర్. అభ్యుదయ. నవంబర్. 1979.

ప్రేమ్‌చంద్ లేవనెత్తిన ప్రశ్నలే ప్రజారచయితలకు వారసత్వం. — జనసాహితి సాంస్కృతిక సంస్థ. హైదరాబాద్ సాహిత్య సమాలోచన జనసాహితి. నవంబర్. 1980.

ప్రేమ్‌చంద్ సృష్టించిన సజీవ పాత్రలు. — జి. సుందరరెడ్డి. స్రవంతి. అక్టోబర్. 1980.

మాలపల్లి. — శ్రీమతి కాత్యాయని విద్మహే. విమర్శిని పరిశోధన పత్రిక. 3. కాకతీయ యూనివర్శిటి. వరంగల్. 1978.

| | |
|---|---|
| మాలపల్లి. | పి. సత్యపతి. ఆంధ్రదర్శిని, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. విజయవాడ. 1976. |
| మారుతున్న కాలం-మాలపల్లి. | రామ్మోహన్‌రాయ్. భారతి. 1972. |
| మాలపల్లి—కొన్ని పాత్రలు. | స్ఫూర్తిశ్రీ. స్ఫూర్తిశ్రీ వ్యాసావళి, ౧ భాగం విపంచిక ప్రచురణలు. కాకినాడ. 1965. |
| మాలపల్లి—ఒక సమీక్ష. | యం. వై. రెడ్డి. స్రవంతి, మే. 1959. |
| మాలపల్లి—జగ్గడిపాత్ర | శ్రీమతి. సంజీవమ్మ. అభ్యుదయ. మార్చి. 1980. |
| మాలపల్లి—సంగవిజయము. | పాదనంది జగన్నాథస్వామి. విమర్శక వ్యాసావళి. ఎం. శేషాచలం & కంపెని మచిలీపట్నం. 1954. |
| మాలపల్లి—సంగవిజయము. | శ్రీనివాస శిరోమణి. భారతి. నవంబర్. 1945. |
| మాలపల్లి లేక సంగవిజయము. | డా॥ బి. కుటుంబరావు. ఆంధ్రనవలా పరిణామం గాయత్రి ప్రచురణ హైదారాబాద్. 1971 |
| మావో గురించి ప్రేమ్‌చంద్. | అమిత్‌కుమార్ గుప్తా. అరుణతార. అక్టోబర్. 1981. |

| | |
|---|---|
| యువజనోద్యమ ఇతిహాసంలో కాంగ్రెసు పిలుపు లేకుండానేసాగిన క్విట్ ఇండియా మహోద్యమం. | కె. ప్రతాప్ రెడ్డి. యువజన. మార్చి. 1977. |
| సంగవిజయము. | డా॥ పి.వి. చలపతిరావు. స్రవంతి. జూన్. 1983. |
| స్వర్గీయ ఉన్నవ లక్ష్మీనారాయణ. | ఎ. గోపాలరావు. భారతి. అక్టోబర్. 1958. |
| సాంఘిక సంస్కరణకు తోడ్పడిన మాలపల్లి నవల. | ఉన్నవ శతజయంత్యుత్సవంలో ప్రవక్తల ప్రశంస. అభ్యుదయ. అక్టోబర్. 1979. |
| హరిజన జీవితాన్ని చిత్రించిన రెండు నవలలు. | పి. రామకృష్ణారెడ్డి. అరుణతార. సం. 3. సం. 1. మార్చి 1980 గుంటూరు. |

## ప్రసక్తులు

| | |
|---|---|
| ఆంధ్రలో సంఘ సంస్కరణోద్యమం. | ఏటుకూరి బలరామ్మూర్తి. ఆంధ్రదర్శిని, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. 1976. |
| జాతీయనాయకులు | కోటమర్తి చిన రఘుపతి రావు. సత్యనారాయణ పబ్లికేషన్స్ రాజమండ్రి. 1945. |

తెలుగు నవల నూరు సంవత్సరాలు — ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి. శతజయంతి సంచిక, హైదరాబాద్, 1973.

తెలుగు నవలా వికాసం — మొదలి నాగభూషణశర్మ, పద్మజాభూషన్ పబ్లికేషన్స్, హైదరాబాద్. 1971.

తెలుగు నవలా సాహిత్యవికాసం — పుల్లాభట్ల వెంకటేశ్వర్లు. వై. ఎస్. ప్రెస్, ఖమ్మం 1974.

తెలుగు సాహిత్యం—గాంధీజీ ప్రభావం. — మొదలి నాగభూషణశర్మ. గాంధిసాహిత్య ప్రచురణ, హైదరాబాద్. 1970.

నెలవంక (సాహిత్యవార్షిక సంచిక) — ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల, హైదరాబాద్. 1980.

పరిశీలన. — దాశరధి రంగాచార్య గౌతమి ఎడ్యుకేషన్ సొసైటి, సికిందరాబాద్. 1983.

ప్రత్యేక రాష్ట్రవాంఛ. — ఆంధ్రప్రదేశ్ దర్శిని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. 1976.

మన నవల పరిశీలనము. — వ్యాస సంకలనం. చైతన్య సాహితి, వరంగల్. 1971.

మన నవల పరిశీలన—సమీక్ష — దేవరాజు మహారాజు అభ్యుదయ. నవంబర్. 1979.

| | |
|---|---|
| మహాత్మకథ. | తెనుగులెంక తుమ్మల. ప్రచురణ. 1968. |
| సమాజము సాహిత్యము. | ఆర్. ఎస్. సుదర్శనం. చిత్తూరుజిల్లా రచయితల, సహకార సంఘం. చిత్తూరు. 1972. |
| సాహిత్య దర్శనము. | కాటూరి కవితాలత. దుర్గాగ్రహారం, విజయవాడ. 1979. |

హిందీ

| | |
|---|---|
| ప్రేమ్‌చంద్. | అమృత్‌రాయ్. నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా, న్యూఢిల్లీ. 1978. |
| ప్రేమ్‌చంద్‌కే ఉపన్యాస్‌మే మానవీయ్ ఆదర్శోంకే పరికల్పన్ | ఇందూ వశిష్ఠ రాష్ట్రినాయక్ – సప్తాహిక్ ప్రేమ్‌చంద్ జన్మ శతాబ్ది అంక్ హైదరాబాద్. 1979. |
| స్వతంత్ర్ సేనాని అల్లూరిసీతారామ్‌రాజ్ | డా॥ యన్. పి. కుట్టన్ పిల్లే శ్రీ హనుమాన్ పబ్లికేషన్. హై. |

ఆంగ్లం

| | |
|---|---|
| Agrarian stratification : OLD Issues New Explanation and new Issues old Explanations. | K. L Sharma Economics and political weekly Vol X VIII No. 42 Oct. 15. 1983. |
| Telugu Novel | Yuva Bharathi. A literary and Culturul Organisation. Secundrabad. |
| Political Implication of Untouchability | Avula Gopala Jeeva Ratnam. Kondaveedu press, Hyd. FEB. 1973. |